అపరాధ పరిశోధన అనుబంధం—143

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అల్లుడు!?

రచన : వసుంధర

## హిమబిందు

రచన: ఎమ్. డి. చైతన్య

## అన్వేషణ?

రచన : బొమ్మిడి అచ్చారావు

విషకన్య - ఐదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—143
నవంబరు, 1985
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1

# అల్లుడు!?

## వసుంధర

సమయం—మిట్టమధ్యాహ్నం రెండు గంటలు.

కుసుమ మంచి నిద్రలో వుంది.

ఆ సమయంలో ఎవరో యింటి తలుపులు తట్టారు. ఆమెకో పట్టాన మెలకువ రాలేదు. మెలకువ వచ్చేక విసుగ్గా లేచి టైము చూసుకుంది.

ఇంకా భర్త వచ్చే టైము కాలేదు.

"ఇప్పు డెవరొచ్చారు చెప్మా!" అనుకుంటూ చిరాగ్గా వెళ్ళి తలుపుతీసింది. ఉన్నపళంగా లోపలకు జొరబడి తలుపులు వేశా డో యువకుడు.

"ఎవర్నువ్వు?" అంది కుసుమ కంగారుగా. ప్రశ్న అడిగాకనే అతడి నామె చూసింది.

చామనచాయ రంగు. అయిదడుగుల ఆరంగుళాల పొడవు. సన్నగా నాజూగ్గా ఉన్న ఆ యువకుడి చేతిలో అడుగు పొడవున్న కత్తి కూడా ఉంది.

"నా పేరు విజయ్—" అన్నా డా యువకుడు.

# 4

"ఎందుకొచ్చావిక్కడికి?" అంది కుసుమ.

"నీ కోసం...."

"నాతో నీకేం పని?"

"చాలా రోజులుగా నిన్ను చూస్తున్నాను. ఎప్పుడూ నీ భర్త నీ పక్కనే ఉంటున్నాడు. నాకు నీమీద మనసయింది. ఇలా వచ్చాను—" అన్నాడు విజయ్.

అతడలా మాట్లాడేసరికి కుసుమకేం చేయాలో తెలియలేదు. అతడికేం బదులివ్వాలో కూడా తెలియలేదు.

"భయపడకు. నేనిలా వచ్చినట్లు నీ భర్తకు తెలియదు. ఇక్కడ కాసేపుండి వెళ్ళిపోతాను. అంతే!" అన్నాడు విజయ్.

"కాస్త మర్యాదగా మాట్లాడు...." అంది కుసుమ.

"నీ యింటికి అతిథిగా వచ్చాను. మర్యాదలు పొందవలసింది నేను...." అన్నాడు విజయ్.

"నువ్వు అతిథివి కావు...." అంది కుసుమ.

"నా చేతిలోని కత్తిని చూసి మళ్ళీ ఆ మాట అను...." అన్నాడు విజయ్.

కుసుమ భయంగా అతడి చేతిలోని కత్తివంక చూసి—"అంటే?" అంది.

"నీకు మానప్రాణాల్లో ఏది ముఖ్యమో త్వరగా తేల్చుకో. నాకు అసహనం ఎక్కువ. నేను చెప్పినట్లు విని నాకు సహకరించావా సరేసరి. అరిచినా అల్లరిచేసినా నా కత్తి సూటిగా నీ గుండెల్లో దిగుతుంది...." అన్నాడు విజయ్.

"ప్లీజ్! నన్ను బెదిరించకు.... వెళ్ళిపో.. " అంది కుసుమ.

# 5

"వెడతాను. కానీ అప్పుడే కాదు...."

కుసుమకు మాట రాలేదు. అతడివైపే అలా చూస్తూండిపోయింది.

"మాట్లాడవేం?" అన్నాడు విజయ్.

"ఏం మాట్లాడను? నిన్ను చూస్తేనే భయం వేస్తోంది...."

"అయితే నే నడిగిన ప్రశ్నలకు బదులు చెప్పు...."

కుసుమ పెదవి కదపకుండా అతడివంకే చూస్తోంది. అడిగినవాటికి బదులిస్తా నన్నట్లు చూస్తున్నాయామె కళ్ళు.

"ఇంట్లో కుళాయిలో నీళ్ళు ఎప్పుడు వస్తాయి?"

"ఇరవై నాలుగు గంటలూ నీళ్ళొస్తాయి మాకు...." అంది కుసుమ.

"అయితే స్నానాల గది యెక్కడ?"

"అటు—...." అంది కుసుమ.

"అలైతే పద...." అంటూ అతడామె ననుసరించాడు.

స్నానాల గది విశాలంగానే ఉంది. కుళాయి, వాష్ బేసిన్, షవరు కూడా వున్నాయి. నేలమీద రెండు ఇనుప బకెట్లు, ఒక ప్లాస్టిక్ బకెట్టు—ఉన్నాయి.

అతడామెను గదిలో ఒక మూల నిలబడమన్నాడు. బకెట్లు తీసి గది బయట ఉంచమన్నాడు.

"ఇప్పుడు గది మరింత విశాలంగా ఉంది కదూ!" అన్నాడతడు.

ఆమె బదులివ్వలేదు.

"నువ్విలా మౌనంగా ఉంటే నా కత్తి నిన్ను మాట్లాడించాల్సొస్తుంది—"

6

"నిన్ను చూస్తూంటే నాకు భయం వేస్తోంది...." అంది కుసుమ.

"నాకు నీ భయంతో నిమిత్తంలేదు. నా మాట వినకుంటే మాత్రం నా ప్రవర్తన చాలా భయంకరంగా ఉంటుంది...."

"ఏం చేస్తావ్?"

"ఒకమ్మాయికి చర్మం వలిచేశాను. ఇంకో అమ్మాయికి కాలివేళ్ళు, చేతివేళ్ళు, ముక్కు, చెవులు కోసేశాను. ఇంకో అమ్మాయికి...."

"చెప్పొద్దు...." అంది కుసుమ.

"అడిగావని చెప్పాను కానీ ఇవి చెప్పడం నాకూ యిష్టం లేదు. నువ్వు బుద్ధిమంతురాలివి...." అన్నాడు విజయ్.

అవునన్నట్లు తలూపింది కుసుమ.

"బుద్ధిమంతురాలేం చేస్తుందో చెప్పనా?" అన్నాడు విజయ్.

తలూపింది కుసుమ.

"బుద్ధిగా షవర్ క్రింద నిలబడి స్నానం చేస్తుంది...."

కుసుమ కళ్ళలో మళ్ళీ భయం.

"వెళ్ళు...." గద్దించాడు విజయ్. కత్తి ఉన్న అతడి చేయి కాసేపు గాలిలో హెచ్చరికలు చేసింది.

కుసుమ చటుక్కున షవర్ క్రింద నిలబడింది.

"ఆగు...." అన్నాడు విజయ్—"బుద్ధిమంతులు వంటిమీది బట్టపై ఒక్క నీటిచుక్క పడకుండా— కేవలం వళ్ళు మాత్రమే తడిసేలా స్నానం చేస్తారు...."

"అంటే?"

"నువ్వు కూడా బుద్ధిగా స్నానం చేయి...."

అతడి ఉద్దేశ్యమామె కర్థమయింది. కానీ కదలలేదు.

"మానమో, ప్రాణమో—యేదో ఒకటే మిగులుతుంది నీకు. ఆలోచించుకో. ఎక్కువ వ్యవధిలేదు...."

కుసుమ అతడివంక భయం భయంగా చూసి-"ప్లీజ్-నన్నిలా బాధించకు...." అంది.

"పోనీ—నీ శరీరం నుంచి బొట్టు బొట్టుగా రక్తాన్ని చిందించి బాధించనా?" అన్నాడు విజయ్.

కుసుమ మాట్లాడలేదు.

"హారీయప్!" అన్నాడు విజయ్. అప్పుడతడి గొంతులో క్రూరత్వం ధ్వనించింది.

"మానమో, ప్రాణమో...." కుసుమ ఆలోచిస్తోంది. ఆమెకు ప్రాణభయం వుంది. ప్రాణాలంటే యెంతో తీపి వుంది. జీవితంమీద యెన్నో ఆశలున్నాయి. కానీ ఇప్పుడు మానభంగం జరిగితే అవన్నీ మిగుల్తాయా?

"హారీయప్ ...." అంటూ అతడామెను సమీపించాడు.

"దూరంగా వుండు. నేను స్నానం చేస్తాను...." అందామె.

అతడు దూరంగా వెళ్ళాడు. ఆమె అతడు కోరిన విధంగా షవర్ క్రింద స్నానం చేసింది. అతడు వినోదించాడు. ఆమెకు సిగ్గుతో వళ్ళు చచ్చిపోయినట్లయింది. కానీ అలా చేయకపోతే తనే చచ్చిపోతుంది.

"షవర్ కట్టేయ్...." అన్నాడతడు.

ఆమె షవర్ కట్టేసింది.

"మీ యింట్లోది మంచి సబ్బు. నీ వళ్ళు దూరానికే ఘుమఘుమలాడుతోందిప్పుడు...." అంటూ అతడామెను సమీపించాడు.

"దగ్గరకు రాకు...." అందామె.

"నిన్ను స్నానం చేయమన్నది దూరంగా వుండ డానికా? విడిపించుకు నే ప్రయత్నం చేశావంటే నిన్ను పాడిచేస్తాను" అంటూ అతడామె చేయి పట్టుకున్నాడు.

ఆమె విడిపించుకోలేదు.

"ఇప్పుడే స్నానంచేసినా నీ ఒళ్ళు వేడిగా వుంది—" అన్నాడతడు.

"నాకు భయంగా వుంది."

"భయమెందుకు?"

"నిన్ను చూస్తే...."

"నన్ను చూడక తప్పదు నీకు. ఇప్పుడు తిన్నగా బెడ్రూంకి దారి చూపించు—" అన్నాడతడు.

వేరే దారిలేదని ఆమెకు తెలుసు. ఇద్దరూ బెడ్రూం లోకి నడిచారు.

"బ్యూటిఫుల్ బెడ్!" అన్నాడతడు.

అప్పుడు చూసింది కుసుమ.

మంచానికి వెనుకగా డ్రెస్సింగ్ టేబిల్. డ్రెస్సింగ్ టేబిల్ మీద ఇనుపగూటం. నిన్న రాత్రి భర్తతో ఏవో కబుర్లు చెబుతూ అక్కడే అమాన్ దస్తాలో కూరపొడి కొట్టుకుంది కుసుమ. ఆ తర్వాత గూటంతీసి డ్రెస్సింగ్ టేబిల్ మీద పెట్టి అక్కడే మర్చిపోయింది. ఇప్పటికీ ఆ గూటం అక్కడే వుంది.

చాలా బరువుగా వుంటుం దా గూటం.

విజయ్ మంచాన్ని చూస్తున్నాడు. కుసుమ గూటాన్ని చూస్తోంది.

అప్పుడు విజయ్ గది తలుపులు వేశాడు.

"ఈ గదిలో యిప్పుడు నువ్వూ, నేనూ ..." అన్నా

డతడు.

కుసుమ మాత్రం గదిలోవున్న కూటం గురించి కూడా ఆలోచిస్తోంది.

అతడామెను మంచంవరకూ నడిపించాడు. తను మంచంమీద కూర్చుని—"నువ్వూ కూర్చో!" అన్నాడు.

కుసుమ అతడి పక్కగా కూర్చుంది. అతడామె శరీరాన్ని తడుముతున్నాడు. ఆమెకు వళ్ళంతా తేళ్ళూ, జెర్రిలూ పాకుతున్నట్లుంది. ఆమె ఊహల్లో కూటం మెదుల్తోంది.

"నువ్వు చాలా అందగత్తెవు...." అన్నాడతడు.

ఆమె మాట్లాడలేదు.

అతడు మంచంమీదకు ఒంగి ఆమెను లాగాడు.

ఇద్దరూ పక్కపక్కగా పడుకున్నారు.

"ఉండు—" అందామె అతణ్ని వదిలించుకుందుకు ప్రయత్నిస్తూ.

"నేను నిన్ను వదలను...."

"స్నానం చేశాక బొట్టు పెట్టుకోవాలి...." అందామె.

అప్పుడతడామె ముఖం చూశాడు. బొట్టులేక ఆమె ముఖం కళావిహీనంగా వున్నట్లనిపించింది.

"సరే—కానీ నిన్ను వదలను...." అన్నాడతడు.

ఆమె లేచి నిలబడింది.

అంతవరకూ ఒక చేతిలో వున్న కత్తిని పక్కగా పెట్టి—రెండు చేతులతోటీ ఆమె నడుం గట్టిగా పట్టుకుని "త్వరగా బొట్టు పెట్టుకో" అన్నాడతడు.

ఆమె డ్రస్సింగ్ టేబిల్ వైపు వంగింది. ఆమె తిలకం తీస్తున్నదని అతడనుకున్నాడు .... ఆమె నడుం తన

చేతుల్లో వున్నదని అతడి ధైర్యం. అతడికామె స్వర్గ ఊహాలోకాలను చూపిస్తోంది.

అదే వసుమ అవకాశంగా తీసుకుంది.

ఆమె గూటాన్ని నెమ్మదిగా తీసింది. తర్వాత ఒక్క క్షణం మనసు చిక్కబట్టుకుంది. తనేం తీసినదీ అతడు చూడలేదని ధృవపర్చుకుంది. అతిదూహించని వేగంతో వెనక్కు తిరిగి శాయశక్తులా ఆ గూటంతో బలంగా అతడి తలమీద మోదింది.

విజయ్ గావుకేక పెట్టాడు. అంతే!

మరి మాట్లాడలేదు.

వసుమ అతడివంక చూడలేదు. ఒక్క ఉదుటున గదిలోంచి బయటపడి తలుపులు వేసి గడియ పెట్టి— బాత్రూంలోకి పరుగెట్టి చకచకా బట్టలు వేసుకుంది.

అయినా వెంటనే మామూలు మనిషి కాలేకపోయింది.

ఆయాసం, ఆరాటం — అన్నీ తగ్గేక ఆమె బుర్ర పనిచేయడం మొదలెట్టింది.

అతడిప్పుడు గదిలో ఏం చేస్తున్నాడు? కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడా లేక దెబ్బ గట్టిగా తగిలి స్పృహ తప్పిందా?

లేక ....

అతడు చచ్చిపోయాడా?

ఈ ఆలోచన రాగానే ఆమె శరీరం నిలువెల్లా వణికింది.

అతడు చనిపోయి ఉంటే?

అది హత్య అవుతుంది. తను హంతకురాలు అవుతుంది.

"ఇప్పుడు తనేం చేయాలి-?" ఇదే ఆలోచన కుసుమ మనసులో తిరుగుతోంది.

తమ పడకగదిలో వున్నాడతడు. దెబ్బతిన్న పులిలా తిరుగుతూంటాడతడు. తలుపు తీయగానే పులిలాగే మీదకు దిగవచ్చు.

చివరకు కుసుమ ఒక నిర్ణయానికి వచ్చింది. వాళ్ళింటికి నాలుగిళ్ళవతల గోవిందరావిల్లుంది. వాళ్ళింట్లో ఫోనుంది. అక్కణ్నించి భర్తకు ఫోన్ చేయాలి.

కుసుమ ఇంటికి తాళంవేయాలి. తాళంకప్ప, చెవి పడకగదిలో వుండిపోయాయి. బయటకు వెళ్ళాలంటే ఎలా?

ఆమె కాసేపు అసహనంగా అటూ యిటూ తిరిగింది.

పక్కింటి వాళ్ళను పిలిచి విషయం చెబితే?

నలుగురూ వచ్చి తనకు సాయంచేస్తారు. విజయ్ సులభంగా పట్టుబడిపోతాడు. కానీ విజయ్ చనిపోయి వుంటే?

తను హత్యచేసింది. ఆ విషయం అందరకూ తెలుస్తుంది. కారణం యేమైనా ముందు పోలీసులు తన్నరెస్టు చేస్తారు. అటుపైన న్యాయస్థానం ... బోనులో తను ముద్దాయిగా....లాయర్ల ప్రశ్నలు....

తన బ్రతుకు చర్చా విషయం నలుగురికీ....

చివరకు తన కురిశిక్ష పడినా పడవచ్చు.

అందుకే నలుగురినీ పిలవకూడదు. భర్త వచ్చేవరకూ ఆగాలి.

కానీ ఒకవేళ విజయ్‌కు దెబ్బ బలంగా తగిలి స్పృహామాత్రం పోయి వుంటే? వెంటనే వైద్యం జరక్కపోతే ప్రాణంపోయే లాగుంటే?

# 12

విజయ్ బ్రతికితే తను హంతకురాలు కాదు. తనకే యిబ్బందీ వుండదు.

కానీ విజయ్ బ్రతికితే తనమీద పగబడతాడు. ఏ పగా లేకుండానే తన ననుభవించాలనుకున్నవాడు— పగబడితే తన్ను వదుల్తాడా?

విజయ్ బ్రతకాలా—బ్రతకూడదా?

కుసుమకేమీ తోచడంలేదు. కానీ పడకగది తలుపు తీయడానికి మాత్రం భయపడుతోంది.

"ఇలా కూర్చుని లాభంలేదు. ఇంట్లో యెవ్వరూ లేరనుకుని మామూలుగా పనులు చేసుకోవడం మంచిది" అనుకుంది కుసుమ.

అప్పుడు టైము నాలుగున్నరయింది. భర్త యింటికి వచ్చేసరికి పావు తక్కువ ఆరవుతుంది. ఈలోగా టిఫినూ అవీ సిద్ధం చేయాలి.

ఒకవిధంగా కుసుమకు సంతోషంగా కూడా వుంది.

తను గొప్ప ప్రమాదం నుంచి తప్పించుకుంది. తన కిక యే దారీ లేదనుకున్న సమయంలో ఇనుపగూటం తన్ను రక్షించింది. విజయ్ ప్రాణాలు పోవచ్చు. తను హంతకురాలు కావచ్చు. కానీ తన శీలాన్ని కాపాడుకుంది.

కుసుమ వంటింటి వైపు నడవాలనుకుంటూండగా మళ్ళీ వీధి తలుపు యెవరో కొట్టారు.

భర్త వచ్చాడేమో!

కుసుమ పరుగులాంటి నడకతో గుమ్మం వద్దకు పరుగెత్తి అక్కడ చటుక్కున ఆగిపోయింది.

వచ్చినవాడెవరో?

మళ్ళీ విజయ్‌లాంటి మరో ఆగంతకుడైతే....

విజయ్ ఎంత సులభంగా యింట్లో ప్రవేశించాడు!

యెంత సులభంగా తన్ను లొంగదీసుకోబోయాడు!

తను పరమపవిత్రంగా భావించే శీలాన్ని హరించడం పరాయి పురుషుడికి కష్టంకాదు. కాస్త తెగువ వుండాలంతే!

తలుపు మళ్ళీ చప్పుడయింది.

"ఎవరు?" అంది కుసుమ.

"నేను రామూని ఆంటీ!"

కుసుమ ఆ స్వరాన్ని గుర్తుపట్టింది. రాము గోవిందరావుగారబ్బాయి. వాడికి పదేళ్ళు.

తటపటాయించకుండా తలుపు తీసిందామె.

రాము చొరవగా లోపలకు రాబోయాడు.

వాడెక్కడ బెడ్రూంవైపు వెడతాడోనని ఆమెకు భయం వేసి—"ఏమిటి—ఈ వేళప్పుడు వచ్చావు...." అంది.

"అంకుల్ కీవేళ ఆఫీసు పనుందిట. వచ్చేసరికి రాత్రి పదిగంటలు కావచ్చుట. ఇప్పుడే ఫోన్ చేసి చెప్పారు" అన్నాడు రాము.

కుసుమ హతాశురాలై—"కాసేపు నువ్విక్కడుంటావా? నేను వెళ్ళి అంకుల్‌తో మాట్లాడతాను...." అంది.

"వాళ్ళాఫీసులో ఫోన్ పనిచేయటంలేదుట. అంకుల్ వేరే చోట్నించి ఫోన్ చేశారు. మిమ్మల్ని ఫోన్ చేయొద్దన్నారు ..." అన్నాడు రాము.

"అన్నీ యిలాంటప్పుడే వస్తాయి...." అనుకుంది కుసుమ. భర్త యిలా ఆలస్యంగా రావడం ఆమెకు కొత్త కాదు. కానీ ఈ పూట అతడు రోజూకంటె ముందుగా వస్తే బాగుండునని కోరుకుందామె.

ఇంట్లో రాక్షసుడి కన్న ప్రమాదకరమైన మనిషి వున్నాడు, లేదా ప్రాణంలేని శవం వుంది. రాత్రి పదింటి వరకూ పడకగదిలోకి వెళ్ళకుండా కాలక్షేపం చేయాలి తను. ఈలోగా ఆ రాక్షసుడు బలం పుంజుకొని తలుపులు బద్దలుకొట్టి బయటకు వస్తే?

"ఆంటీ — చైనీస్ చక్కర్ ఆడుకుందామా?" అన్నాడు రాము.

"ఊఁ" అంది కుసుమ. కాసేపా కుర్రాడితో ఆటలో పడితే ఈ గొడవంతా మర్చిపోవచ్చు.

రాము చైనీస్ చక్కర్ బాగా ఆడతాడు. అందులోనూ పెద్దవాళ్ళ నోడించడం వాడికి సరదా. అంతవరకూ వాడు కుసుమతో మూడుసార్లా గేమ్ ఆడాడు. మొదటి రెండుసార్లూ కుసుమ వాడినోడించింది. మూడో సారి వాడు నెగ్గాడు.

"ఆంటీ—మీ సులువు నాకు తెలిసిపోయింది. ఇక మీదట మిమ్మల్ని సులభంగా ఓడించేయగలను...." అన్నాడు రాము అప్పుడు.

ఆ తర్వాత వాళ్ళకు మళ్ళీ ఆదే అవకాశం రాలేదు. కుసుమ కా విషయమై పెద్ద పట్టింపులేదు. రాము మాత్రం మంచి పట్టుదలగా ఉన్నాడు.

ఆట విషయంలో చిన్న పిల్లవాడైనా కుసుమ వాడి నంతగా నిరుత్సాహపరచదు. ఆమె రామును ఒక స్నేహితుడిలా చేసుంది. ఎందుకంటే యెక్కణ్ణించేనా యెవరైనా ఫోన్ చేస్తే ఆ కబురు వెంటనే వచ్చి చెబుతాడు వాడు. కుసుమ యిల్లంటే వాడికి గొప్ప ఆకర్షణ వుంది. ఆ ఆకర్షణను కాపాడుకుంటుందామె.

"బోర్డు తీసుకురానా?" అన్నాడు వాడుత్సాహంగా.

ఆమె జవాబిచ్చేలోగా వాడు బెడ్రూంవైపు దారి తీశాడు.

"వద్దు. ఆగు...." అంది కుసుమ.

చైనీస్ చక్కర్ బోర్డు బెడ్రూంలో వుంది. రాముకా విషయం తెలుసు. కానీ యిప్పుడా బోర్డెలా తెచ్చేది?

గదిలో మంచంమీద విజయ్ పడి వుంటాడు.

అతడు మంచంమీదే పడివున్నాడో.... లేచి తిరుగుతున్నాడో....

కానీ గదిలో యెక్కడా అలికిడిలేదు. అతడంత నిశ్శబ్దంగా యెందుకున్నాడు?

క్రూర జంతువులకు ఓర్పెక్కువ. తను కొట్టదలచిన లేడికోసం యెంతో ఓర్పుగా ఎదురుచూస్తుంది పులి. అదే విధంగా పొంచి వున్నాడేమో అతడు....

"ఏమయింది ఆంటీ?" అన్నాడు రాము.

"చెప్పడం మర్చిపోయాను. నేను బయటకు వెళ్లాలి. మా తాళంకప్ప పాడైపోయింది. ఒక్కసారి మీ అమ్మగారి నడిగి తాళం తెచ్చి పెడతావా?" అంది కుసుమ.

"ఏం పని ఆంటీ?" అన్నాడు రాము నిరుత్సాహంలో కుతూహలాన్ని మిళితం చేస్తూ.

"చాలా అర్జంటు పని...." అన్నాక కుసుమకు గుర్తువచ్చింది. ఆ గదిలోనే పర్సుకూడా వుండిపోయింది. డబ్బంతా పర్సులోనే వుంది.

"సరే—ఆంటీ...." అని వెళ్ళబోతున్న రామునామె మళ్ళీ ఆగమని — "మీ అమ్మగారి నడిగి ఓ యిరవై రూపాయలు కూడా తెచ్చి పెట్టు. రేపుదయానికల్లా యిచ్చేస్తాను...." అంది కుసుమ.

రాముకంతా తమాషాగా వుంది. వాడు నాలుగడుగులు వేసి మళ్ళీ ఆగి — "ఇంకా యేమైనా చెబుతారా ఆంటీ!" అన్నాడు.

"అన్నట్లు — ఇంకో తాళంకప్ప కూడా వుంటే పట్టుకురా!" అంది కుసుమ. పడకగదిలో విజయ్‌నలా వదిలి వెళ్ళడం ఇంటి భద్రతకు ప్రమాదమని ఆమెకు అనిపించింది. అతిడి గదికి బయట తాళం పెడితే కొంతలో కొంత మేలనిపించిందామెకు.

"మా యింట్లో నాలుగు తాళంకప్పలున్నాయి. ఇంకేమైనా కావాలా ఆంటీ?" అనడిగాడు రాము.

"అక్కర్లేదు. త్వరగా వెళ్ళిరా — ...." అంది కుసుమ.

రాము పరుగున వెళ్ళిపోయాడు.

ఎందుకైనా మంచిదని వెంటనే తలుపులు వేసిందామె. తలుపిలా వేసి అలా కుర్చీలో కూర్చుందో లేదో మళ్ళీ యెవరో తలుపు తట్టారు.

"రాము అప్పుడే వచ్చేశాడా?" అనుకుంటూ తలుపు తీసిందామె.

ఎదురుగా ఇద్దరు మనుషులు కనిపించారు. వాళ్ళెవరో ఆమెకు తెలియదు. వారిలో ఒకడు ఆరడుగుల యెత్తు మనిషి. పొడవుకు తగ్గ లావున్నాడు. రెండోవాడు పొట్టిగా లావుగా వున్నాడు. ఇద్దరూ కూడా చూడ్డానికి మర్యాదస్థుల్లాగే వున్నారు.

"కుసుమ మీరే కదూ?" అన్నాడు పొడవాటి వ్యక్తి.

"ఊఁ" అంది కుసుమ.

"నా పేరు సుధీర్ ...." అన్నాడతడు.

అయితే యేమిటన్నట్లు చూసిందామె. సుధీర్ ఆ

చూపుల కర్థం తెలిసినవాడిలా—"విజయ్ నా తమ్ముడు" అన్నాడు.

విజయ్ పేరు వింటూనే వులిక్కిపడింది కుసుమ. విజయ్ గురించి తనకు తెలిసినట్లితడికెలా తెలుసు?

"విజయ్ ఎవరు?"

"విజయ్ ఇక్కడకు వచ్చాడని నాకు తెలుసు...." అన్నాడతడు మళ్ళీ.

"విజయ్ యెవరో నాకు తెలియదు...." అంది కుసుమ మళ్ళీ.

"సరే—మీ మాటే నిజమనుకుందాం—విజయ్ మీ యింట్లో వున్నాడో లేదో చూసి వెళ్ళిపోతాను...." అన్నాడతడు.

"విజయ్ ఈ యింట్లో ఎందుకుంటాడు?"

"తర్వాత చెబుతాను. విజయ్‌ను ముందు చూడాలి."

"ఈ యింట్లో నేను తప్ప ఎవ్వరూ లేరు .."

సుధీర్ లోపలకు దూసుకొని వచ్చాడు. అతడి వెనకనే లావుపాటి వ్యక్తి వచ్చి తలుపులు వేశాడు. అతడి చేతిలో పెద్ద బ్యాగొకటి వుంది.

"ఎవరు మీరు? ఏమిటీ జబర్దస్తీ!" అంది కుసుమ. కోపం తెచ్చుకోవాలని ప్రయత్నించినప్పటికీ ఆమె గొంతులో భయం, కంగారు మాత్రమే ధ్వనిస్తున్నాయి.

"మిసెస్ కుసుమా! భయపడకండి. మేము మీకు ప్రమాదం తలపెట్టలేదు. మేము చెడ్డవాళ్ళం కాదు...." అన్నాడు సుధీర్.

"మరైతే ఇలా బలవంతంగా పరాయిళ్ళల్లో దూరుతున్నారేం?"

"విజయ్ కోసం ..." అని — "డాక్టర్! మీ రీమె పక్కనే ఉండండి. నేను ఇల్లు సోదా చేస్తాను...." అన్నాడు సుధీర్.

"సోదా అవసరంలేదు. అతడా గదిలో వున్నాడు" అంటూ బెడ్రూంవైపు చూపించింది కుసుమ.

"మీరూ మాతో పాటు రండి...." అన్నాడు సుధీర్. అది మనవిలా లేదు. ఆజ్ఞలా వుంది.

ముగ్గురూ కుసుమ పడకగదిలోకి వెళ్ళారు.

మంచంమీద ఇంకా అలాగే పడివున్నాడు విజయ్. రక్తం మొహంమీదకు కారినట్లుంది. ఎండి చారికలా వుంది.

తను కొట్టేక విజయ్ ముఖం చూడడం కుసుమకదే ప్రథమం. చూడలేక ముఖం పక్కకు తిప్పుకుందామె.

"విజయ్...." అంటూ అతడిని సమీపించాడు సుధీర్. పొట్టిగా లావుగా వున్న వ్యక్తి వేగంగా విజయ్‌ని సమీపించి నాడి చూసి—"ఇంకా ప్రాణం పోలేదు...." అన్నాడు.

"డాక్టర్ .... విజయ్‌ను రక్షించడం సాధ్యపడుతుందా?" అన్నాడు సుధీర్ ఆత్రుతగా.

"ప్రయత్నిస్తాను. కానీ కష్టం...." అన్నాడు డాక్టర్.

సుధీర్ కుసుమవంక తిరిగి—"తప్పెవరిదైనా విజయ్ కేమైనా అయితే నీ ప్రాణాలు దక్కవు..." అన్నాడు.

అప్పుడు సుధీర్ కళ్ళలోని ఎరుపును చూసి భయపడింది కుసుమ.

"ఎవరు మీరు? విజయ్ ఇక్కడిలా పడివుంటాడని మీకు ముందే ఎలా తెలుసు?" అనడిగింది కుసుమ.

"అన్నీ తర్వాత చెబుతాను...." అన్నాడు సుధీర్.

"విజయ్ ఇక్కడికొచ్చి ఏం చేయబోయాడో తెలుసా?"

"కాసేపు మాట్లాడకు...." అన్నాడు సుధీర్.

"మిష్టర్ సుధీర్!" అన్నాడు డాక్టర్—"విజయ్ కేమీ ప్రమాదం లేకుండా నా సర్వశక్తులూ వినియోగిస్తాను. సరంజామా అంతా బ్యాగులోనే వుంది. కొంత ప్రథమ చికిత్స జరిగేక మనం ఇతణ్ని నర్సింగ్ హోమ్‌కు మార్చవచ్చు...."

"హోప్సున్నాయంటారా?" అన్నాడు సుధీర్.

"ఉన్నాయి...." అన్నాడు డాక్టర్ — "కానీ నువ్వు రాత్రి పదిగంటలవరకూ విజయ్ దరిదాపులకు రావద్దు...."

"ఎందుకని?"

"నీ ఆదుర్దాతో నాకు నిమితముండదు...."

"సరే—ఏం చేయను?"

"ఏం చేస్తావో నీ యిష్టం....కానీ పదింటికి నర్సింగ్ హోంకు రా...."

పదినిమిషాలపాటు డాక్టర్ విజయ్‌కు ప్రథమ చికిత్స చేశాడు. తర్వాత సుధీర్, అతడు కలిసి విజయ్‌ను బయటకు మోసుకుని వెళ్ళారు. బయట కారొకటి సిద్ధంగా వుంది. అందులో డ్రైవర్ కాక ఇద్దరు మనుషులున్నారు.

విజయ్‌ని కారు వెనుక సీట్లో పడుకోబెట్టారు. డాక్టరు కారెక్కి ముందు సీట్లో కూర్చున్నాడు. ఇద్దరు మనుషులూ వెనుక సీట్లలో విజయ్ కిబ్బంది లేకుండా కూర్చున్నారు. కారు వెళ్ళిపోయింది.

"నువ్వు కూడా బయటకు రా. మనిద్దరం కలిసి కాసేపు ఎక్కడైనా తిరుగుదాం....—" అన్నాడు సుధీర్.

"నా భర్త వచ్చే వేళవుతోంది—" అందామె— భర్త రాడని తెలిసినప్పటికీ అతణ్ణించి తప్పించుకునేందుకు.

"వంకలు పెట్టకు. నేను చెప్పినట్లు వినితీరాల్సిందే. ముందే చెప్పాను నేను ప్రమాదకరమైన మనిషిని కానని. నేను నీకే అపకారం. తలపెట్టను. నిన్ను తాకనుకూడా తాకను. కానీ నువ్వు నాతో బయటకు రావాలి. అందుకొప్పుకోవూ—నేనప్పుడు నిజంగా నీకు ప్రమాదకరంగా తయారవుతాను...." అన్నాడు సుధీర్.

అతడి హెచ్చరికలో నిజాయితీ వుంది. కుసుమ ఇంట్లోకి వెళ్ళి తలుపులన్నీ జాగ్రత్తగా వేసి పర్సు తీసుకుని బయటకు వచ్చి తలుపులకు తాళం వేసింది.

అప్పుడు వచ్చాడు రాము.

"ఆంటీ—రెండో తాళం ఓ పట్టాన కనపడలేదు. ఆ తర్వాత అమ్మ పర్సెక్కడో పెట్టి మర్చిపోయింది, అది దొరకడానికింకా కాసేపు పట్టింది—" అన్నాడు రాము ఆయాసంతో వగర్చుతూ.

"చాలా థాంక్స్ — కానీ మా తాళంకప్ప బాగుపడింది. నాకిప్పుడు డబ్బులూ అక్కర్లేదు ..." అంది కుసుమ సుధీర్ వైపు నడుస్తూ.

"ఆ అంకులెవరు ఆంటీ?" అన్నాడు రాము కుతూహలంగా.

కుసుమకేం చెప్పాలో తెలియలేదు. అయితే ఆ ప్రశ్న సుధీర్ కూడా విన్నాడు. అతడు వెంటనే—

"మీ కుసుమ ఆంటీకి నేను పెద్దన్నయ్యని...." అన్నాడు కాస్త గట్టిగానే.

ఆ జవాబు రాము ఒక్కడికే కాదు. ఆ యింటి ముందేం జరుగుతోందో అన్న కుతూహలంతో చాటుగా వుండి ఓ చెవి పారేసిన చుట్టుపక్కల వాళ్ళక్కూడా వినిపించింది.

సుధీర్ జవాబుకు కుసుమ తేలికగా నిట్టూర్చింది.

## 2

వాళ్ళిద్దరూ అలా సుమారు రెండు కిలోమీటర్ల దూరం కాలినడకన వెళ్ళారు. అంతవరకూ ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు.

కుసుమ బుర్రలో రకరకాల ఆలోచనలు తిరుగుతున్నాయి. విజయ్ ప్రవర్తన ఆమెను కలవరపరిస్తే సుధీర్ ప్రవర్తన ఆమెకు మతి పోగొడుతోంది.

"నా కాకలిగా వుంది. ఏదైనా హోటలుకు వెడదాం—" అన్నాడు సుధీర్.

"నీ యిష్టం..." అంది కుసుమ.

సుధీర్ ఆటోని పిలిచాడు. ఇద్దరూ ఆటోలో కూర్చున్నారు.

కుసుమ కాశ్చర్యంగా వుంది. అతదెవరో, తానెవరో? ఈరోజుకిలా కలిసి తిరుగుతున్నారు. విజయ్ తనను వాంఛించాడు. తను తప్పించుకుంది. ఇతడు విజయ్‌కి అన్ననంటున్నాడు. తనకీ అన్ననే అంటున్నాడు. తానతడితో తిరుగుతోంది.

ఇప్పుడు తనను భర్త చూస్తే?

కుసుమ శరీరం భయంతో జలదరించింది.

ఆటో ఓ ఖరీదైన హోటలు ముందాగింది. సుధీర్

ఆటో దిగి బాడుగ చెల్లించాడు. కుసుమ కూడా ఆటో దిగింది.

హోటల్లో అడుగుపెడుతూ కుసుమ భర్త గురించి ఆలోచించింది. తానూ, అతడూ కలిసి ఎప్పుడూ ఇంత ఖరీదైన హోటల్లో అడుగుపెట్టలేదు. పెళ్ళై మూడేళ్ళయిందిప్పటికి.

హఠాత్తుగా తన అంతస్తు పెరిగినట్లనిపించిందామెకు. కానీ తన పక్కనున్నది భర్త కాదు.

"ఫామిలీ సెక్షన్లో కూర్చుంటే ఫ్రీగా వుంటుంది. ఎవరూ డిస్టర్బ్ చేయరు!" అన్నాడు సుధీర్.

"హోటల్లో డిస్టర్బ్ నేమిటి?" అంది కుసుమ.

"నీకు నేను విజయ్ కథ చెప్పాలి...."

విజయ్ కథ అనగానే ఆమెలో కుతూహలం రేగింది.

"నీ యిష్టం...." అంది మళ్ళీ.

ఇద్దరూ ఫామిలీ సెక్షన్‌లో కూర్చున్నారు.

అది చిన్న సైజు గదిలా వుంది. గోడలకు అర్ధ నగ్న తైలవర్ణ చిత్రాలు వేలాడుతున్నాయి.

గది మధ్యలో నగిషీలు చెక్కిన అందమైన టేబిల్. టేబిల్ కటూ యిటూ అదే స్టాయిలో కుర్చీలు.

కుసుమ, సుధీర్ ఒకరికొకరు యెదురుగా కూర్చున్నారు.

"ఇక్కడ మనమెంతసేపు కూర్చున్నా అడిగేవాళ్ళు లేరు...." అన్నాడు సుధీర్.

కుర్చీలో కూర్చుంటే మంచంమీద పడుకున్నంత హాయిగా వుంది. వాళ్ళిద్దరూ కూర్చోగానే సన్నని స్వరంలో సంగీతం ప్రారంభమైంది.

"ఇంత పెద్ద గదిని ఇద్దరు మనుషులకు గంటలతరబడి

వదిలి పెడితే—హోటలు వాళ్ళకు వ్యాపారమేం నడుస్తుంది!" అంది కుసుమ అప్రయత్నంగా.

సుధీర్ నవ్వి—"ఇక్కడ టైమునుబట్టి ఛార్జి వుంటుంది. ప్రతి నిముషానికీ మనం పే చేయాలి. టిఫిన్ ఛార్జి అదనం. మనం పిలిస్తే తప్ప వెయిటర్ రాడు" అన్నాడు.

"నిమిషానికెంత ఛార్జి చేస్తారు?"

"రూపాయనుకుంటాను?" అన్నాడు సుధీర్.

"హామ్మయ్యో...." అనుకుంది కుసుమ. ఇలాంటిచోట టిఫిన్ చేయాలంటే హడావుడిగా నోట్లో కుక్కేసుకుని బయటపడాలి....

"ఇంత ఛార్జి ఇచ్చి యెవరు తింటారిక్కడ?"

"సాధారణంగా ప్రేమికులు.... వాళ్ళకీ హోటలొక వరం....డబ్బు కే చేసే టైములో తప్ప టైము తెలియదు వాళ్ళకు...." అన్నాడు సుధీర్.

"మనమిక్కడి కెందుకొచ్చాం?" అంది కుసుమ అనుమానంగా.

"నీ అన్న తన తమ్ముడి కథను నీ కిక్కడే చెబుదామనుకుంటున్నాడు. సావధానంగా విని సానుభూతి చూపించాలి...." అన్నాడు సుధీర్.

కుసుమ మాట్లాడలేదు. అన్ననని అతడనడం ఆమెకు ధైర్యాన్నిస్తోంది. పెంచుతోంది. కానీ మోసగాళ్ళ మాటలు నమ్మకూడదని మనసు హెచ్చరిస్తోంది.

సుధీర్ బల్లమీద మీట ఒకటి నొక్కాడు. కొద్ది క్షణాల్లో వెయిటర్ వచ్చాడు.

ఆ వెయిటర్ మహారాజులా వున్నాడు. కానీ వంగి వినయంగా వారిద్దరికీ నమస్కరించాడు.

"నీకేం కావాలి?" అన్నాడు సుధీర్.

"ఏముంటా యిక్కడ?" అంది కుసుమ.

"ఏం కావాలో చెప్పండి. లేవడం నా వంతు...." అన్నాడు వెయిటర్.

కుసుమ ఇడ్లీ చెప్పింది. సుధీర్ కూడా అదే చెప్పాడు.

వెయిటర్ వెళ్ళిపోయాడు.

"కథ ప్రారంభించనా?"

"ఊఁ"

సుధీర్ చెప్పసాగాడు.

• • •

ఒక లక్షాధికారి ఏకైక పుత్రుడు విజయ్. అతడికి నాలుగేళ్ళప్పుడు యెవరో దుండగులెత్తుకుపోతూంటే కాపాడాడు సుధీర్. అప్పుడతడికి పదేళ్ళు. విజయ్‌ని కాపాడగలగడం అతడి అదృష్టం. విజయ్‌ని దుండగులు బలవంతంగా ఆటో యెక్కిస్తూండగా చూశాడతడు. విజయ్ గింజుకుంటున్నాడు. సుధీర్ పదిమందినీ పోగు చేశాడు. అందరూ ఆ ఆటోని తరిమారు. దుంగుడలు భయపడి ఆటో దిగి పారిపోయారు. విజయ్‌ని ఒక రిద్దరు గుంపులోని వ్యక్తులు గుర్తుపట్టారు. సుధీర్ విజయ్ నింటికి చేర్చాడు.

ఆ రోజుతో సుధీర్ జాతకం మారిపోయింది.

సుధీర్‌కు తల్లి లేదు. తండ్రి వున్నాడు కానీ అతడికి సుధీర్ అంటే ఆసక్తిలేదు. రెండో పెళ్ళి ప్రయత్నంలో వున్నాడు. సుధీర్ స్కూలుకు వెడుతున్నాడు కానీ చదువు తిన్నగా రావడం లేదు. తల్లిదండ్రుల సంరక్షణలేని కుర్రాడిగా అతడు మిగతా పిల్లలతో పోల్చుకొని చిన్న తనం ఫీలయ్యేవాడు. వాళ్ళతో కలిసేవాడు కాదు.

విజయ్ ని కాపాడినందుకు సుధీర్ కా యింట ఆశ్రయం లభించింది. సుధీర్ తండ్రి పదివేల రూపాయలకు కొడుకు నాయనకు అమ్మేశాడు.

చిన్నప్పటినించీ విజయ్ కి కొన్ని విలక్షణాలుండేవి. ఒకోసారి దేనికో అతడు విపరీతంగా నవ్వేవాడు. ఒకో సారి విపరీతంగా ఉద్రేకపడేవాడు.

డాక్టర్లు పరీక్షించి విజయ్ కి మతి భ్రమించలేదని నొక్కి చెప్పారు. అయితే అతడికి విపరీతమైన పట్టుదల వుంది. సాధ్యమైనంతవరకూ అతడి కోరికలు తీర్చడం మంచిదని డాక్టర్ల సలహా.

విజయ్ కి సుధీర్ విపరీతంగా నచ్చాడు. సుధీర్ నతడు అన్నా అని పిలిచేవాడు. సుధీర్ ని చూడగానే సంతోష పడేవాడు. ఆ యింట్లో విజయ్ తో సమంగా సుధీర్ ని చూడకపోతే అతడు మండిపడేవాడు. ఆ విధంగా సుధీర్ కి రాజభోగాల యోగం పట్టింది.

విజయ్ తండ్రి దీనికి సరిపెట్టుకున్నాడు. ఆయన సుధీర్ తో__"ఈ యింట్లో నీకు యే లోటూ రాదు. సుధీర్ కి నువ్వు అన్నవే! విజయ్ సంతోషంకోసం నేనేమైనా చేస్తాననడానికి నువ్వే నిదర్శనం. నువ్వు కూడా విజయ్ ను సంతోషంగా వుంచడానికి నీ శాయ శక్తులా ప్రయత్నించాలి__" అని చెప్పాడు.

సుధీర్ కా కుటుంబమంటే కృతజ్ఞత. విజయ్ అంటే ప్రాణం.

విజయ్ కి చదువు బాగా వచ్చింది. క్లాసులో ఫస్టుగా వచ్చేవాడు. అయితే అతడికి అప్పుడప్పుడు యేదో అయ్యేది. ఉన్నట్టుండి యెవరి పేరో చెప్పి వాళ్ళను కొట్టాలనేవాడు. తానన్నది జరిగేదాకా అతడు

శాంతించేవాడు కాదు.

అతడికి పద్దెనిమిదేళ్ళ వయసు వచ్చేక ఈ పిచ్చి ఇంకో రకంగా మారింది. వున్నట్లుండి-ఫలానా ఆడపిల్ల కావాల నేవాడు.

ఈ దేశంలో అదెలా సాధ్యమవుతుంది?

తండ్రికి విజయ్‌ని అదుపు చేయాల్సిన అవసరం కన పడింది. ఆయన మంచి మాటలతో అతడి మనసు మార్చాలని చూశాడు. కానీ ప్రయోజనంలేదు.

తన డబ్బుతో యెందరాడపిల్లలనైనా కొనగలడు విజయ్ తండ్రి. కానీ విజయ్‌కు తండ్రి తెచ్చే ఆడ పిల్లలవసరం లేదు. తను కోరిన వాళ్ళే కావాలి.

అతడు కోరిన వాళ్ళలో మధ్యతరగతి వాళ్ళున్నారు, గొప్పవాళ్ళున్నారు, పెళ్ళైన వాళ్ళుకూడా వున్నారు.

విజయ్ అడుగుతున్నాడు. వీలుపడ్డంలేదు.

ఒకరోజున విజయ్ ఇంట్లో చిందులు తొక్కాడు. అతణ్ని అదుపుచేయడం చాలా కష్టమయింది. డాక్టరు వచ్చి పరీక్షించి మత్తు ఇంజక్షన్ చేసి యెలాగో అతణ్ని నిద్రపుచ్చేడు.

"ఏమిటిది డాక్టర్?" అన్నాడు విజయ్ తండ్రి.

"అతడి కోరిక తీరాలి. తీర్చక తప్పదు...."

"ఎలా?" అన్నాడు విజయ్ తండ్రి. కొత్తగా పెళ్ళైన ఒక గుమస్తా భార్యను కోరుతున్నాడు విజయ్. ఆ కోరిక నెలా తీర్చగలడు తాను?

"ఒక్కసారి తన కోరిక తీరితే అతడు శాంతించ వచ్చు. లేకుంటే ఇప్పుడున్న తెలివి నశించి పిచ్చివాడు కావచ్చు...." అన్నాడు డాక్టర్.

"ఇంకేమీ ఉపాయం లేదా?" అన్నాడు విజయ్

తండ్రి దీనంగా.

"సైకియాట్రిస్టుని సంప్రదిస్తే పని జరుగవచ్చు—" అన్నాడు డాక్టర్.

అప్పటికే విజయ్ విషయంలో సైకియాట్రిస్టులను చాలామందిని సంప్రదించడం జరిగింది. అయితే యిది కొత్తరకం సమస్య కాబట్టి మళ్ళీ వెళ్ళడం మంచిదని తండ్రి అనుకున్నాడు.

ఆ ఊళ్ళో కొత్తగా ఫారిన్ రిటర్న్డు సైకియాట్రిస్టు వచ్చాడు. ఆయన గురించి పేపర్లలో మంచి ప్రచారం జరుగుతోంది. తండ్రి విజయ్ నాయన వద్దకు తీసుకుని వెళ్ళాడు. ఆయన విజయ్ ని పరీక్షించి—"వీడు అన్ని విధాలా నార్మల్ గా వున్నాడు. ఎందుకో అప్పుడప్పుడితడి మనసు భావోద్రేకానికి ప్రేరేపింపబడుతోంది. కనీసం ఒక్కసారి ఇతడి కోరిక తీర్చడానికి ప్రయత్నించండి. మెదడుకు శాంతి కలిగి ఉద్రేకం శాశ్వతంగా చల్లారవచ్చు—" అన్నాడు.

"చల్లారకపోతే?" అన్నాడు విజయ్ తండ్రి భయంగా.

"అప్పుడు నేను మందిస్తాను. ఒక సంవత్సరంపాటు ఆ మందు వాడాలి. ఆ మందు ప్రభావం అయిదు సంవత్సరాలుంటుంది. అనగా అయిదు సంవత్సరాలపాటు మీ విజయ్ పూర్తిగా నార్మల్ గా వుంటాడు. ఆ తర్వాత అదే అతడికి అలవాటు కావచ్చు...."

"అలాంటప్పుడా మందిప్పుడే ఇవ్వచ్చు గదా!" అన్నాడు విజయ్ తండ్రి ఆశగా.

"అది ప్రమాదకరమైనది. అత్యవసర పరిస్థితుల్లో తప్ప వాడకూడదు. ఏ దారీ లేనప్పుడే మేమా మందు రికమండ్

చేస్తాం. మరో విషయం—ఆ మందును ఒక మనిషి తన జీవితకాలంలో ఒక సంవత్సరం మాత్రమే వాడాలి. అంతకుమించి వాడితే ప్రాణప్రమాదం—"

"అంటే మందు వాడిన అయిదు సంవత్సరాలకు విజయ్ యథాప్రకారం ప్రవర్తించినా అతడికింకే మందులూ లేవన్నమాట!" అన్నాడు విజయ్ తండ్రి.

"లేవు—" అన్నాడు డాక్టర్.

ఇంటికి వెళ్ళాక విజయ్ తండ్రి సుధీర్‌తో విషయం చర్చించాడు. సుధీర్ విజయ్‌కు మందివ్వద్దన్నాడు.

అప్పుడిద్దరూ కలిసి బాగా ఆలోచించి—కొందరు కాల్‌గర్ల్స్‌ని విజయ్ నాకర్షించే విధంగా నియమించాలనుకున్నారు.

కానీ విజయ్ గుమస్తా భార్యకోసం పట్టుబట్టాడు.

అప్పుడు సుధీర్ ఒకసారి ఆ గుమస్తా ఇంటికి వెళ్ళాడు. అతడి పేరు బాబూరావు. సుధీర్ వెళ్ళినపుడతడింట్లో లేడు. భార్య మోహన వుంది.

సోషల్ వర్కుకు సంబంధించిన సర్వే గురించి తాను వచ్చినట్లు చెప్పుకొని సుధీర్ వివిధ విషయాల్లో ఆమె అభిప్రాయాలు సేకరించాడు.

మోహన బియ్యే ప్యాసయింది. అన్నింట్లోనూ విశాల భావాలున్నాయి. కానీ ఆమె, భర్త కూడా నీతికి, నిజాయితీకి, శీలానికి విలువనిస్తారు. ప్రాణం పెడతారు.

సుధీర్ విజయ్ సమస్య గురించి యథాలాపంగా చెప్పినట్లు చెప్పాడు.

మోహన చాలా మామూలుగా — "స్త్రీకి శీలం ముఖ్యం. అది పోతే ఆమె బ్రతుకదు. విజయ్‌ని బాగు చేయాలంటే ఓ స్త్రీ బలికావాలి. ఎలాగూ బలి తప్ప

నప్పుడు—విజయ్ తనే బలికావడం మంచిది—" అనే సింది.

కాసేపు మాట్లాడేక ఆమె డబ్బుకూడా లాంగని మనిషని అతడికర్థమయింది. అతడామెవద్ద సెలవు తీసుకున్నాడు.

ఇక తప్పనిసరి....

భర్తకు యాక్సిడెంటయిందని మోసంచేసి మోహనను విజయ్ గదికి చేర్చారు. అక్కడ ఆమె విజయ్ చేత చెరచబడింది.

మోహన అవమానంతో యింటికి వెళ్ళింది. గ్యాస్ స్టవ్ యాక్సిడెంటు సృష్టించుకుని చనిపోయింది.

మోహనతో అనుభవం విజయ్‌కు తృప్తినివ్వలేదు. అతడికి కొన్ని కోరికలున్నాయి. వ్యభిచారిణులు కూడా సిగ్గుపడే కోరికలవి. మోహన అతడు కోరిన విధంగా ప్రవర్తించలేదు సరిగదా-అతణ్ణి ప్రతిఘటించింది, తిట్టింది.

నాలుగురోజుల తర్వాత విజయ్ ఓ బడిపంతులు కూతుర్ని కోరాడు. విజయ్ తండ్రి భయపడ్డాడు.

"ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకో" అని సుధీర్ అతడికి సలహాయిచ్చాడు.

"నేను పెళ్ళిచేసుకోను. ఒకసారనుభవించిన ఆడదాని ముఖం మళ్ళీ చూడను నేను...." అన్నాడు విజయ్.

ఈసారి సుధీర్ కూడా ఆలోచనలోపడ్డాడు. బడిపంతులు కూతుర్ని డబ్బాశతో లొంగదీసుకుని విజయ్ కోరిన విధంగా ప్రవర్తించమని కోరాలని అతడనుకున్నాడు.

ఈలోగా ఘోరం జరిగిపోయింది.

భార్య చావుకు కారణం తెలిసిన బాబూరావు పగ

బట్టి అవకాశంకోసం వేచివుండి—ఒకరోజున విజయ్ తలిదండ్రులిద్దర్నీ క్రూరంగా హత్య చేశాడు. ఆపైన పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి తనే వాళ్ళను పగతో హత్య చేశానని చెప్పి వాళ్ళముందే పొడుచుకుని చనిపోయాడు.

విజయ్‌లో మార్పు తీసుకుని రావడానికిదే మంచి సమయమని సుధీర్ అనుకున్నాడు. అతడు విజయ్‌కి తలిదండ్రులెందుకు హత్య చేయబడ్డారో చెప్పాడు.

బదులుగా విజయ్—"నన్నెవ్వరు చంపుతారో చూస్తాను. నాకు నచ్చిన ఆడదాన్ని నా కిష్టం వచ్చినట్లు అనుభవించడం నా జన్మహక్కు...." అన్నాడు. అతడిలో ఆవేశం మరింత ఎక్కువయింది.

ఇక లాభంలేదని సుధీర్ అతడికి మందిప్పించాడు.

మందు పని చేసింది.

విజయ్‌లో చెప్పుకోదగ్గ మార్పు వచ్చింది. అతడు ఎంతో ప్యాసయ్యాడు. ఆస్తివ్యవహారాలు చూడ్డానికి మాత్రం ఇంకా పూర్తిగా సుధీర్ మీదనే ఆధారపడు తున్నాడు.

సుధీర్ అతడికి బాధ్యతలప్పగించాలని ప్రయత్నించాడు.

విజయ్ అంగీకరించలేదు. అతడందుకు రెండు కారణాలు చెప్పాడు. ఒకటి—"తండ్రిపోగానే అన్ని బాధ్యతలూ తగులుకోకుండా కాపాడ్డానికి నీవంటి అన్న ఉండడం నా అదృష్టం—" అన్నాడు.

రెండు—"ఇది నా ఆస్తి కాదు. మన ఆస్తి. అన్నదమ్ములు విడిపోయేటప్పుడే ఆస్తిని పంచుకుంటారు. మనం ఎప్పటికీ విడిపోకూడదని నా ఆశయం. అన్నదమ్ములు కలిసి ఉన్నప్పుడు బాధ్యతలు అన్నవి...." అన్నాడు.

"మరి తమ్ముడికే బాధ్యతా ఉండదా?" అనడిగాడు సుధీర్.

"అన్న బాధ్యత తీసుకోమంటేతప్ప—మిగతా అన్ని విషయాల్లోనూ అన్నమాట వినడం తమ్ముడి బాధ్యత—" అన్నాడు విజయ్.

తండ్రిపోయిన అయిదేళ్ళలోనూ విజయ్, సుధీర్ ల అనుబంధం మరింత బలపడింది.

ఇంక విజయ్ మామూలు మనిషయ్యాడనే సుధీర్ భావించాడు. కానీ అయిదుసంవత్సరాలు గడచేక పూర్వపు జాడ్యం అతడిలో ప్రవేశించింది. అయితే ఇప్పటి పద్ధతి వేరుగా ఉంది. మనిషిలో వివేకం పెరిగింది. నిదానంగా ఉంటున్నాడు. కోరికమాత్రం చావలేదు.

"ఆ కోరిక ప్రమాదం...." అని సుధీర్ హెచ్చరించాడు.

"ఆ ప్రమాదమేదో నేను చూసుకుంటాను. నా కోరిక గురించి నిన్ను బాధించను...." అని మాత్రం విజయ్ సుధీర్ కి మాటిచ్చాడు.

మాటిచ్చిన వారంరోజులకు విజయ్ని ఓ పిల్ల అన్న చావబాది వదిలిపెట్టాడు. అతడివళ్ళు హూనమయింది. అదృష్టవశాత్తూ ఎముకలు విరగలేదు.

మరో పదిరోజుల్లో ఇంకో కామె అతడికి విషం పెట్టింది. విజయ్ స్పృహతప్పిపోతే భయపడి ఓ రిక్షావాడికి డబ్బిచ్చి—హాస్పిటల్ కు పంపించింది. అక్కడో డాక్టర్ విజయ్ని గుర్తుపట్టి—స్పెషల్ వార్డులో చేర్చాడు. సమయానికి సరైన ట్రీట్ మెంటు జరుగడంవల్ల విజయ్ బ్రతికి బయటపడ్డాడు.

సుధీర్ విజయ్ని హెచ్చరించాడు.

"భయపడకు. నా కిది సరదాగావుంది. ఏదో రోజున నా గమ్యం నేను చేరుకుంటాను. ఇప్పుడు జరిగిన అనుభవాలన్నీ నా తప్పుల కారణంగా అయ్యాయి. ఒకసారి చేసిన తప్పు మళ్ళీ చేయను...." అన్నాడు విజయ్.

సుధీర్ తన ప్రయత్నాల్లో తానుంటున్నాడు. విజయ్‌ని కాపాడ్డంకోసం—అతడు శత విధాల ప్రయత్నిస్తున్నాడు. అయితే అంతవరకూ ఒక్కసారికూడా విజయ్ కోరిక తీరలేదని అతడికెంతో బాధగావుంది. అది జరిగితే విజయ్‌లో మార్పు వస్తుందేమో!

విజయ్ కొన్నిచోట్ల దెబ్బలు తింటున్నాడు. కొన్ని చోట్ల అవకాశం చివరి క్షణాల్లో చేజారిపోతోంది. కానీ అతడి విషయమంతగా బయటకు పొక్కడంలేదు. ఎందుకంటే ఆడదాని పరువు కిలాంటివి బయటకు చెప్పుకుందుకు అడ్డువస్తాయి.

అయినా ఎందుకైనామంచిదని సుధీర్ అప్పుడప్పుడు విజయ్‌ని తీసుకుని స్థలం మారుస్తున్నాడు.

సుధీర్ మరోరకంగా కూడా తన ప్రయత్నాలు చేశాడు. కొందరమ్మాయిలకు డబ్బిచ్చి క్రమంగా విజయ్ మీదకు పురిగొల్పాడు. తనకు తానై వచ్చిన ఏ ఆడపిల్లనూ విజయ్ పెద్దగా ఆదరించలేదు. అతడిలోని ఉద్రేకం ఎటువంటిదో తెలియదు.

సుధీర్ విజయ్‌ని బాగా గమనించి ఒక విషయం తెలుసుకున్నాడు. వేటాడే ముందు పులి లేడిపిల్లనెన్నుకున్నట్లు—అతడు బయట తిరిగేటప్పుడు తనకుతానై ఓ అమ్మాయి నెన్నుకుంటాడు. క్రమంగా ఆమె వివరాలు, చిరునామా తెలుసుకుంటాడు. ఆమెను ఒంటరిగా పట్టడానికున్న సులువులు ఆలోచిస్తాడు. ఒకరోజు తన పథ

కాన్ని అమలు చేస్తాడు.

ఇవన్నీ వివరంగా డైరీలో రాసుకుంటాడు.

డైరీ గురించి తెలిసేక సుధీర్ పని సులభమయింది. అతడు విజయ్ డైరీని రహస్యంగా చదివి ముందుగానే తన జాగ్రత్తలో తానుండేవాడు. విజయ్ ఏ పరిస్థితిలో ఉంటాడోనని ఆ సమయంలో ఒక డాక్టర్ని తన కూడా ఉంచుకుంటున్నాడు.

కుసుమ వివరాలు డైరీలో చదివాడు సుధీర్.

"ఆమె పిరికిది. ప్రాణభయంతో ఏమైనా చేస్తుంది. నా కోరిక ఈమె కారణంగా తప్పక తీరుతుంది. నా కళ్ళెదుట ఈమె నగ్నంగా స్నానం చేయాలి. ఆ తర్వాత నేనామె ననుభవించాలి. తలచుకుంటేనే నా వళ్ళు పరవశిస్తోంది. అనుభవంలో ఇంకెంత బాగుంటుందో...." అని రాసుకున్నాడతడామె గురించి.

సుధీర్ డాక్టర్ని తీసుకొని వచ్చేసరికి విజయ్ తలమీద దెబ్బ!

* * *

ఈ కథ చెబుతూండగా మధ్యలో వాళ్ళు టిఫిను తినడమూ అయింది. కుసుమకు కథ వింటూంటే వళ్ళు జలదరించింది.

అచ్చోసిన ఆంబోతు విజయ్!

స్నానాల గదిలో షవరు క్రింద తను....తననే చూస్తూ అతడు....

ఆ అనుభవం తనకెంత జుగుప్సాకరంగా ఉంది!

అది విజయ్ మనసులోని కోరిక. అదీ తను, భర్త— బయట కలిసి తిరుగుతూండగా చూసినప్పు డతడిక్కాలి

గింది.

పురుషులందరూ ఇలాగే ఆలోచిస్తారా? ఇదేనా వారి సంస్కారం!

విజయ్ ఆలోచన ఏ రీతిగా ఉన్నాయో—మిగతా పురుషులందరికీ తెలిస్తే యేం చేస్తారు?

"విజయ్ మీద నీకు జాలి కలుగలేదు. అవునా?"

ప్రాణభయంతో సిగ్గువిడిచి నగ్నంగా డ్రెస్సింగు టేబిలు ముందు నిలబడిన తనను రెండు చేతులతో బలంగా నడుం దగ్గర పట్టుకున్న విజయ్ ఆమెకు గుర్తుకు వచ్చాడు.

"అవును—" అందామె.

"ఎందుకని?"

"అది సహజం...."

"ప్రతి పురుషుడికీ స్త్రీ అంటే బలహీనత....అదీ సహజమే!"

"సహజానికీ కొన్ని నియమాలుంటాయి...."

"నియమాలను త్రికరణశుద్ధిగా పాటించేవారెక్కడా ఉండరు. స్వార్థమో, భయమో—మనిషి నియమాలు పాటించేలా చేస్తుంది...."

"అది స్వార్థపరుల భావం...."

సుధీర్ నవ్వి—"కాదని ఇప్పుడే ఋజువు చేస్తాను. అందువల్ల నాకేమయినా ఫలితముంటుందా?" అన్నాడు.

"అంటే?"

"వివరాలు తర్వాత చెబుతాను. సరిగ్గా ఎనిమిది గంటలకు మనం హోటల్ హనీమూన్‌కు వెడదాం...." అన్నాడు సుధీర్.

"వెళ్ళి...."

"మళ్ళీ నీకు మాటిస్తున్నాను. నేను నిన్ను తాకను...."

"కానీ విజయ్ ..."

"అర్థమయింది నీ అనుమానం. నేను నిన్ను విజయ్ కోసం తీసుకుని వెళ్ళడం లేదు. అవతల విజయ్ చావు బ్రతుకుల్లో వున్నాడు. అది నిజం. అందులో నాటకమేమీ లేదు. నేనే కాదు. నిన్నెవ్వరూ తాకరు...." అన్నాడు సుధీర్.

అతడి కనులలో నిజాయితీ స్పష్టంగా కనబడుతోంది—"అయితే అక్కడేం చేస్తాం?"

"జీవితాన్ని గురించి కొన్ని కఠోరసత్యాం తెలుసుకోవాలి...."

## 3

రాత్రి ఎనిమిది గంటలు.

సుధీర్, కుసుమ—ఇద్దరూ ఓ గదిలో వున్నారు. విశాలమైన ఆ గదిలో ఖరీదైన కార్పెట్ పరచబడివుంది. తళతళ మెరిసే ఫర్నిచర్ గాలిలో తేలిపోతున్న భ్రమ కలిగించే సోఫాల్లో ఇద్దరూ కూర్చుని వున్నారు. వారి ఎదురుగా ఓ టెలివిజన్ సెట్టుంది. సుధీర్ చేతిలో కాల్క్యులేటర్ వంటి సాధన మొకటుంది.

"ఈ గదికి అద్దె రోజుకు వెయ్యి రూపాయలు...."

"ఏమిటి దీని ప్రత్యేకత?...." అంది కుసుమ కుతూహలంగా.

"ఈ హోటల్లో యిలాంటి గదులు నాలుగున్నాయి. బుకింగ్ అంత సులభం కాదు...." అన్నాడు సుధీర్.

"ఎందుకని?"

"ఈ హోటల్లో మొత్తం రెండువందల గదు
లున్నాయి. అందులో నాలుగు గదులు ఇలాంటివి.
పన్నెండు గదులు యువతీ యువకుల రహస్యానుభవాలకి
ప్రత్యేకం. ఆ గదుల్లో యేం జరుగుతున్నదీ చూసే సదు
పాయం యిక్కడ ఉన్నది. నీ యెదురుగా ఉన్న టీవీ
అందుకే!"

కుసుమ ముఖం ఎర్రబడింది—"నాకిది చెప్పడంలో
నీ ఉద్దేశ్యం?" అందామె తీవ్రంగా.

"మేడమ్—మాటి మాటికీ నామీద కోపం తెచ్చుకో
వద్దు. నువ్వూ నేనూ కలిసి చూస్తూన్న అనుభూతి ఇక్క
డుండదు. చెప్పాలంటే టీవీ యిప్పుడాన్లోనే వుంది. కానీ
యేమీ కనపడదు. అది పోలీసుల తృప్తికోసం. ఇదిగో
ఈ కళ్ళజోడు తీసుకో. ఇయర్ ఫోన్ పెట్టుకో—ఈ
రిమోట్ కంట్రోలు అందుకో. ఇందులో ఈ పక్కనున్న
పన్నెండు నంబర్లూ—నేను చెప్పిన ఆ పన్నెండు
గదులకూ సంబంధించినవి. ఏ నంబరు నొక్కితే ఆ గది
లోని దృశ్యం చూస్తావు. చూడక తప్పదు. ఓ కఠోరజీవిత
సత్యం నువ్వు తెలుసుకోవాలి...." అన్నాడు సుధీర్.

"ఏమిటది?"

"ఈ హోటల్లో యిలాంటి సదుపాయాలన్నీ యెవరి
కోసం? ఇది సంస్కారానికి సంబంధించిన విషయమేనా?
మంచికీ, చెడ్డకూ నిర్వచనం యెవరిచ్చారు? ఇక్కడిలా
జరుగుతున్నట్లు సామాన్యులకు తెలియకపోవచ్చు. అవినీతి
గురించి లెక్చర్లు దంచే నాయకులకు, ఏలుతున్న ప్రభువు
లకు, నిరోధించవలసిన అధికారులకు — అందరికీ
తెలుసు.

కానీ ఈ హోటలు ఈ విధంగా యిప్పటికి నాలు

గేళ్ళు పూర్తిచేసింది. ఇంకా యెన్నోయేళ్ళు పూర్తిచేయనుంది. గదికి రోజుకు వెయ్యి రూపాయలంటే లెక్కచేయకుండా యెందరో యెగబడి ఈ గదులు బుక్ చేసుకుంటున్నారు. అంటే డబ్బు అన్ని తప్పుల్ని సవరించగలదనే కదా అర్థం! అలాంటప్పుడు—అంతకంటే ఎక్కువ డబ్బివ్వగల విజయ్‌కు—ఒక్కసారంటే ఒక్కసారి—యే స్త్రీ సహకరించదేం?" అన్నాడు సుధీర్.

"ఏమిటి నువ్వు చెప్పదల్చుకున్నది?...." అంది కుసుమ.

"ముందు విశేషాలు చూడు. తర్వాత మాట్లాడుకుందాం—...."

కుసుమ కళ్ళజోడు పెట్టుకుంది. చెవుల్లో ఇయర్ ఫోన్ పెట్టుకుంది. ఎదురుగా వున్న టీవీ స్క్రీన్‌లో ఆమెకు కార్యక్రమాలు కనబడుతున్నాయి.

మైకేల్ జాక్సన్ పాట వస్తోందందులో. ఆమె అతడి గురించి వినివుంది.

కుసుమ కళ్ళజోడు తీసేసింది. టీవీలో యేమీ లేదు.

"తమాషాగా ఉందే—" అనుకుంటూ ఆమె రిమోట్ కంట్రోల్లో ఒక గది నంబరు నొక్కింది. ఇద్దరు ప్రేమికులు. ఒకరి కౌగిలిలో ఒకరు. ఇద్దరూ గాఢంగా ముద్దు పెట్టుకుంటున్నారు.

కుసుమ మరో మీట నొక్కింది. ఆ దృశ్యం ఆమెకు షాక్‌ను కలిగించింది. మరో మీట నొక్కేముందామెకు చేతులు వణికాయి.

మూడు.... నాలుగు.... అయిదు.... ఆరు....

ఒక్కొక్కటిగా మీటలు నొక్కి చూస్తోంది కుసుమ.

అంతవరకూ తెరమీద చూడని దృశ్యాలవి. చూస్తానని యెప్పుడూ అనుకోనిదృశ్యాలు. చూస్తూంటే జుగుప్సాకరంగానూ ఉంది. కుతూహలంగానూ ఉంది. మనసుకిబ్బందిగానూ ఉంది. ఆసక్తికరంగానూ ఉంది. శరీరంలో కోరిక పుడుతోంది. అసహ్యమూ రేగుతోంది.

కుసుమ ఏడవమీట నొక్కింది.

అప్పుడామె మ్రాన్పడిపోయింది.

అది స్నానాల గది. గదిలో షవర్లోంచీ నీళ్ళు పడుతున్నాయి. ఆ నీళ్ళ కింద ఓ యువతి. ఆమె స్నానం చేస్తోంది. స్నానం చేస్తున్న ఆమె కళ్ళలో భయం. ఆమెను చూడగానే కుసుమకు తనే గుర్తొచ్చింది.

ఆ యువతి కళ్ళలో భయానికి కారణముంది. ఆమెకు కాస్త దూరంలో నిలబడి ఓ యువకుడామెనే చూస్తున్నాడు. అతడి కళ్ళలో సంతోషం. మెరుపు.

ఆ యువతి భయానికి కారణం అదేమీ కాదు. ఆ యువకుడి చేతిలో తళతళ మెరిసే కత్తి వుంది. ఆమె ఆ కత్తినే చూస్తూ స్నానం చేస్తోంది.

ఆ యువకుణ్ని చూడగానే ఆమెకు విజయ్ గుర్తుకు వచ్చాడు.

కుసుమ ఆ దృశ్యం చూసి మ్రాన్పడిపోవడానికి కారణముంది.

ఆ యువకుడామెకు తెలుసు.... అతడామె భర్త!

ఇది కలా, నిజమా?

కుసుమ కళ్ళజోడుతీసి సుధీర్ వైపు తిరిగింది.

"ఇంకా నువ్వు అయిదు మీటలు నొక్కాలి!" అన్నాడు సుధీర్.

"వద్దు...." అంది కుసుమ—"నాకింకేమీ చూడా

లని లేదు....”

“నీ కిప్పుడో కఠోర సత్యం చెప్పనా?” అన్నాడు సుధీర్.

కుసుమ మాట్లాడలేదు.

“ఈ హోటల్లో నాకున్న పలుకుబడికి కారణం విజయ్ డబ్బుకాదు. అతడి....”

మాట్లాడలేదు కుసుమ.

“తనకు నచ్చిన యువతిని చూడగానే విజయ్ తన మనసులో రేగే భావాలను డైరీలో రాసుకుంటాడు. అతడి భావాలను నే నీ హోటలువాళ్ళ కమ్ముకుంటాను. అతని భావాలకెంత పాప్యులారిటీ అంటే — ఇప్పుడున్న పన్నెండు గదుల్లోనూ అతడి భావాలే అమలు జరుగుతున్నాయి..” అన్నాడు సుధీర్.

“అంటే?” అంది కుసుమ అప్రయత్నంగా.

“సెక్సులో విలక్షణత కోరడం మానవ సహజం. అటువంటి విలక్షణతను పదిమందినుంచీ సేకరించి ఉంచుతారీ హోటలువాళ్ళు. అవన్నీ ఓ పుస్తకంలో రాసి వున్నాయి. అనుభవాన్ని కోరివచ్చిన పురుషులు తమకు కావలసిన విలక్షణతను పుస్తకం చూసి ఎన్నుకోవచ్చు. ఆ ఎన్నికలో ఎక్కువమంది పురుషులు విజయ్ భావాలను కాంక్షిస్తున్నట్లు తెలిసింది. అంటే అతను అదుపు చేసుకోలేకపోతున్న కోరికల నెందరో అదుపు చేసుకోగలుగుతున్నారు తప్పితే— కోరికల విషయంలో ఇద్దరికీ తేడా లేదని అర్థం....”

కుసుమ నిట్టూర్చి కళ్ళజోడు మళ్ళీ పెట్టుకుని టీవీ వంక చూసి షాక్ తిన్నట్లు కళ్ళజోడు తీసేసింది.

“ఏమయింది?” అన్నాడతడు.

"జరుగుతున్నది చూడ్డానికి గదికి రోజుకు వెయ్యి రూపాయల అద్దె. ఆ గదుల్లో అనుభవం పొందుతున్న వారెంత పే చేస్తారు?" అంది కుసుమ.

"యువతులీ హోటలుకు సంబంధించినవారు. దీనికి దేశమంతా బ్రాంచిలున్నాయి. ప్రతి రెండు నెలలకీ యువతులకు స్థలం మార్పుంటుంది. వారికి మంచి జీతాలుంటాయి. యువకులను హోటలువారే ప్రత్యేకంగా ఎన్నిక చేసి విషయం చెప్పి వారి అనుమతి తీసుకుంటారు. సాధారణంగా ఇందు కంగీకరించని యువకులుండరు...."

"యువకుల ఎన్నిక ఎలా జరుగుతుంది?"

"హోటలుకు సంబంధించిన ఒక వ్యక్తి ఆ పనిమీదే వుంటాడు. తనకు వచ్చిన వారిని అతడు స్వయంగా కలుసుకొని మాట్లాడి టైము ఫిక్స్ చేస్తాడు...."

అంతా జుగుప్సాకరంగా అనిపించినా జరిగిందేమిటో అర్థమయింది కుసుమకు. తన భర్తనుకూడా ఈ హోటలు మనిషి కలుసుకొని వుంటాడు. అతడు వెంటనే ఆనందంగా అంగీకరించి వుంటాడు.

కుసుమ మళ్ళీ కళ్ళజోడు పెట్టుకొంది.

తనకూ ఇలాంటి అనుభవం జరిగింది. అప్పుడు తానతణ్ని ఇనుపగూటంతో మోదింది. ఇక్కడ తన భర్త ఆమెను తనకు దగ్గరగా హత్తుకొంటున్నాడు.

విజయ్‌ను తానసహ్యించుకొంది. అదే కోరిక తన భర్త మనసులోనూ వుంది. ఇప్పుడది తీర్చుకుంటున్నాడు.

కళ్ళముందు దృశ్యం భరించలేకపోతోంది కుసుమ.

"నేను రూంలో వారితో మాట్లాడవచ్చా?" అనడిగిందామె.

"నీ పేరు చెప్పి అతడి అందాన్ని మెచ్చుకోవచ్చు"

అన్నాడు సుధీర్ — "ఒకవేళ నీకు తెలిసినవారెవరైనా వుంటే మాత్రం వాళ్ళను కలవరపెట్టకు. ఎందుకంటే వాళ్ళమీద ఫీల్మతయారవుతూంటుంది. ఎరిగున్న వాళ్ళు ఫోన్ చేస్తే వాళ్ళు కలవరపడతారు ...." అని — "వాళ్ళతో మాట్లాడ్డానికి ఫోన్ సదుపాయముంది ...." అన్నాడతడు.

"కైండ్లీ గివ్ మి ది కనెక్షన్!" అంది కుసుమ.

సుధీర్ ఆమెను గదిలో వున్న ఫోన్ వద్దకు తీసుకొని వెళ్ళాడు. ఓ నంబర్ డయాల్ చేసి రిసీవ రామెకిస్తూ — "నువ్వు తప్పుగా మాట్లాడితే డిస్కనెక్టు చేయడానికి సిద్ధంగా వున్నాన్నేను ...." అని హెచ్చరించాడు.

"హలో — నా పేరు రాధ. నీ పేరు చెబుతావా?" అంది రాధ. అతడు తన పేరు చెప్పి .... "రాధంటే ఎవరు?" అన్నాడు.

"మనం రేపు కలుసుకుందాం. నీ యింటి అడ్రసు చెప్పు ...."

"ఇల్లు వద్దు. ఆఫీసు అడ్రసిస్తాను. పది దాటేక రా ...." అంటూ అతడు తన ఆఫీసు చిరునామా చెప్పాడు.

కుసుమ ఫోన్ పెట్టేసి కళ్ళు తుడుచుకుంది.

"ఏమయింది?"

"అతడు నా భర్త!" అందామె ఏడుపు గొంతుతో.

సుధీర్ ఆశ్చర్యంగా — "ఈజిట్!" అని — "నీ వంటి ఉత్తమ యిల్లాలి భర్త నీ విధంగా నేనూహించలేదు — ...." అన్నాడు.

"నీకు తెలుసు. నా భర్త నిందులోకి నువ్వే దించావు. కావాలనే నన్నిక్కడకు తీసుకొచ్చి ఈ దృశ్యం చూపిం

చావు...." అంది కుసుమ.

సుధీర్ తడబడలేదు—"పోనీ అలాగే అనుకో—ఎందుకిలా చేశానంటావు?" అన్నాడు.

"నాకు తెలియదు...."

"నేను చెబుతాను విను...." అని గొంతు సవరించుకున్నాడు సుధీర్ — "అవకాశం వస్తే తప్పులుచేసేవాళ్ళెందరో అయితే అవకాశం కల్పించుకొని తప్పులు చేసేవారు కొందరే వుంటారు. విజయ్ ఆ కొందరిలో ఒకడు. ఒకే ఒక్కసారి అతడి కోరిక తీరితే అతడిలో అవకాశం వచ్చినా తప్పుచేయని గొప్ప మన స్తత్వం ఏర్పడుతుందని నా అభిప్రాయం. అది సరైనదో కాదో తేల్చుకుందుకు నీ సహకారం కావాలి. ఒక్కసారికి.... ఆలోచించు.

ఇందులో నువ్వు తప్పుచేయడంలేదు. సాటిమనిషిని బ్రతికించడంకోసం మనిషి తన రక్తాన్నిస్తున్నాడు. కను గుడ్లనిస్తున్నాడు. మూత్రపిండాలనిస్తున్నాడు. నువ్వు శీలాన్ని పోగొట్టుకుంటున్నానన్న ఆలోచన మనసులోకి రానివ్వకు. విజయ్ రోగి. నువ్వు మందు. రోగి బాగు పడినా మందు తరిగిపోదు. మానసికంగా నువ్విందుకు సిద్ధపడాలి. ఏ వ్యక్తికోసం నువ్వు విజయ్ వశం కాలేననుకొంటున్నావో ఆ వ్యక్తి తన సుఖంకోసం యేమైనా చేస్తాడని యిప్పుడే చూశావు. ఇప్పుడాలోచించి చెప్పు...."

"ఆలోచించను. ఆరోగ్యం బాగుపడగానే విజయ్‌ని మా యింటికి పంపు...." అంది కుసుమ. ఆమె గొంతులో ఆవేశముంది.

# 4

సమయం—మిట్టమధ్యాహ్నం రెండు గంటలు....

సాధారణంగా ఆ సమయంలో కుసుమ నిద్రపో పోతూంటుంది. కానీ ఆ రోజు నిద్రపోవడం లేదు.

ఆమె విజయ్ కోసం ఎదురుచూస్తోంది.

అంతకు ముందు కొద్దిరోజుల క్రితం ఆకస్మికంగా అనుకోకుండా జరిగిన విశేషం ఈరోజు మరోసారి నాటకంలా జరుగుతుంది.

మానసికంగా, శారీరకంగా కుసుమకు తృప్తి కలిగించని నిర్ణయమది. కానీ ఆమెలో కసి, పగ. ఆమె యిప్పుడు భర్తతో తిన్నగా మాట్లాడడంలేదు. అతడికి విషయమూ చెప్పలేదు. అతడిలో తప్పుచేసిన వాడి అనుభూతిని గుర్తించి మరింత ఆవేశపడుతోంది.

తప్పుకు సమాధానం తప్పు కాదు. పతనానికి పతనం బదులు కాదు. అయినా కుసుమ లోతుగా ఆలోచించదల్చుకోలేదు. విజయ్ కోరిక తీరితే తప్ప ఆమె ఆవేశం చల్లారదు. అయితే అతడి కోరికను తీర్చి తను సాధించేదేమిటో ఆమెకు తెలియదు.

అతడు బాగుపడతాడు....

బాగుపడకపోతే?

కుసుమ ఆలోచిస్తోంది. వీధి తలుపులెవరో తట్టారు.

ఒక్కసారి కుసుమ శరీరం ఆపాదమస్తకమూ వణికింది.

ఏం జరుగుతుందిప్పుడు?

తానతడికి సహకరించగలదా?

మనసు ఎదురు తిరుగుతోంది.

వీధి తలుపులు ఎవరో తట్టారు.

కుసుమ మనసు సెదిరించి వెళ్ళి తలుపులు తీసింది.

గుమ్మం బయట విజయ్ వున్నాడు. అతడు తటాలున లోపలకు వచ్చి తలుపులు వేశాడు.

కుసుమ అతడి చేతివంక చూసింది. చేతిలో కత్తి వుంది.

"ఎవరు నువ్వు?" అందామె.

"నా పేరు విజయ్...." అన్నాడతడు.

"ఎందుకొచ్చావ్?"

"నీకోసం...."

"చేతిలోని ఆ కత్తిని పారేయి. నాకది చూస్తే భయం...." అంది కుసుమ.

"మరి నేను చెప్పినట్లు వింటావా?"

"వింటాను...."

"నిజంగా...."

"ఊc."

అతడు కత్తిని క్రింద పారేశాడు. ఇద్దరూ బాత్రూంకు వెళ్లారు. అతడు కోరిన విధంగా ఆమె షవర్ క్రింద నిలబడి స్నానం చేసింది.

"నీకిప్పుడు నేనంటే భయంలేదా?" అన్నాడతడు ఆశ్చర్యంగా.

"భయమెందుకు?" అంది కుసుమ.

"అంటే సుధీర్ చెప్పింది నిజమేనన్నమాట!"

"ఏమిటా నిజం?"

"నువ్వు నాకు పూర్తిగా సహకరిస్తావని...."

కుసుమ నవ్వి—"అవును...." అంది.

విజయ్ వెంటనే వెనక్కు తిరిగి — "నాతోరా!" అన్నాడు.

ఇద్దరూ పడక గదిలోకి వెళ్ళారు. విజయ్ తలుపులు వేశాడు.

"నీకు బాధగా లేదూ?" అన్నాడు అతడు.

"నీకు బాధగా వుందా?" అంది కుసుమ.

"నీకు బాధగా వుంటే నాకూ బాధగా వుంటుంది."

కుసుమ సాలోచనగా — "ఒక్కసారి నీ కోరిక తీర్చడానికి నాకు బాధ వుండదు...." అంది.

"నిజంగా నా కోరిక తీరుస్తావా?"

"ఊఁ."

"అయితే చెప్పనా?"

"ఊఁ."

"ఇప్పుడు నువ్వు నాకు దగ్గరగా రావాలి...."

కుసుమ అతడిని సమీపించబోగా—"అప్పుడే కాదు" అన్నాడతడు.

కుసుమ చిత్రంగా అతడివంక చూసింది. అతణ్ని చూస్తూంటే ఆమెకిప్పుడు పరాయి మగవాడన్న తలపు కలగడంలేదు. స్త్రీమూర్తులకు వద్దనచేసే అనసూయలా భావిస్తున్నదామె—విజయ్ గురించి.

"నువ్వు త్వరగా వెళ్ళి—నీ బీరువాలోంచీ—అన్నిం ట్లోకీ నీకు నచ్చిన మంచి బట్టలు వేసుకొని అప్పుడు నా దగ్గరగా —రా!" అన్నాడతను.

కుసుమ ఆశ్చర్యపడింది. కానీ అలాగే చేసింది.

విజయ్ ఆమె వంక క్షణంపాటు రెప్పవేయకుండా చూశాడు. లేత గులాబీరంగు చీర. అదే రంగు రవిక. చీర రంగు ఆమె వంటి రంగులో కలిసిపోయింది.

"నువ్విప్పుడే ఎంతో బాగున్నావు...." అన్నాడు అతడు.

కుసుమ అతడివంక ఇంకా ఆశ్చర్యంగా చూసింది.

వున్నట్టుండి విజయ్ ఓ వెర్రికేక పెట్టాడు.

"ఏమయింది?" అందామె కంగారుగా.

"నేను మారిపోయాను. నాలో మార్పు వచ్చింది. ఎంతో ఆరోగ్యకరమైన మార్పు. పరాయి స్త్రీని తల్లిగా భావించాలనుకునే మార్పు. అందమైన, ఆరోగ్యమైన నీవంటి యువతిని నగ్నంగా చూసినా చలించని మార్పు ....ఇప్పుడు నాకెంతో సంతోషంగా వుంది...."

"నువ్వేమంటున్నావో నాకర్థం కావడంలేదు...." అంది కుసుమ.

"నీచేత దెబ్బతిని హాస్పిటల్లో చేరాక నాకు స్పృహ వచ్చినప్పట్నించీ నాలో యేదో మార్పు వచ్చినట్లు ఫీలయ్యాను. అందరూ అసాధారణమూ, అసంబద్ధమూ అని భావించే కోర్కెలు నన్ను వీడిపోయాయి. నువ్వు కొట్టిన దెబ్బ నాకు మేలుచేసింది. అయితే నాలోని మార్పు సుధీర్‌కి తెలియదు. అతడు నీ మనసును తానే విధంగా మార్చినదీ నాకు చెప్పాడు.

అయితే నా ప్రవర్తన నాకు గుర్తుంది. నీ పట్ల నేనెలా ప్రవర్తించానో తల్చుకొని ఎంతో సిగ్గుపడ్డాను. సుధీర్ చెప్పింది విన్నాక అతడు చెప్పిందాంట్లో నిజమెంతుందో చూడాలనిపించింది. నామీద జాలితో నువ్వు నాకు సహకరించినా-నేనందుకు సిద్ధపడి వున్నానో లేదో పరీక్షించుకోవాలనిపించింది. అందుకే సుధీర్ చెప్పిన టైముకిప్పుడు వచ్చాను. నన్ను నేను పరీక్షించుకున్నాను. నాకిప్పుడెంతో సంతోషంగా వుంది...." అన్నాడు విజయ్.

అప్పుడు కుసుమకు కలిగిన మానసిక తృప్తి మాటల్లో

వర్ణించడం కష్టం.

అతడు మామూలు మనిషయ్యాడు. తన మూలంగానే మామూలు మనిషయ్యాడు. చెప్పాలంటే అతడిప్పుడెంతో వున్నత స్వభావుడు.

అతడిలోని ఈ మార్పుకు కారణమేమిటి?

తను ఇనుపగూటంతో అతడి తలమీద మోదింది. అదే అతడి మెదడును సరిచేసిందని విజయ్ అభిప్రాయం. అది నిజమా—లేక ....

అతడు అనుకున్నంత దుర్మార్గుడు కాదేమో! షవర్ క్రింద తను స్నానం చేయడం చూసి తృప్తిచెందాడేమో! అతడి మనసులోని కోరిక అంతవరకే వున్నదేమో .... అది తీరగానే అతడి మనసుకు తృప్తికలిగి మెదడు సర్దుకున్నదేమో ....

ఏదియేమైనా అతడు తన కారణంగా మామూలు మనిషయ్యాడు.

"నేనిప్పుడిక్కడికెందుకొచ్చానో తెలుసా? తప్పును మనిషి బలంతో ఎదుర్కొగలుగుతాడు. నీ చేతిలోని ఇనుపగూటం నీకు నా తప్పునణిచే బలాన్నిచ్చింది. కానీ యిప్పుడు సుధీర్ నా గురించి నీ భర్తను తప్పుదారి పట్టించాడు. అతణ్ని సరైన దారిలోకి మళ్ళించాలంటే నీ బలం చాలదు. అంటే యిప్పుడు నీ యింట్లో నీ భర్తే మరో విజయ్‌గా మారాడు. అతడిని సరైన దారిలోకి మళ్ళించే బలం నీకివ్వాల్సిన బాధ్యత నాది. నువ్వు నాకు చేసిన సాయానికి ప్రతిఫలముండాలి. అందుకే నేను నీకు లక్షరూపాయలిస్తున్నాను ...." అన్నాడు విజయ్.

"ఎందుకు?" అంది కుసుమ తెల్లబోయి.

"మొత్తం జరిగిందంతా నిజాయితీతో నీ భర్తకు

చెప్పు. అతడు చేసిన ఒక్క తప్పునీ క్షమించు. నీ క్షమకు ఆనందపడి, నీ నిజాయితీని నమ్మడానికి-నీ వద్దనున్న లక్ష రూపాయలూ నీ భర్తకు సహకరిస్తాయి. ఆ డబ్బు నీకు బలం...."

కుసుమకు జరుగుతున్నది కలో, నిజమో తెలియలేదు.

విజయ్ లేచి నిలబడి-"డబ్బు నీకు రేపు సుధీర్ అందే యేర్పాటు చేస్తాడు నీ పేరునే ఫిక్స్‌డ్ డిపాజిట్ రూపంలో. పది సంవత్సరాలదాకా వడ్డీ అనుభవించ డానికి తప్ప ఇతర హక్కులుండవు నీకు...." అన్నాడు.

"నువ్వు నిజంగా మంచివాడివి...." అంది కుసుమ.

"కాదు అల్పుడిని. కాళ్ళు కళ్ళకద్దుకోవలసిన దేవతను కామించాను. ఇప్పటికైనా ఆ తప్పు సవరించుకొంటాను. జరిగింది మరిచి నన్ను క్షమించు..." అంటూ అతడు వంగి ఆమె కాళ్ళు కళ్ళకద్దుకొని అక్కణ్ణించి వెళ్ళి పోయాడు.

కుసుమ మాత్రం చాలాసేపు అక్కడే నిలబడి పోయింది. ఆమెకెంత ఆలోచించినా విజయ్‌లో అల్పత్వం గోచరించడంలేదు. కానీ భర్త మాత్రం ఆమెకు అల్పుడి లాగే తోస్తున్నాడు...

—:అయిపోయింది:—

# హిమబిందు

## ఎమ్. డి. చైతన్య

ఆ అమ్మాయి అందంగా వుంది. ఇరవై ఏళ్ళుంటాయి.

గుండ్రని ముఖం.

విశాలమైన ఫాలభాగం.

పద్మములవంటి కళ్ళు.

కోటేరులాంటి ముక్కు.

బంగారపు రంగు మేనిచ్ఛాయ.

ఆమె పేరు రమణి.

ఎర్రని ఓణి, తెల్ల జాకెట్టు, తెల్లపూల లంగా ధరించి వుంది.

పిరుదల వరకు వ్రేలాడుతున్న జడలో గులాబి పువ్వు తురుముకుంది.

చేతిలో పుస్తకాలను చూసి — ఎవరైనా కాలేజీ స్టూడెంటు అని తేలికగా అంచనా వేయవచ్చు.

ఆ అమ్మాయి యస్.జి. కాలేజీనుంచి బయటికొచ్చి-కాలేజీ యెదురుగా వున్న క్యాంటిన్ లో దూరింది.

ఆ అమ్మాయిని మరో యువకుడు వెంబడిస్తున్నాడు. అతని పేరు యువరాజు.

యువరాజు ఆ అమ్మాయిమీద మనసుపడ్డాడు. "ఐ లవ్ యూ!" అని అనాలనుకుంటున్నాడు. కానీ ధైర్యం చాలడంలేదు.

అయినా ఆ అమ్మాయిని వెంబడించి తన మనసులోని మాట చెప్పాలని నిర్ణయించుకున్నాడు.

క్యాంటిన్‌లోకి సాధారణంగా అమ్మాయిలు ఎవ్వరూ రారు. చాలా కొద్దిమంది మాత్రమే వస్తారు.

అందులో రమణి ఒకత్తి.

క్యాంటిన్‌లోకి వెళ్ళి 'ఖలాకన్' ఆర్డరు చేసింది.

అయిదు నిమిషాలు గడిచిపోయాయి.

'ఖలాకన్' వచ్చే జాడ కనిపించలేదు.

సర్వర్ అశ్రద్ధకు రమణికి కోపమొచ్చింది.

ఖాళీ సిల్వర్ నీళ్ళ గ్లాసుతో-గ్లాసు బద్దలైపొయ్యేట్లు టేబిల్ మీద బాదేసింది.

హోటల్ ప్రొప్రయిటర్ పరుగెత్తుకొచ్చాడు.

ఆ వెనుకే ఓ సర్వర్ పరుగెత్తుకొచ్చాడు.

అతని వెనుక మరో సర్వర్ పరుగెత్తుకొచ్చాడు.

ఒకడు ఖలాకన్ తెచ్చాడు.

ప్రొప్రయిటరు నోరు మెదపలేదు.

సర్వర్ గమ్మున ప్లేటు అక్కడ పెట్టేసి వెళ్ళిపోయాడు.

రమణి తలెత్తి విసుగ్గా వాళ్ళవైపు చూసి తినడం ప్రారంభించింది.

దూరంగా కూర్చుని తమాషా చూస్తున్న యువరాజు "అబ్బో, ముదురే!" అనుకున్నాడు.

క్యాంటిన్‌లో మొగవాళ్ళంతా రమణివైపే చూస్తున్నారు.

రమణి అదంతా ఏమీ పట్టించుకోకుండా - తింటూ కూర్చుంది

'ఖలాకన్' తినడం పూర్తవ్వగానే - కాంపిల్ ఖారా పెట్టి - "ఇంకా ఏం కావాలమ్మా!" అని అడిగాడు సర్వర్.

"టీ పట్రా!" అంది.

క్షణంలో టీ వచ్చేసింది.

రమణి టీ త్రాగి బిల్ పేచేసి బయట పడింది.

ఆమె శివాజీ నగరువైపు వెళ్తోంది.

యువరాజు చేతిలో సైకిలుంది.

వంద గజాల దూరంలో వుండి - ఆమెను వెంబడిస్తున్నాడు.

సెంటర్‌కు సమీపంలో వున్న ఓ వీధిలోకి వెళ్ళింది రమణి.

యువరాజు గౌతమ్ జనరల్ స్టోర్స్ కార్నర్ దగ్గర సైకిలు ఆపి వీధిలోకి చూస్తూ నిల్చున్నాడు.

అక్కడ నిల్చుంటే - వీధి చివర వరకు వున్న ఇళ్ళన్నీ కనిపిస్తాయి.

రమణి ఓ పెద్ద గేటువున్న ఇంట్లో దూరింది.

ఆ ఇల్లు యువరాజుకు బాగా తెలుసు.

అందులో దాదాపు అరడజనుకుపైగా పోర్షన్లు వున్నాయి. అన్నీ అద్దెకిస్తారు.

అంటే - రమణి అద్దె ఇంట్లో వుందన్నమాట.

అద్దె ఇల్లు ఖాళీగా వుందేమోనన్న నెపంతో అక్కడికి వెళ్ళవచ్చు.

యువరాజు సైకిలు ఎక్కాడు.

గేటు తెరుచుకొని లోనికి వెళ్ళాడు.

ఆ ఇంట్లో చేదుడు బావి వుంది.

రమణి చేదుడు బావి దగ్గరకువెళ్ళి ముఖం కడుక్కుంటోంది.

యువరాజు ఆమె దగ్గరికెళ్ళి—

"ఏమండీ!" అన్నాడు.

ముఖం కడుక్కుంటున్నదల్లా — తలెత్తి చూసి—

"ఏమిటిది?" అన్నది.

నీటి బిందువులు ఆమె ముఖంమీదపడి - ముత్యాల్లా మెరుస్తున్నాయి.

ఆమెను అలా చూస్తుంటే - వడ్డాది పాపయ్య చిత్రంలా అందంగా కనిపించింది.

"ఇక్కడ గదులు యేమైనా ఖాళీగా వున్నాయండీ" అని అడిగాడు.

"ఉండండి, చెప్తాను!" అంటూ ఆమె టవల్ తో ముఖం తుడుచుకొని.

"ఆఁ ఇప్పుడు చెప్పండి!" అని అడిగింది.

"అదేనండి! గదులు.."

"చూడు మిష్టర్, నువ్వు మన కాలేజీలో చదువుతున్నావని నాకు తెలుసు. ఇందాక నాకు కాలేజీ గేటు దగ్గర కనిపించావు, తర్వాత క్యాంటిన్ లో కనిపించావు, ఆ తర్వాత గౌతమ్ స్టోర్సు దగ్గర కనిపించావు మళ్ళీ ఇక్కడకూడా తయారయ్యావు. ఏమిటి నీ ఉద్దేశం!"

యువరాజు ఖంగుతిన్నాడు. ఆమె తనను గమనించలేదు అనుకున్నాడు. కానీ తెలివిగల పిండం. ఓ కంట తనను కనిపెడుతూనే వుందన్నమాట.

"ఆహా! నీ ఉద్దేశ్యమేమిటో ఫ్రాంక్‌గా చెప్పెయ్! నే నేమీ అనుకోను" అన్నది.

"చెప్పమంటారా?" భయపడుతూనే అన్నాడు.

"చెప్పండి!"

అతను ధైర్యాన్ని కూడగట్టుకొని—

"ఐ లవ్ యూ!" అన్నాడు.

రమణిలో ఎలాంటి చలనం లేదు.

"అయితే నన్నేం చేయమంటావు?" అన్నది.

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నప్పుడు, మీరు కూడా నన్ను ప్రేమించాలి! ప్రేమిస్తే ధన్యుణ్ణి!"

"ఓ. కె. ప్రేమిస్తాను. పెళ్ళి చేసుకుంటావా?" అన్నది ఎగతాళిగా.

"ఓ, చేసుకుంటానండీ!"

"సరే! బాగానే వుంది. పెళ్ళి చేసుకుంటావు, మరి నన్ను ఎలా పోషిస్తావు? నిన్ను నువ్వు ఎలా పోషించుకుంటావు? పుట్టబోయే పిల్లలను యెలా సాకుతావు చెప్పు మరి!" అని అడిగి ఆమె తన గదిలోకి దారి తీసింది.

యువరాజు ఆమె వెనకాలే వెళ్ళాడు.

"నేను అవన్నీ ఆలోచించలేదండి!"

రమణి నవ్వింది.

"ఆలోచించలేదా? ఆలోచించవని నాకు తెలుసు, ఇక వెళ్ళిరా!"

యువరాజు యిబ్బందిగా ఫీలయ్యి అక్కడ్నుంచి కదిలాడు.

"మిస్టర్ ...." అంటూ పిలిచింది.

యువరాజు వెలిగిన ముఖంతో వెనక్కి తిరిగాడు.

"మీ పేరు ...." అడిగింది.

"అమ్మో! నేను చెప్పను...." అన్నాడు భయపడుతూ.

"ఏం ఎందుకూ?"

"మీరు ప్రిన్సిపాల్ కు రిపోర్టు చేస్తే...."

రమణి నవ్వింది.

"ఆల్ రైట్, నీ పేరు చెప్పొద్దు...." అని ఆగి—

"నేనంటే నీ కిష్టమేనా!"

"ఔను. ఇష్టమే!" అన్నాడు మెరిసే కళ్ళతో.

"నేను నీకు కావాలా....?" అడిగింది మత్తుగా చూస్తూ.

అతనికేం చెప్పాలో అర్థంకాక వూరుకున్నాడు.

"ఊఁ చెప్పు!" రెట్టించింది.

"ఆఁ కావాలి!"

"అలా అయితే రెండొందల రూపాయలు, ఓ విస్కీ బాటిల్ తీసుకొని—మీనాక్షీ హోటల్లో, ఓ రూం బుక్ చెయ్యి—రాత్రికి వస్తాను!" అన్నది.

యువరాజు షాక్ తిన్నాడు.

మాట్లాడుతోంది రమణియా లేక ఇంకెవరైనానా?

తన కలల దేవత ఓ పచ్చి ప్రాస్టిట్యూట్ లా అలా మాట్లాడుతోందేమిటి?

ఆమెకు డబ్బు అవసరం వుండి, అలా అడుగుతుందేమో! తనకు డబ్బు కావాలని సూటిగా అడగొచ్చుగా! సానిదానిలా లాడ్జింగ్ బుక్ చెయ్యి అనడం దేనికో! యువరాజుకు యేమీ అర్థంకాలేదు.

"ఏమిటి నిశ్శబ్దంగా ఉండిపోయావు?" మళ్ళీ అడిగింది.

"మీకు డబ్బు అవసరం ఉన్నట్లుంది. ఎంత కావాలో

చెప్పితే—సర్దుతాను, అంతే కానీ—లాడ్జింగ్ ఎందుకూ!" బాధగా అన్నాడు.

"నువ్వు డబ్బు సర్దితే—నేను నీ ఋణాన పడి పోతాను. నీ ఋణం తీర్చుకోడానికే లాడ్జింగుకు రమ్మంటున్నాను!" తాపీగా అంది.

యువరాజుకు యేం మాట్లాడాలో అసలు యెలా మాట్లాడాలో అర్థం కాలేదు.

తను ఎన్నో సినిమాలు చూశాడు.

ఎన్నో నవల్సు చదివాడు. కానీ—ఎక్కడ ఇటువంటి సన్నివేశం తగిలినట్లు లేదు. లేకపోతే—ఆ యా సన్ని వేశాల్లో హీరోలు వాడే డైలాగులు తనూ వాడేవాడు. ప్చ్! దురదృష్టం అనుకున్నాడు.

ఎటూ తేల్చుకోలేక యింకా ఆలోచిస్తూ కూర్చు న్నాడు.

"ఊఁ మీ నిర్ణయ మేమిటో త్వరగా చెప్పండి!" అన్నది.

"ఆల్ రైట్, మీరు చెప్పినట్లే చేస్తాను. రాత్రి ఏడు గంటలకు మళ్ళీ యిక్కడికి కొస్తాను!" అంటూ యువ రాజు ఆమె గదిలో నుంచి బయటపడ్డాడు.

రమణి దగ్గర ఆ మాటన్నాడే గానీ—యువరాజు దగ్గర రెండు వందల రూపాయలు మాత్రమే ఉన్నాయి.

మరో రెండు వందలు కావాలి.

లాడ్జి రెంటు ప్లస్ విస్కీ బాటిల్ కొరకు వూరంతా తిరిగి ఫ్రెండ్స్ దగ్గర అప్పులు చేసి—రెండు వందలు సంపాదించగలిగాడు.

సాయంత్రం ఏడు గంటలు—

యువరాజు రమణి గదికి వెళ్ళాడు.

రమణి ఆకాశం రంగు చీర, ఆదేరంగు బ్లౌజు ధరించి ట్రిమ్ముగా తయారై పడకకుర్చీలో జారగిలబడి యేదో వారపత్రిక చదువుతోంది.

యువరాజును చూసి — "రండి, కూర్చోండి!" అంటూ కుర్చీ చూపెట్టింది.

యువరాజు బ్యాగు ప్రక్కన పెట్టి కూర్చున్నాడు.

రెండు నిముషాల తర్వాత—

"తయారై పోయారా?" అని అడిగింది.

"ఊఁ అంతా రెడీ!" అన్నాడు యువరాజు.

"అయితే పదండి!" అంటూ లేచింది.

ఇద్దరూ బయటికి నడిచారు.

పూర్తిగా చీకటి పడిపోయింది.

"రిక్షాను పిలవండి!" అన్నది.

యువరాజు పిలిచాడు.

దేరమాడకుండా రిక్షాలో కూర్చున్నారిద్దరూ.

రిక్షా కదిలింది.

"రమణిగారూ! చీర కట్టుకున్నా రెందుకండీ?" అడిగాడు యేదో ఒకటి మాట్లాడాలని.

"చీర కడితే నీకు కష్టమా?"

"అబ్బే, అదేం లేదు. ఊరికే అడిగాను!"

రమణి నవ్వింది.

"నేను చీర కట్టడానికి ఒక కారణముంది. ఊహించండి, చూద్దాం! మీరు కరెక్టుగా వూహిస్తే వంద రూపాయ లిస్తాను" అన్నది.

వంద రూపాయల కోరకు కాకపోయినా — ప్రిస్టేజి యస్ గా తీసుకొని—ఆలోచించడం మొదలు పెట్టాడు.

ఆతని మెదడులో యేదో ఆలోచన వెలిగింది.

"ఆఁ మీరు చీరకడితే_ ఇంకా అందంగా వుంటారు. అందుకే కట్టారు. యామ్ ఐ కరెక్టు" అన్నాడతను పజిల్ సాల్వ్ చేసినవాడిలా మొహం పెట్టి.

"ఊహుఁ కాదు" అన్నది.

"కాదా? ఇంకేమై వుంటుందబ్బా!" అతను ఆ పైన వూహించలేక పోయాడు.

"సరే, నేనే చెప్తాను లెండి. నేను లంగా ఓణీమీద హాస్టల్ కొస్తే_ హాస్టల్ అతను అనుమానించి గది ఇవ్వడు. అక్కడ నన్ను మీ భార్యగా పరిచయం చేయండి! ఎందుకైనా మంచిదని ఓ తాళిబొట్టు కూడా మెళ్ళో వేసుకొచ్చాను" అంటూ బయటికి తీసి చూపింది.

యువరాజు ఆశ్చర్యపోయాడు.

"అబ్బ! మీ రెంత తెలివిగలవారండి! రాబోయే అపాయాలను చక్కగా ఊహించారు" అంటూ మెచ్చుకున్నాడు.

రిక్షా యస్. బి. హెచ్. ఎదురుగా వున్న మీనాక్షీ లాడ్జింగ్ ముందు ఆగింది.

ఇద్దరూ రిక్షా దిగారు.

"ఓ గోల్డుఫ్లాక్ సిగిరెట్ పాకెట్ పట్రండి!" అంది.

"అబ్బె, నేను త్రాగనండి!" అన్నాడతను సిగ్గు పడుతూ.

"మీ కోసం కాదులెండి, నా క్కావాలి!"

"అలాగే" అంటూ ప్రక్కన వున్న పాన్ షాపువైపు నడిచాడు.

"ఇదేం ఆడదిరా బాబు! విస్కీ త్రాగుతానంటోంది,

సిగరెట్లు త్రాగుతా నంటోంది.........ఇంకేం చేయ బోతోందో....” అనుకున్నాడు.

సిగరెట్లు కొనుక్కొని వాళ్ళు హోటల్ కౌంటర్ వైపు నడిచారు.

హోటల్ అతను వాళ్ళను అనుమానించలేదు.

రజనీ, రవీందర్ అని తప్పుడు పేర్లు వ్రాయించారు విజిటర్స్ అరైవల్ రిజిష్టర్లో.

డబుల్ రూం అద్దె నలభై రూపాయలు చెల్లించాడు.

రూం నెంబరు 45 తాళంచేతులు యిచ్చాడు రిసెప్షనిస్టు.

గదిలో దూరారు ఇద్దరూ.

వెళ్ళూనే కాలింగ్ బజర్ నొక్కింది రమణి.

నిముషం తర్వాత వెయిటర్ వచ్చాడు.

“రెండు గాజు గ్లాసులు, జగ్‌లో కాసిన్ని నీళ్ళు పట్రా!” అంది.

“గ్లాసులు దేనికీ?” అన్నాడు యువరాజు అర్థంకాక.

“విస్కీ ఎట్లా త్రాగుతారు?”

“ఓహో, విస్కీ త్రాగడానికా?” అంటూ బ్యాగు నుంచి ఓల్డు టవరిన్ విస్కీ ఫుల్ బాటిల్ తీశాడు.

ఇంతలో వెయిటర్ రెండు గ్లాసుల మంచినీళ్ళు తీసుకొచ్చాడు.

“చూడు బాబు, నీ పేరేంటి!” అడిగింది రమణి.

“యాదగిరి!” అన్నాడు వాడు.

“చూడు యాదగిరి, మీ హోటల్ ప్రక్కన ఓ దుకాణం ఉంది. అందులో వేయించిన జీడిపప్పు పాకెట్లు

అమ్మతారు. వెళ్ళి ఓ నాలుగు పాకెట్లు పట్రా!" అని ఓ ఇరవై రూపాయల నోటు ఇచ్చింది.

వెయిటర్ డబ్బులు తీసుకొని వెళ్ళిపోయాడు.

విస్కీ బాటిల్ ఓపన్ చేసి—రెండు గ్లాసుల్లో సర్దేసింది.

"నేను త్రాగనండి! మొత్తం మీరే త్రాగెయ్యండి!" అన్నాడు యువరాజు ఇబ్బందిగా.

"అదేం కుదరదు! మీరు త్రాగాల్సిందే! ఊఁ తీసుకోండి!" అని అతని చేతికందించి "ఛీర్స్!" అన్నది.

యాదగిరి జీడిపప్పు తెచ్చిచ్చాడు.

జీడిపప్పు నంజుకుంటూ యిద్దరూ కలిసి ఫుల్ బాటిల్ పూర్తిచేశారు.

## 2

ఉదయం పదకొండు గంటలు.

రూం నెంబరు 45 గది తలుపులు ఇంకా తెరుచుకోలేదు.

హోటల్ వాళ్ళకు అనుమాన మొచ్చి తలుపు తట్టి పిలిచారు.

లోపల్నించి బోల్టు పెట్టిలేదేమో తలుపులు తెరుచుకున్నాయి.

రమణి బోర్లా పడుకొని ఉంది.

హోటల్ మేనేజర్‌కు అనుమాన మొచ్చి తట్టి చూశాడు.

శరీరం చల్లగా తగిలింది.

అటువైపు త్రిప్పి—ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు.

శ్వాస ఆడటంలేదు.

"మైగాడ్! ఈవిడ చనిపోయిందా?" గదిలో నిల్చున్నవారంతా షాక్ తిన్నారు.

ఆమెతో పాటు వచ్చిన యువకుడి జాడ జాడ లేదు.

హోటల్ మేనేజర్ వెంటనే పోలీసులకు ఫోన్ చేశాడు.

అయిదు నిముషాల్లో యస్.ఐ. జనార్ధన్ హెడ్ కానిస్టేబుల్, నలుగురు కానిస్టేబుల్స్ వచ్చారు.

పోలీసులు శవపంచనామా జరిపి—శవాన్ని పోస్టుమార్టం నిమిత్తం హెడ్ క్వార్టర్స్ హాస్పిటల్ కు తరలించారు.

మధ్యాహ్నం రెండు గంటలు.

సబ్ ఇన్ స్పెక్టర్ రిసెప్షనిస్టు స్టేటుమెంటు రికార్డు చేయడానికొచ్చాడు.

"మీ పేరు?"

"రంగారావు!" చెప్పాడు రిసెప్షనిస్టు.

"వీళ్ళు హోటల్ గదిని ఎప్పుడు బుక్ చేశారు? వెంట యెవరున్నారు — మీకు తెలిసిన వివరాలు చెప్పండి!"

"నిన్న సాయంత్రం ఏడున్నర గంటలప్పుడు చనిపోయిన అమ్మాయితో పాటు మరో యువకుడు వచ్చాడు. వాళ్ళిద్దరూ భార్యా భర్తలు. పేర్లు రజనీ రవీందర్. భువనగిరి నుండి వచ్చామని చెప్పారు."

"అతను ఎలా వుంటాడో చెప్పగలరా!"

"ఎర్రగా ఉంటాడు. ఉంగరాల జుత్తు!"

"వయస్సు ఎంత ఉంటుంది?"

"దాదాపు యిరవై సంవత్సరాలకు పైగానే ఉంటాయి!"

"వృత్తి యేదైనా రాశారా?"

"బిజినెస్ అని రాసాడు కానీ—అతని వాలకం స్టూడెంటులా వుంది!"

"ఐసీ!" వివరాలన్నీ రాసుకొని బయటపడ్డాడు.

స్టూడెంటు అయితే—బహుశా అతనికి పెళ్ళి అయి ఉండదు. అమ్మాయి యేదైనా బ్రోతల్ కంపెనీకి సంబంధించినదా?

ఆదేరోజు స్థానికంగా వెలువడే ఈవినింగ్ ఎడిషన్‌లో హోటల్‌లో చనిపోయిన అమ్మాయి ఫోటోతో సహా సంచలన వార్త ప్రచురించారు.

పత్రికలు హాటు హాటుగా అమ్ముడు పోయాయి.

ఆదేరోజు సాయంత్రం రమణి తల్లిదండ్రులు పోలీసు స్టేషన్ కొచ్చారు. వాళ్ళు ప్రక్కనే ఉన్న విలేజీలో వ్యవసాయం చేసుకుంటూ వుంటారు.

సబ్ ఇన్‌స్పెక్టర్ జనార్ధన్ కేసు డైరీ రాసుకుంటూ కూర్చున్నాడు.

కానిస్టేబుల్ ఒకతను వచ్చి—"నిన్న జరిగిన సస్పీషియస్ డెత్ కు సంబంధించిన వాళ్ళు వచ్చారు సార్!" అన్నాడు.

"అలాగా! పంపించు!"

రెండు నిముషాల తర్వాత వాళ్ళు వచ్చారు.

"నమస్కారమయ్యా!" అన్నారిద్దరూ చేతులు జోడించి.

వాళ్ళను చూస్తూనే వ్యవసాయ కుటుంబానికి చెందిన వారని చెప్పవచ్చు. వారి వేష భాషలు ఆ విధంగా వున్నాయి.

శోకతప్త హృదయాలతో వాళ్ళ గొంతులు మూగ

వోయాయి.

"మీ పేరేమిటి?" అడిగాడు యస్.ఐ.

"నా పేరు రామిరెడ్డి, నా భార్య పేరు శాంతమ్మ!" చెప్పాడు అతను.

"ఏం చేస్తుంటారు?"

"వ్యవసాయం!"

"చనిపోయిన రమణి మీకేమౌతుంది?"

"కూతురు."

"ఆమెను ఈ వూళ్ళో యేం పని?"

"కాలేజీ చదువులకు ఈ వూరు పంపించాను."

"కాలేజీలో ఏం చదివేది?"

"తెలవదయ్యగారు, కానీ—పెద్ద కాలేజీలో మాత్రం చదువుతుందని తెలుసు!"

"రవీందర్ అనే కుర్రాడు మీకు తెలుసా? అతనే మీ కూతురితో లాడ్జింగ్‌లో గడిపాడు."

"తెలవదయ్యా!"

"ఏమీ అనుకోకండి. మీ కూతురు చెడు తిరుగుళ్ళు తిరుగుతూ ఉండేదనే విషయం మీకు తెలుసా?"

అతను ఓ క్షణం మౌనం వహించి—

"ఔను! కొందరు నా భార్యతో చెప్పారట! కానీ, మేము నమ్మలేదయ్యా! నా కూతురు చెడు తిరుగుళ్ళకు కారణం కాలేజీలోనే చదువుతున్న మా వూరి అమ్మాయిలు ప్రవీణ, రవీణలని ఈ రోజే తెలిసింది."

సబ్ ఇన్‌స్పెక్టర్ జనార్ధన్ ఆశ్చర్యపోయాడు.

వాళ్ళ పేర్లు నోట్ చేసుకొని—

"వాళ్ళు ఎక్కడ ఉంటారు?"

"ఈ ముగ్గురూ కలిసి—ఒక గదిలో అద్దెకు ఉండే

వాళ్ళు. అదే మా అమ్మాయి చేసిన పొరపాటు. వాళ్ళు త్రాగుడు, వ్యభిచారంలో ఆరి తేరి మా అమ్మాయికికూడా ఆ పాడు అలవాట్లు నేర్పించారు. వీళ్ళంతా శివాజీ నగర్‌లో ఒక మూడు గదుల యిల్లు అద్దెకు తీసుకొని ఉంటున్నారు.

యస్.ఐ. వాళ్ళు చెప్పిన వివరాలన్నీ రాసుకోవ డంలో మునిగిపోయాడు.

# 3

రవీందర్ అని మారు పేరు పెట్టుకున్న యువరాజును తేలికగానే అరెస్టు చేశారు పోలీసులు.

అతను డిగ్రీకాలేజీలో స్టూడెంటని—రమణి చనిపోవ డంతో భయపడి స్వంత వూరికి వెళ్ళిపోయాడు. పోలీ సులు అతన్ని ఆ వూళ్ళోనే అరెస్టు చేశారు.

పోలీసుస్టేషన్.

యువరాజును థర్డ్ డిగ్రీ మెథడ్స్ ద్వారా నిజం కక్కించడానికి భాగంలో పోలీసులు అతన్ని నగ్నంగా చేసి బాదిస్తున్నారు.

సబ్ ఇన్‌స్పెక్టర్ వచ్చి—"ఇప్పటికయినా నిజం చెప్తావా? లేక...."

"వద్దొద్దు! నిజం చెప్తాను" అన్నాడు భయంతో వణికిపోతూ.

"ఊఁ చెప్పు!"

"నేను రమణిని ప్రేమించాను. పెళ్ళి చేసుకుందామను కున్నాను. కానీ-ఆవిడ అందుకు ఒప్పుకోలేదు. రెండొం దలు రూపాయలు, విస్కీ బాటిల్ తీసుకొని—మీనాక్షి లాడ్జింగ్‌లో రూం బుక్ చేయమన్నది. అలాగే చేశాను. ఆ రాత్రి యిద్దరం బాగా త్రాగాము. నేను బాగా

త్రాగడంవలన ఏమీ చేయలేకపోయాను. తర్వాత నిద్ర పోయాను. తెల్లవారుఝామున మెలుకువ వస్తే—లేచి చూశాను. ఎంత తట్టినా రమణి నిద్ర లేవలేదు. తర్వాత ఆమె చనిపోయిందని తెలుసుకున్నాను. భయం వేసింది. అక్కడుంటే ప్రమాదమని హోటల్ నుంచి బయటపడి మా వూరికి వెళ్ళిపోయాను" అన్నాడు.

"ఒరేయ్, వినేవాడు వెర్రి లంజకొడుకైతే—ఎన్ని హరికథలయినా చెప్పేటట్టున్నావు. హరికథ వినిపిస్తావా! నిజం చెప్పు విధవముండా!" అంటూ మళ్ళీ బాదడం మొదలు పెట్టాడు.

యువరాజును యెంత హింసించినా—అసలు రమణి మరణం యెలా సంభవించిందో ససేమిరా తనకు తెలియదు పొమ్మంటున్నాడు.

అతని వాదనకు లాబొరేటరీ గా పోస్టుమార్టం రిపోర్టు అలాగే వచ్చింది. గొంతు నులిమి గానీ—విషం వల్ల గానీ మరణం సంభవించలేదు. ఇది కేవలం సహజ మరణం అన్నారు డాక్టర్లు.

కేసు అంతటితో వదిలేయకుండా—రమణి రూం మేట్లు రవీణ, ప్రవీణల కొరకు గాలించి—వాళ్ళను అరెస్టు చేసి పోలీస్ స్టేషన్ కు తీసుకొచ్చి—ఇంట్రాగేషన్ మొదలు పెట్టారు.

"మీ పేరు?" అడిగాడు యస్.ఐ.

"నా పేరు రవీణ!"

"నా పేరు ప్రవీణ!"

"మీరిద్దరూ అక్కచెల్లెళ్ళా!"

"అవునండి."

"స్టూడెంట్స్ అయివుండి, వ్యభిచారం చెయ్యడం

సిగ్గుగా లేదూ?"

ఇద్దరూ తలలు వొంచుకున్నారు.

"కారణం చెప్పాలి నాకు!" రెట్టించాడు.

రవీణ ధైర్యం తెచ్చుకొని—"చూడండి యస్.ఐ. గారు! మేమిద్దరం ఒళ్ళు బలిసి వ్యభిచారం చేయడం లేదు. మాది పెద్ద కులం. కానీ—మేము చాలా పేద వాళ్ళం. మా కులాన్ని చూసి ప్రభుత్వం మాకు ఫీజులు తగ్గించడం గానీ, హాస్టళ్ళలో సీట్లు ఇవ్వడంగానీ చేయదు. కానీ—మా యిద్దరికీ చదువుకొని—ఏదో ఒక ఉద్యోగంలో చేరి—కుటుంబాన్ని పోషించాలనే పెద్ద ఆశ ఉంది.

ఆ ఆశయంలో యెంతవరకు కృతకృత్యుల మౌతామో మాకైతే తెలియదు. కానీ, ఇప్పుడు గ్రాడ్యుయేషన్ పూర్తికావాలంటే—మేము ఓ మూడు సంవత్సరాలపాటు మమ్మల్ని మేము పోషించుకుంటూ, ఇంటి అద్దె చెల్లించుకుంటూ ఫీజు పుస్తకాలు కొనుక్కోగలగాలి. ఇవన్నీ కావాలంటే—ఉత్త పుణ్యానికి ఏ మహానుభావుడూ సహాయపడడానికి ముందుకు రాడు.

మొదటిసారిగా టరమ్ ఫీజు డబ్బుకోసం—ఒక ప్రముఖ వ్యాపారస్థుడి కొడుకుతో వ్యభిచారం మొదలు పెట్టాను. అదలా కొనసాగింది. నా తర్వాత నా చెల్లెలు ప్రవీణ కూడా యిదే రంగంలో దిగింది. స్నేహదోషం వల్ల మాతో పాటు ఒకే గదిలో ఉంటున్న రమణి కూడా పేదరికంవల్ల ఇదే వ్యాపారంలో దిగింది!"

"రమణి హత్య వెనుక ఎవరిదయినా హస్తం తప్పక ఉండొచ్చని నా అనుమానం. దీనికి సంబంధించి మీ

లేదైనా క్లూ ఇవ్వగలరా?" అడిగాడు యస్.ఐ.

వాళ్ళిద్దరూ ఆలోచనల్లో మునిగిపోయారు. కానీ వాళ్ళు పనికివచ్చే క్లూలు యేమీ యివ్వలేకపోయారు.

## 4

రమణి మరణం తర్వాత బాగా బాధపడ్డవాళ్ళలో మహేందర్, నరేందర్ ముఖ్యులు.

రమణి చనిపోయిన విషాదాన్ని తట్టుకోలేక వాళ్ళిద్దరూ ఆ రాత్రి త్రాగుతూ కూర్చున్నారు. త్రాగుతూ ఉండగే—వాళ్ళ సంభాషణలో ఎన్నో విషయాలు దొర్లిపోతూ ఉన్నాయి.

స్త్రీ అనుభవం యెలా వుంటుందో తెలుసుకున్నది వాళ్ళు రమణిదగ్గరనే! ఆమె వీళ్ళిద్దరికీ జాయింట్ ప్రియురాలు.

ఒకరోజు మహేందర్ గదికి—

మరొకరోజు నరేందర్ గదికి ఆమె వెళ్ళేది.

వాళ్ళకు అమర సౌఖ్యాలను పంచి యిచ్చి—వాళ్ళకు తోచింది ఇస్తే-తీసుకు వెళ్ళేది.

అటువంటి ప్రియనేస్తం తమను విడిచి వెళ్ళిపోయినందుకు వాళ్ళకు బాధగా వుంది.

పీటర్ స్కాట్ విస్కీ క్రమంగా వాళ్ళ గొంతులో దిగుతోంది.

గొంతులో నుంచి కడుపులోకి వెళ్ళిన అల్కహాల్ తన ప్రభావాన్ని చూపెడుతోంది.

మహేందర్ గొంతు సవరించుకొని—

"గురూ! రమణిది సహజ మరణమే నంటావా?"

"సహజ మరణమేనని డాక్టరు ధృవపరిచాడు!"

"సహజంగా మరణించే వయస్సు కాదు ఆమెది.

ఏదో ఫౌల్ ప్లే వుందని నా కనిపిస్తోంది. మనం ముగ్గురం కలిసి—పోలీసు ఆఫీసరు కూతురు హిమబిందును గత సంవత్సరం ఇదే నెలలో హత్య చేశాం గుర్తుందా? వాళ్ళ తాలూకు యెవరైన మనమీద పగబట్టలేదు కదా?" అన్నాడు భయంగా.

వాళ్ళకు చటుక్కున గత సంవత్సరం జరిగిన సంఘటన గుర్తొచ్చింది.

ఆ రోజు—

తమతో పాటు డిగ్రీ రెండో సంవత్సరం చదువుతున్న మహిజ ముఖ్యమైన స్నేహితులను తన పుట్టినరోజు పండుగకు ఆహ్వానించింది.

మహేందర్ వాళ్ళకు అంబాసిడర్ కారుంది. తండ్రి రాజారావును బ్రతిమిలాడి కారు కావాలని అన్నాడు. రాజారావుగారికి టైర్ రీగ్రూపింగ్ ఫ్యాక్టరీవుంది. ఆయన ఆ ఫ్యాక్టరీ మీద లక్షలు సంపాదించాడు. ఒక్కగా నొక్క కొడుకు మహేందర్ విచ్చలవిడిగా ఖర్చు పెడతాడు. అయినా ఆయన అంతగా పట్టించుకోడు. కొడుకు అడగ్గానే కారు ఇచ్చాడు.

కారులో రమణి నరేందర్‌లతో పాటు మహిజ పుట్టినరోజు ఫంక్షన్‌కు హాజరవ్వడానికి బయలుదేరాడు మహేందర్.

దారిలో వారికి, బస్సు కొరకు ఎదురుచూస్తూ హిమబిందు కనిపించింది.

హిమబిందును చూసి మహేందర్ కారు ఆపి—

"ఎక్కడికి కెళ్తున్నారు?" అని అడిగాడు.

"మహిజ ఇంటికే!" అన్నది.

"మేమూ అక్కడికే బయలుదేరాము. రండి, కారులో

వెళ్దాం!" అంటూ ఆహ్వానించాడు.

"అబ్బే, వద్దండి. మీరు వెళ్ళండి, నేను బస్సులో వచ్చేస్తాను!" అన్నది.

"ఆర్.టి.సి. బస్సులను నమ్మకుం టే—అయినట్లే. కారు వుందిగా—రావే వెళ్దాము!" అంటూ కారులో నే కూర్చొని వున్న రమణి పిలిచింది.

కారులో రమణి కూడా వుండటంతో హిమబిందు వాళ్ళతో రావడానికి ఒప్పుకుంది.

కారు బయలు దేరింది.

ఓ పావు గంట తర్వాత కారు గమ్యాన్ని చేరు కొంది.

అప్పటికే ఫంక్షన్‌కు చాలామంది వచ్చినట్టున్నారు. ఎన్నో కార్లు, స్కూటర్లు యింటిముందు ఓ ప్రక్కగా పార్కు చేసి వున్నాయి.

ఫంక్షన్‌లో అంతా నవయువ్వనంతో అలరారే పడుచు పిల్లలే ఎక్కువగా వున్నారు. అక్కడక్కడ కొంతమంది యువకులు కూడా ఉన్నారు.

మహిజ వాళ్ళ తల్లిదండ్రులు వచ్చాక—"హేపీ బర్త్ డే టూ యూ!" అంటూ బర్త్ డే కోరస్ సాంగ్ పాడి, కేక్ కోసి—మహిజకు తినిపించి—వాళ్ళు లోనికి వెళ్ళి పోయారు.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత—పార్టీలో డిస్కో డ్యాన్సులు, రాక్ లు షేక్ లు మొదలయ్యాయి.

అబ్బాయిలు, అమ్మాయిలను తాకడం డ్యాన్సులు ఇచ్చుకోవడం, గిల్లుకోవడం, కొంతమంది ముద్దులు పెట్టు కోవడం ఇలా—నానా హంగామా చేయడం మొదలు పెట్టారు.

పార్టీలో పాడ్డులు చెప్పడానికి పెద్దవాళ్ళెవ్వరూ లేక పోవడం ఆ వైపరీత్యానికి ఓ కారణం.

బఫే సిస్టమ్‌లో భోజనాలు కూడా వడ్డించబడ్డాయి. త్రాగేవాళ్ళకు డ్రింక్‌లు కూడా సప్లయి చేయబడు తున్నాయి.

ఇక్కడి వ్యవహారమంతా—హిమబిందుకు యేమాత్రం నచ్చడంలేదు. ఆమె త్వరగా అక్కడ నుండి వెళ్ళిపోవ డానికి నిశ్చయించుకుంది.

మహిజ దగ్గరికి వెళ్ళి—

"మహిజా! నా కొంచెం వేరే అర్జంటు పని ఉంది—యేమనుకోకు! నే వెళ్ళిపోతాను!" అన్నది.

"అరే! అప్పుడే వెళ్ళిపోతావా? భోంచేశావా? లేదా?"

"ఓ! భోజనం ఎప్పుడో అయిపోయింది!"

"అలా అయితే వెళ్ళిరా మరి!"

వెళ్ళిపోవడానికి సిద్ధమై—రమణికూడా వస్తున్నట్టు చెప్పింది. తామూ వస్తున్నాము అంటూ రమణి హిమ బిందును ఆపేసింది.

పార్టీలో రమణి ప్రవర్తన అస్సలు నచ్చలేదు హిమ బిందుకు.

ఆమె మగవాళ్ళతో రాసుకుంటూ పూసుకుంటూ తిర గడం, కొంతమంది యువకులు ఆమెను దగ్గరకు లాక్కొని ముద్దు పెట్టుకోవడం కూడా ఆమె గమ నించింది.

"రమణీ! నీ ప్రవర్తన నాకు బొత్తిగా నచ్చలేదు. పెళ్ళికాని పడుచుపిల్ల, మొగవాళ్ళతో-ఇలా గేనా విచ్చల విడిగా ప్రవర్తించడం? నిన్ను చూసి వేరే అమ్మాయిలు

పాడై పోతారు. నీ ప్రవర్తన మార్చుకో. లేకపోతే—
నీతో స్నేహం మానేస్తాను...." అంటూ ఖరాఖండిగా
చెప్పేసింది.

రమణి ఆ మాటలకు బాగా దెబ్బతిన్నది.

ఆమె నోట్లోంచి సమాధానమేమీ రాలేదు.

తల దించుకొని — యేదో ఆలోచిస్తూ — మౌనంగా
ఉండిపోయింది.

కొద్ది సేపటి తర్వాత కారు బయలుదేరింది.

రమణి బలవంతంవల్ల హిమబిందు మళ్ళీ కారులో
కూర్చోనక తప్పలేదు.

మహేందర్ కారు నడుపుతున్నాడు.

కారు వెనకాల నరేందర్ అతని ప్రక్కన రమణి,
రమణి ప్రక్కన హిమబిందు కూర్చున్నారు.

కారు అసలు దారి వదిలేసి మరో దారిలో వెళుతూ
ఉండడం గమనించిన హిమబిందు—"మిస్టర్ మహేందర్!
కారును ఎక్కడికి తీసుకెళుతున్నారు? ఇక్కడ ఆపెయ్.
నేను వెళ్ళిపోగలను" అన్నది గాబరాగా.

ఆమె మాటలను కారులో యెవ్వరూ పట్టించుకో
లేదు.

కారు వెళ్ళిపోతూనే వుంది వేగంగా.

కారులోని మిత్రుల ప్రవర్తన ఆమెకు అనుమానంగా
తోచింది.

హిమబిందు అరవడం మొదలుపెట్టింది.

ఆమె అరుపులు విని దారిన పోయేవాళ్ళు కారువైపు
విచిత్రంగా చూడటం మొదలుపెట్టారు.

వెంటనే హిమబిందును రెక్కలు విరిచి కట్టేసి—
నోట్లో కర్చీఫ్ కుక్కారు.

హిమబిందు మూలుగుతోంది.

కారు వేగంగా ప్రయాణిస్తోంది.

పావుగంట ప్రయాణం తర్వాత కారు ఒక బిల్డింగ్ ముందు ఆగింది.

అది ఒక ప్రయివేటు గెస్టుహౌసు.

హిమబిందును ముగ్గురూ కలిసి అమాంతం ఎత్తుకొని గెస్టుహౌసు లోపలి గదిలోకి తీసుకెళ్ళారు.

తలుపులు వేసేశారు.

కట్లు వూడదీసి, నోట్లో కుక్కిన కర్చీఫ్‌ను తీసి వేశారు.

"రమణీ! ఏమిటీ అన్యాయం? నన్ను ఇక్కడికెందుకు తీసుకొచ్చారు?" ఏడుపు, భయం ఆమె గొంతులో వినిపించాయి.

రమణి క్రూరంగా నవ్వింది.

ఆమెతో పాటు మహేందర్, నరేందర్‌లు గొంతు కలిపారు.

హిమబిందు వాళ్ళవైపు అయోమయంగా చూసింది.

"నన్ను యెందుకు యిక్కడికి తీసుకొచ్చారంటే— అలా పిచ్చివాళ్ళలాగా నవ్వుతారెందుకూ?"

"నీ మదము అణచడానికి తీసుకొచ్చాము. బాయిస్! మీకు దమ్ముంటే—దీని కండకావరం అణచండి! జీవితాంతం గుర్తుండేటట్లు దీనికొక గుణపాఠం నేర్పండి! నాకే నీతులు బోధిస్తుందా యిది!" అంటూ క్రూరంగా నవ్వి—హిమబిందు కట్టుకున్న పంజాబీ డ్రస్‌ను చించేసింది కసిగా రమణి.

"రమణీ నువ్వుండు! ఆ కార్యక్రమ మేదో మేము చూసుకుంటాం!" అంటూ వాళ్ళిద్దరూ రాక్షసుల్లా మీద

పడి ఆమెను వివస్త్రను చేసేశారు.

హిమబిందు చేస్తున్న అరుపులు ఆ నిర్మానుష్య గెస్టు హౌస్‌లో అరణ్యరోదనే అయింది.

ఆమె లెక్కలేనన్నిసార్లు మానభంగం చేయబడింది. ఆమె శరీరాన్ని కొరికి అమానుషంగా గాయాలు చేశారు.

వాళ్ళిద్దరూ హిమబిందుపై అమానుషంగా అత్యాచారం చేస్తుంటే—రమణి ఆసాంత వినోదంగా చూస్తూ కూర్చుంది.

హిమబిందు విపరీతమైన బాధను తాళలేక స్పృహ కోల్పోయింది.

"పిల్ల నాన్న పోలీసాఫీసరు! దీన్ని ఇలాగే వొదిలేస్తే—మనం జైలుపాలు అవుతాము!" అంది రమణి.

"అయితే యేం చేద్దామంటావు?" ఇద్దరూ అన్నారు ఏక కంఠంతో.

"ఏమీలేదు! శాల్తీ లేపేసి—డిక్కీలో వేసేసుకోవాలి. ఊరు బయట పెద్ద చెరువు వుంది. దాన్నిండా నీళ్లున్నాయి. దీని మెడకొక బండరాయి కట్టి, చెరువులో వేసేస్తే—పీడా విరగడై పోతుంది" అన్నది.

"ఎలాగు శాల్తీ లేపేస్తున్నాం కాబట్టి మరి కాస్సేపు ఆనందిస్తే తప్పేంటి?" అన్నాడు నరేందర్.

"మీ యిష్టమొచ్చినంత సేపు ఎంజాయ్ చెయ్యండి! ఈ వ్యవహారంలో అది చచ్చినా అభ్యంతరం లేదు. పైగా ఇంకెంతో మేలు చేసిన వారౌతారు!" అన్నది.

రమణి ఆ మాట అనడంతో వాళ్ళు నిజంగా రాక్షసులే అయ్యారు.

ఆమె శరీరంతో యిష్టమొచ్చినంత సేపు క్రూరంగా

ఆడుకున్నారు.

దాదాపు రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో హిమబిందు ప్రాణాలు అనంత ఆకాశంలో లీన మయ్యాయి.

మహేందర్ గాబరా పడిపోతూ "హిమబిందు చని పోయింది. శవాన్ని యేం చేద్దాం?" అన్నాడు.

"చెప్పాగా వూరు బయట చెరువులో వేద్దామని, ఊc పదండి, శవాన్ని ఎత్తుకెళ్ళి కారు డిక్కీలో వేసే ద్దాం!" కర్తవ్యం బోధించింది రమణి.

నగ్నంగా వున్న హిమబిందు కోమలమైన శరీరంనిండా గాయాలే! ఆ గాయాల నుండి రక్తం స్రవించడం ఆగి పోయి—క్రమంగా రిగర్ మార్టిస్ ప్రారంభమైంది.

శవాన్ని పడకమీద వున్న బెడ్‌షీట్‌తో చుట్టి—ఎత్తుకెళ్ళి డిక్కీలో వేసేశారు.

ముగ్గురూ కారులో కూర్చున్నారు.

కారు బయలుదేరింది. మధ్యలో పోలీసులు కారాపితే—తాము జైలు చువ్వలు లెక్కపెట్టక తప్పదు. అని భయపడుతూనే—కారును శరవేగంగా నడుపుతున్నాడు మహేందర్.

పావుగంటలో కారు ఊరు బయట వున్న చెరువు సమీపానికొచ్చింది.

శవానికి ఒక బండరాయి కట్టి—చెరువులో పడ వేశారు.

శవం నీళ్ళలో మునిగిపోయింది.

"హమ్మయ్య!" అని వూపిరి పీల్చుకొని కారులో తిరుగుముఖం పట్టారు.

హిమబిందు తండ్రి శివాజీరావు కూతురు కనిపించడం

లేదని పోలీసు రిపోర్టు ఇచ్చాడు.

రెండు రోజుల తర్వాత హిమబిందు శవం నీళ్ళలో నుంచి బయటికొచ్చి—పోలీసుల దృష్టికి వచ్చింది. బహుశా బండరాయి జారిపోయి వుంటుంది.

పోలీసు సబ్ ఇన్ స్పెక్టర్ పద్మాకర్ తన బలగంతో చెరువుకట్టను సందర్శించాడు. కొంతమంది కూలీల సహాయంతో నీళ్ళలో వున్న శవాన్ని ఒడ్డుకి తెచ్చారు.

సందేహంలేదు. అది హిమబిందు శవమేనని పోలీసులు గుర్తించారు. శవం పూర్తి నగ్నంగా వుంది.

ఆమె చనిపోయి కనీసం రెండురోజులు అయినా అయ్యుంటుందని పోలీసులు అంచనా వేశారు. అప్పటికే శవం కుళ్ళిపోతోంది. కొన్ని పళ్ళు రాలిపోయివున్నాయి. నిర్దాక్షిణ్యంగా ఆమెను కొట్టడం, రక్కడం, కొరకడం వలన కోమలమైన ఆమె శరీరానికి గాయాలైనట్లు పోలీసులు రాసుకున్నారు.

పోలీసులు శవపంచనామా జరిపి — పోస్టుమార్టం నిమిత్తం హెడ్ క్వార్టర్స్ హాస్పిటల్ కు పంపించారు.

కేసు రిజిష్టరు చేసి—ఇన్వెస్టిగేషన్ మొదలుపెట్టాడు సబ్ ఇన్ స్పెక్టర్.

ఇప్పటివరకూ తమ గురించి పోలీసుల కెలాంటి సమాచారం అందలేదు. హత్య పకడ్బందీగా జరిగినందుకు వాళ్ళకు సంతోషంగా వుంది.

పాత సబ్ ఇన్ స్పెక్టర్ పద్మాకర్ బదిలీ అయి వెళ్ళిపోయాడు. ఇప్పుడు క్రొత్తగా జనార్ధన్ వచ్చాడు. అతనికి బహుశా ఈ కేసు విషయం కూడా తెలియకపోవచ్చు.

కానీ—రమణి హత్య జరగడంతో తమకు భయాం

దోశనలు మొదలయ్యాయి.

అలా గతమంతా వాళ్ళ కళ్ళముందు మెదిలింది.

బాటిల్ చూస్తే మందు అయిపోయింది.

మరో బాటిల్ ఓపన్ చేశారు.

త్రాగుతున్నారు అన్నమాటే గానీ—వాళ్ళకు నిషా ఎక్కినట్లు అనిపించడంలేదు.

హత్య చేసినవాడి మానసిక స్థితి ఎంత భయంకరంగా వుంటుందో! అంతకన్నా చావు నయం.

మహేందర్ అదే అన్నాడు నరేందర్‌తో.

"ఛ! ఏం మాటల్రా అవి! తథాస్తు దేవతలంటారు, అలా అనకూడదు!" అన్నాడు — మందలిస్తున్నట్టు నరేందర్.

మందు ఎక్కువై పోయి—ఒళ్ళు తెలియకుండా అదే గదిలో వాళ్ళు ఆ సీసాల మధ్య అలాగే పడి నిద్ర పోయారు.

భళ్ళున తెల్లవారింది.

నరేందర్ మెలకువ వస్తే లేచి కూర్చొని—కళ్ళు నులుముకున్నాడు.

ఉదయం ఎనిమిది గంటలు.

నిద్ర పోతున్న మహేందర్‌ను తట్టి లేపాడు నరేందర్.

ఉలుకూ లేదు, పలుకూ లేదు.

గట్టిగా తట్టాడు.

బోర్లాపడుకొని నిద్రపోతున్న మహేందర్ వెల్లకిలా పడ్డాడు.

నోట్లోంచి బారెడు నాలుక బయటికొచ్చి—యేదో భయంకర దృశ్యాన్ని చూసినవాడిలా — కనుగ్రుడ్లు

బయటికొచ్చి—భయంకరంగా చచ్చి పడివున్నాడు.

అతని ఆకారాన్ని చూసి—నరేందర్ కెవ్వున కేక వేసి—అంతలోనే తేరుకున్నాడు.

తను యిక్కడుంటే—ప్రమాదమని గ్రహించి—వెంటనే ఆ హోటల్ గదిలో నుంచి దొంగలా బయట పడ్డాడు.

మధ్యాహ్నం తర్వాత వెయిటర్ ద్వారా హోటల్ ప్రొప్రయిటరుకు విషయం తెలిసి—వెంటనే పోలీసులకు ఫోన్ చేశాడు.

పోలీసులు ఉరుకులు పరుగులమీద వచ్చారు.

"ఏమిటయ్యా ప్రొప్రయిటరు! నీ హోటల్లో ఈ మధ్య అన్నీ శవాలే బయటికొస్తున్నాయి! శవపూజ ఏదైనా చేస్తున్నావేంటి!" అంటూ జోకేశాడు ఎొను యస్ ఐ.

"అంతా నా దురదృష్టం!" అంటూ నెత్తి నోరు బాదుకొన్నాడు హోటల్ యజమాని.

పోలీసులు శవపంచనామా జరిపి శవాన్ని పోస్టుమార్టం నిమిత్తం హాస్పిటలుకు పంపించారు.

విజిటర్స్ అరైవల్ రిజిష్టర్లో మహేందర్ అనే వుంది.

విషయాన్ని వెంటనే మహేందర్ తల్లిదండ్రులకు ఫోన్ చేసి చెప్పారు.

ఒక్కగానొక్క కొడుకు మరణవార్త విని—వాళ్ళు హాస్పిటల్కు పరుగెత్తారు.

## 5

రెండు రోజుల తర్వాత డాక్టర్లు పోస్టుమార్టం రిపోర్టు ఇచ్చారు.

మహేందర్‌ది హత్యకాదు. చాలా నేచురల్ డెత్ అని రిపోర్టు సారాంశం.

నరేందర్ ఆశ్చర్యానికి అంతులేదు. రమణిది నేచురల్ డెత్, మహేందర్‌దీ నేచురల్ డెత్ అని రిపోర్టులు వచ్చాయి. ఇదెలా సాధ్యం. రిపోర్టుల్లో తప్పు యేదైనా జరుగుతుందా? లేక నిజంగానే అవి నేచురల్ డెత్స్?

ఒకవేళ నేచురల్ డెత్స్ కాకపోతే—తన చావు కూడా ఖాయమన్నమాట.

తను మృత్యువు బారినుండి తప్పించుకోవాలి.

ఎలా?

అతను తన గదిలో కూర్చొని ఆలోచిస్తున్నాడు.

సిగరెట్లు ఖర్చు అయిపోతున్నాయి.

రాత్రి ఏడుగంటలు అయింది.

అతను ఆలోచనలో వుండగానే తలుపుతట్టిన శబ్దమైంది—

ఆలోచనల్లోంచి తేరుకొని వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా ప్రీతి!

ఆమె తన కాలేజీ మెట్.

మోరల్ వ్యాల్యూస్ అంటే లెక్కలేదు.

మగవాళ్ళతో విచ్చలవిడిగా తిరుగుతుంది.

ఆమెను చూడగానే నరేందర్ కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"రండి....రండి...." అంటూ ఆహ్వానించాడు.

ఆమె లోనికి అడుగుపెట్టింది.

"కూర్చోండి!" అంటూ కుర్చీ చూపెట్టాడు.

ఆమె అక్కడే వున్న పడక కుర్చీలో అలసటగా వాలిపోయింది.

"ఏమిటీ ఇంత రాత్రప్పుడు వచ్చారు! ఏదైనా పనా?"

"ఊహుఁ పనేంలేదు. వూర్కే వచ్చాను."

"ఏమిటీ అలా డీలాగా వున్నారు. ఇంతకు భోం చేశారా లేదా?"

"భోజనం చెయ్యలేదు. మందు ఏమైనా వుందా?"

"మందా? లేదండి! కావాలా?"

"ఊఁ కాస్త మందుపడితే గానీ—హుషారు రాదు!"

ప్రీతి ఇలా స్టూడెంట్స్ గదులను సడన్‌గా విజిట్ చేసి - మందు కావాలి అంటుందని విన్నాడు. కానీ - తన గదికి ఇలా రావడం ఇదే మొదటిసారి.

"మీరు కూర్చోండి! ఇప్పుడే పట్టుకొస్తాను" అంటూ గబగబా బట్టలు వేసుకొన్నాడు.

జేబులో అయిదొందలున్నాయి. నిన్ననే యం.వో. వచ్చింది ఇంటినుంచి.

సమీపంలో వున్న ఒక వైన్ షాపునుండి త్రిబుల్ ఎక్స్ రమ్ ఫుల్ బాటిల్, ప్రక్క హోటల్‌నుండి చాలి నంత చికెన్ ఫ్రై, భోజనం పార్సిల్ కట్టించుకొని రూముకు తిరిగొచ్చాడు.

అతనొచ్చేసరికి ప్రీతి సిగరెట్ తాగుతూ కూర్చుంది.

"మీరు సిగరెట్లు త్రాగరని విన్నాను."

"మీరు విన్నది నిజమే! ఇవేళ ఎందుకో త్రాగాలని పించింది."

"ఇట్సాల్‌రైట్! లెట్ అజ్ హేవ్ డ్రింక్స్! రండి!" అంటూ ఆహ్వానించాడు.

గ్లాసులు, వాటర్, చికెన్, భోజనం టీపాయిమీద సర్ది కూచున్నాడు.

రమ్ రెండు గ్లాసుల్లో పోసి - "ఛీర్స్!" చెప్పుకొని త్రాగడం మొదలుపెట్టారు.

"మగవాళ్ళలా త్రాగుతున్నందుకు మీకు నామీద చులకన భావం ఏమైనా వుందా?"

"నో నో అలాంటిదేమీ లేదు. ఉమెన్స్‌లిబ్‌ను కోరు కునే వాళ్ళలో నేను ఒకడిని. రమణికి నాకూ వున్న ఫ్రెండ్‌షిప్ బహుశా మీకు తెలుసనుకుంటాను. మేము చాలా ఫ్రీగా వుండేవాళ్ళం. ఆవిడ మీకులాగే త్రాగేది. కానీ - నాకెప్పుడూ ఆమెమీద చులకన భావంలేదు."

"అఁ తెలుసనుకోండి! అఁ అన్నట్టు రమణి పోయిం దటగా! పాపం చాలా చిన్న వయస్సులో పోయింది. అసలేం జరిగింది!"

"అదే నాకూ, అర్థం కావడంలేదు. యువరాజు అనే ఒక కుర్రాడు వున్నాడు. పాపం అతను చాలా అమాయకుడు. అతనికి రమణితో స్నేహం చేయాలనే బుద్ధి ఎందుకు పుట్టిందో అర్థంకాదు. అతనేదో చేశా డంటే - నేను నమ్మను. కాని - నేచురల్ డెత్ అంటే మళ్ళీ నాకు అనుమానంగానే వుంది. ఇందులో మూడో వాడి హస్తం వుందని నా అనుమానం!"

"మూడోవాడా? వాడెవడు?"

"అదేకదా, అర్థంకాక చస్తోంది!"

"పోలీసులు ఇన్వెస్టిగేట్ చేస్తున్నారు కదా, ఏమైనా క్లూలు లభించాయా?"

"వాళ్ళకేమీ అర్థంకావడంలేదు. నేచురల్ డెత్ అని గవర్నమెంట్ డాక్టర్ ఫోరెన్సిక్ ఎక్స్‌పర్టు సర్టిఫికెట్లు జారీచెయ్యగానే వాళ్ళు ఫైలు క్లోజ్ చేసేసి- మిగిలిన చర్యను మానుకుంటున్నారు."

"పోనీ ఆ మూడో వాడి గురించి - మీ రెండుకు కృషి చెయ్యరు!"

"నిజం చెప్పాలంటే - నాకూ ప్రాణభయం పట్టుకుంది!"

"ప్రాణభయమా? మీకెందుకు!"

"మేము ముగ్గురం మిత్రులం, నేచురల్ డెత్స్ అంటూ అరంభాని కారణాల వలన, ఇద్దరు పొయ్యారు. ఇక మిగిలిన వాడిని నేనే కదా! అందుకు భయం!"

"అయితే మీరూ పోతారన్నమాట!" నవ్వుతూ అంది.

"పోవాలని మీరు కోరుకొంటున్నారా!"

"లేదు! పోతారేమోనని బాధగా వుంది!" మళ్ళీ సీరియస్ గా అంది.

"అంత తేలిగ్గా ఏమీ చావనులెండి! చాలా గట్టి పిండాన్నని మా నాయనమ్మ చెబుతూ వుండేది."

"పోనీయండి, వెధవ టాపిక్! ఇంకేదైనా మాట్లాడండి!"

"ఏం మాట్లాడమంటారు!"

"సెక్స్ గురించి మాట్లాడండి!"

"సెక్స్ గురించి, మీకన్నా నాకేమీ బాగా తెలియదు. మీరే చెప్పాలి!"

"ఇది మరీ బావుంది. నాకేం తెలుసండి! మీబోటి రసికులు చెప్తుంటే విందామని ఉబలాట పడ్డాను. పైగా మీకు ఇంట్రస్టుగా వుంటుంది. వాతావరణంకూడా చల్లబడుతుంది అని అడిగాను!" అంటూ నవ్వేసింది.

నిజంగానే వాతావరణం చల్లబడింది.

అతనికి చావు భయం తొలగి ఫ్రీగా బిహేవ్

చేస్తున్నాడు.

"నేనొకమాట చెప్పనా!"

"ఊఁ చెప్పండి!"

"సెక్స్ గురించి థియరీ చెప్పడమెందుకు మీరు న్నారుగా. ప్రాక్టికల్స్ మొదలు పెడదాం ఏమంటారు!"

"అబ్బో ఎంత తొందర!"

"మీ ఇష్టం, ఈ స్థితిలో థియరీ చెప్పడం అస్సలు కుదరదు!"

"కుదరదా! సరే కుదరదంటున్నారు కాబట్టి ఊఁ" అంటూ అతనిమీద వాలిపోయింది ప్రీతి.

# 6

ఉదయం ఏడుగంటలు.

నగ్నంగా - స్పృహ తప్పినట్లు నిద్రపోతున్న ప్రీతికి చటుక్కున మెలకువ వచ్చింది. తన అవతారాన్ని చూసుకొని ఆమెకు సిగ్గేసింది.

గబగబా లేచి డ్రెస్ చేసుకొని - ఇంకా నిద్ర పోతున్న నరేందర్‌ను లేపింది.

అతని శరీరం చల్లగా తాకింది.

ప్రీతికి భయంతో గుండె వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టింది.

భయంగా అతని ముక్కు దగ్గర వ్రేలు పెట్టి చూసింది.

ఊహుఁ శ్వాస ఆడటంలేదు.

అతను మరణించాడు.

ఆ విషయం ఆమెకు అర్థంకాగానే - అక్కడుండటం ఎంత ప్రమాదమో - ఆమెకు అర్థమై మరుక్షణం అక్కడి

నుండి పలాయనం చిత్తగించింది.

నరేందర్ గది మరీ సందుల్లో వుంది. విషయం పోలీసులకు తెలియడానికి చాలా సమయం తీసుకోవచ్చు.

ఆ ఆలోచన రాగానే - దారిలో కనిపించిన ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లో దూరి ట్రిబుల్ జీరోకు రింగ్ చేసి - నరేందర్ చావు విషయం పోలీసులకు తెలియజేసి—ప్రీతి తన దారిన తను వెళ్ళిపోయింది.

ఫోన్ కాల్ అందుకొన్న పోలీసులు తక్షణం నరేందర్ గదిని విజిట్ చేశారు.

ఫోన్ కాల్ నిజమైందనే నిర్ధారణకొచ్చారు.

శవ పంచనామా జరిపి - శవాన్ని పోస్టుమార్టం నిమిత్తం హాస్పిటల్‌కు తరలించారు.

రెండు రోజుల తర్వాత - డాక్టర్ గారు యథాప్రకారంగా నేచురల్ డెత్ అని సర్టిఫికేట్ ఇచ్చారు.

ఈసారి పోలీసులకు డాక్టర్ గారి మీదనే అనుమానమొచ్చి - హైద్రాబాదు ఉస్మానియా జనరల్ హాస్పిటల్ నుంచి స్పెషలిస్టు కొరకు రిక్విజిషన్ ఇచ్చి-ఆయనతో జరిపించారు.

శవానికి మళ్ళీ పోస్టుమార్టం జరిగింది. ఆయనకూడా నేచురల్ డెత్ అని సర్టిఫికేట్ ఇచ్చారు.

శవం కడుపులో వున్న కంటెంట్స్ - అన్నం, నీరు, విస్కీ, చికెన్ వగైరాలను ఫోరెన్సిక్ సైన్సు లాబొరేటరీకే పంపించారు. వాళ్ళు పరిశోధన జరిపి అందులో ఎటువంటి విషపదార్థం లేదని సెలవిచ్చారు.

పోలీసులు చేసేది లేక యాక్షన్ ఎబేటెడ్ అని వ్రాసుకొని కేసును ముగించారు.

# 7

రేడియోలో ఢిల్లీనుండి ప్రసారమయ్యే తెలుగువార్తలు వస్తున్నాయి.

సబ్ ఇన్‌స్పెక్టర్ జనార్ధన్ వార్తలు వింటూ గెడ్డం గీక్కుంటున్నాడు.

ట్రింగ్ ....ట్రింగ్ .... బెల్ మ్రోగింది.

నౌకరు వెళ్ళి తలుపు తెరిచాడు.

ఒక అందమైన అమ్మాయి లోనికి ప్రవేశించింది.

"రండి! కూర్చోండి!" అంటూ ఆహ్వానించాడు.

ఆమెను అతనెప్పుడూ చూడలేదు.

ఏదైనా పిటీషన్ ఇవ్వడానికి పోలీసు స్టేషన్‌కు వచ్చేవాళ్ళు తను అక్కడ లేకపోతే - స్టేషన్ ఆవరణ లోనే వున్న తన క్వార్టర్స్‌కు వచ్చి - బాధలు చెప్పుకోవడం కద్దు.

అలాంటి వాళ్ళలో ఆమె ఒకరు అనుకున్నాడు.

"చెప్పండి! వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ!" అన్నాడు - బ్రష్ నీళ్ళలో కడుగుతూ.

"గత రెండు వారాలనుంచి ఊళ్ళో కొన్ని నేచరల్ డెత్స్ జరిగాయి గుర్తుందా?"

జనార్ధన్ అలర్ట్ అయిపోయాడు.

"యస్....యస్.... నేనే ఇన్వెస్టిగేషన్ ఆఫీసరును. దాని గురించి ఏదైనా చెప్పదల్చుకున్నారా?"

"ఔను!"

"చెప్పండి! ఇన్ ఫాక్టు, ఫైల్స్ క్లోజు అయిపోయాయి. అయినా రీ-ఓపెన్ చేస్తాను. కమాన్ చెప్పండి!" అన్నాడు.

ఆ యువతి చెప్పడానికన్నట్టు గొంతు సవరించు

ఉంది.

"అవి నేచురల్ డెత్స్ కావు. ఆ హత్యలన్నింటికి కారణం నేనే!" అన్నది.

జనార్ధన్‌కు షాక్ తగిలినట్లు అయింది.

"హత్యలన్నింటికి నువ్వా కారణం! సరెండర్ అయి పోవడానికి వచ్చావా?"

"కాదు, నిజం చెప్పి నా దారిన నేను వెళ్ళిపోవ డానికి వచ్చాను."

"నా చేతిలో చిక్కిన తర్వాత నువ్వెక్కడికి వెళ్ళ లేవు. సరే ఆ హత్యలు ఎలా చేశావు? ఎందుకు చేశావు? చెప్పు" అతని స్వరం కఠినంగా మారింది.

ఆమె చెప్పసాగింది.

"నా పేరు హిమబిందు."

"ఏమిటీ హిమబిందా.... ఈ పేరు ఎక్కడో విన్నానే! ఎక్కడ... ఎక్కడ.... ఎక్కడ....?"

"ఎక్కడో వినేవుంటారండి! బహుశా మీకు తర్వాత గుర్తుకు రావొచ్చు! పద్మాకర్‌గారికైతే తేలి కగా గుర్తుకొచ్చేది. నా కేసును ఆయనే డీల్ చేశారు."

"మీ కేసా? అదేమిటి?"

"చెప్తాను. మహేందర్, నరేందర్ అనే నరరూప రాక్షసులు.... రమణి అనే రాక్షసి సహాయంతో హిమ బిందు అనే అమ్మాయిని అమానుషంగా రేప్ చేసి—ఆ తర్వాత మర్డర్ చేసి — చట్టం దృష్టిలో పడకుండా, తప్పించుకొని తిరుగుతున్నారు.

"హిమబిందు అనే అమ్మాయినా! యస్.... యస్.... ఆ కేసును నేను చదివాను. అది అన్ డిటెక్టెడ్ కేసుల జాబితాలో చేర్చారు. ఆమెను రేప్ అండ్ మర్డర్

చేసింది వాళ్ళేనా? అయితే తగిన శాస్తే జరిగింది. ఆ హిమబిందు మీ కేమౌతుంది. మీ ఇద్దరి పేర్లుకూడా ఒకటేనా! వాళ్ళను చంపాల్సిన అవసరం నీకెందు కొచ్చింది!"

"ఔను మా యిద్దరి పేర్లు ఒక్కటే....ఆమె నా కజిన్, నా ప్రాణస్నేహితురాలు. అందుకే వాళ్ళమీద పగబట్టి తేలికగా ఈ హత్యలు చేశాను!"

"ఏది ఏమైనా మీరు చట్టాన్ని చేతుల్లోకి తీసు కున్నారు. అది నేరం కాబట్టి మిమ్మల్ని అరెస్టుచెయ్యక తప్పదు. యూ వార్ అండర్ అరెస్టు!" అంటూ ఆమె చేతులను తాడుతో బంధించి - పోలీసు స్టేషన్‌కు తీసు కొచ్చి - లాకప్‌లో వేసేసి - తాళం వేసేసి - తాళం చేతులు సెంట్రికి ఇచ్చి - తిరిగి ఇంటికొచ్చాడు.

స్నానం వగైరా కార్యక్రమాలు ముగించుకొని— పోలీసుస్టేషన్‌కొచ్చి - ఆతృతగా హిమబిందు రేప్ అండ్ మర్డర్ కేసు ఫైలు తిరగేసి చదవడం మొదలుపెట్టాడు.

ఆ ఫైలులో జతచేసి వున్న ఫోటోలను చూసిన జనార్థన్ ఆశ్చర్యానికి అంతులేదు. ఇప్పుడు లాకప్‌లో వున్న అమ్మాయికి ఆ ఫోటోలకు యేమాత్రం తేడాలేదు.

చనిపోయిన వాళ్ళు తిరిగిరావడం ఎలా సాధ్యం?

జనార్థన్ ఆశ్చర్యం నుండి తేరుకొని లేచి వచ్చి లాకప్‌లోకి తొంగి చూశాడు.

ఆ అమ్మాయి లాకప్‌లో లేదు.

వేసిన తాళం వేసినట్లుగానే వుంది.

జనార్థన్ సెంట్రిని కేకేశాడు.

"అమ్మాయి కనిపించడంలేదు. ఎటో పారిపోయింది. లాకప్ తెరువు!" అంటూ అరిచాడు.

సెంట్రీలాకప్ తెరిచాడు.

ఇద్దరూ లోనికి వెళ్ళి చుట్టూ చూశారు.

రూఫ్ కేమైనా వ్రేలాడుతుందేమోనని పైకి చూశారు. వెంటిలేటర్ చువ్వలేమైనా విరిగి వున్నాయేమోనని అటు చూశారు.

ఊహుఁ! అన్నీ సరిగ్గానే వున్నాయి. కానీ అమ్మాయి మాత్రం కనిపించడంలేదు.

అసలు చనిపోయిన అమ్మాయి బ్రతికి రావడమేమిటి? ఇలా వింతగా తప్పించుకోవడమేమిటి?

జనార్దన్ కు ప్రొద్దుటినుంచి జరిగిన సంఘటనలన్నీ గుర్తొచ్చి - ఒక గంటవరకు తేరుకోలేకపోయాడు.

ప్రొద్దున తనింటికి వచ్చిన అందమైన అమ్మాయి, తను అరెస్టుచేసి లాకప్ లో వేసిన అమ్మాయి..ఆ అమ్మాయి.. ఆ అమ్మాయి.... మై గాడ్ దయ్యం. యస్! ఆ అమ్మాయి దయ్యమే!

అయితే దయ్యాలు వున్నాయి అనేమాట నిజమేనన్న మాట. ఏమిటో? ఇలా జరిగిందీ అని పై ఆఫీసర్లకు చెప్పినా నమ్మరు. పైగా పిచ్చివాడిక్రింద ట్రీట్ చేస్తారు.

కేసు ఫైలు ముందేసుకొని ఆలోచనలో పడిపోయాడు జనార్దన్.

—:అయిపోయింది:—

# అన్వేషణ?

## బొమ్మిడి అచ్చారావు

"అసలు నీకీ పాడు బుద్ధెలా పుట్టింది?" అడిగాడు నిరంజన్, విక్టర్‌ని.

"ఇది పాడు బుద్ధి కాదు బ్రదర్, బ్రహ్మాండమైన ఆలోచన. మీరిద్దరు సిద్ధంగా వున్నారా? రేపే బయల్దేరుదాం!" అన్నాడు విక్టర్.

"రేపేనా? అదెలా వీలవుతుంది? ప్రయాణానికి యేర్పాట్లు చేసుకోవాలి కదా!" అన్నాడు రాజు.

"ఏర్పాట్లా? ఇంట్లో జాగ్రత్తగా చెప్పి బయల్దేరుదామనుకొంటున్నారా? ఆఫీసు పనిమీద బొంబే వెళ్తున్నామని చెప్పేసి వచ్చెయ్యాలి!" అన్నాడు నిరంజన్.

"నీకేం, నువ్వలాగే చెపుతావు. బాధ్యతలు బరువులు లేనివాడివి. ఎక్కడికయినా వెళ్ళగలవు. ఏమైనా చెయ్యగలవు. బ్రహ్మచారివి."

నిరంజన్ నవ్వేసి, "బ్రహ్మచారిని కాదు బ్రదర్, పెళ్ళి కాలేదంతే! బాదరబందీ లుండకూడదని నేనే

ఎవాయిడ్ చేశాను పెళ్ళి! అవసరాలు తీరిపోతున్నాయి"
అన్నాడు.

విక్టర్ కల్పించుకుని, "రాజూ, నాకూ పెళ్ళయింది. అయితే నా పెళ్ళాం పిల్లలు, నా ఇల్లు అనుకుని ఎటాచ్ మెంట్సు పెట్టుకుంటే మనం యెన్నటికీ పైకి రాలేం. మన కిది ఓ సువర్ణావకాశం. నిజంగా బంగారం కోసమే కదా మన ప్రయాణం. మనం కోటీశ్వరుల మయ్యాక మన భార్యల్ని బంగారంతో ముంచెత్తవచ్చు" చెప్పాడు.

రాజు ఆలోచనలో పడ్డాడు. అతని మనసు అటు యిటు వూగిసలాడే పడవలా వున్నది.

విక్టర్ ప్రతిపాదన చాలా ఆకర్షణీయంగా వుంది అత డిదివరలో నేవీలో పనిచేశాడు. తర్వాత కాంట్రాక్టు ముగించుకుని సివిల్ సర్వీస్‌లోకి వచ్చేశాడు. తనతో బాటు బ్యాంక్‌లో క్యాషియర్‌గా చేరాడు.

నిరంజన్ ఓ ప్రయివేట్ కంపెనీలో స్టెనోగా పని చేస్తున్నాడు. ముగ్గురు మంచి స్నేహితులు.

క్రితంరోజు పేపర్లో పడిన ఓ వార్తను విక్టర్, రాజు దృష్టికి తెచ్చాడు. అందులో బంగాళాఖాతంలో పది హేనురోజుల క్రితం కూలిపోయిన జంబోజెట్ విమాన శిథిలాల గురించిన ఆసక్తికరమైన వార్తను ప్రచురించారు.

శిధిలాలకోసం గాలిస్తున్న సిబ్బందికి బంగారంతో వున్న ఓ పెట్టె దొరికింది. ఆ పెట్టె చాలా పురాతన మైనది. శిధిలావస్థలో వుంది. బహుశా ఎప్పుడో యేదో నావలో ఆ బంగారం రవాణా చేయబడుతూ వుండివుండ వచ్చుని, ఆ నావ నీటిలో మునిగిపోయినపుడో లేక సముద్ర దొంగలు తాము దొంగిలించిన బంగారం అక్ర

ముంగా రవాణా చేసే సమయంలోనో ఆ పెట్టె సముద్రం పాలయిపోయి వుండొచ్చునని అధికారులు ఊహిస్తు న్నట్టుగా ఆ వార్త సారాంశం!

ఆ వార్తను ప్రత్యేకంగా తనకెందుకు విక్టర్ చూపించాడో వెంటనే రాజు కర్థం కాలేదు. రాజును బయటకు తీసుకుపోయి విక్టర్ ఆ బంగారం గురించిన వివరాలు చెప్పాడు.

తాను నేవీలో పని చేస్తుండగా ఓసారి బొంబాయికి అరేబియన్ దేశాల నుంచి వస్తూన్న ఓ నావ తుఫాన్‌లో చిక్కుకుపోయి పగిలిపోయిందనీ, ఆ నావలో అక్రమంగా బంగారం రవాణా జరుగుతున్నట్టుగా తమకు సమాచారం అందిందనీ; తాము సబ్‌మెరైన్స్‌తో సముద్రంలో గాలించామనీ, శిధిలమైన నావ చెక్కలు, ముక్కలు తప్ప బంగారం తమకు కనిపించలేదనీ, అంతటితో గాలింపు చర్యలు ఆపివేశామనీ చెప్పాడు.

"అయితే ఆ నావ మునకకీ, యీ వార్తకీ యేమిటి సంబంధం?" అనడిగాడు తను.

అందుకు విక్టర్ మందహాసం చేసి, "ఆ నావలో ఆ రోజు అక్రమ రవాణా అయిన బంగారంలో కొంత భాగం యీ విమాన శిధిలాల అన్వేషణలో దొరికింది. మొత్తం ఎనిమిది పెట్టెల్లో బంగారం బొంబాయికి వస్తూన్నదని మాకు రిపోర్టు అందింది. ఇప్పుడు ఓ పెట్టె మాత్రం దొరికింది. తక్కిన ఏడు పెట్టెలు ఖచ్చితంగా సముద్ర గర్భంలోనే సురక్షితంగా వున్నాయి...." అన్నాడు.

"అంత ఖచ్చితంగా యెలా చెప్పగలవు? దరిమిలా అవి యెవరికయినా దొరికాయేమో....!" అనడిగాడు

తను.

విక్టర్ తల విదిల్చి, "ఉహుఁ! అందు కవకాశంలేదు. నేను రెండేళ్ళ క్రితంవరకూ నేవీలోనే వున్నాను కదా! నేవీ నుంచి వచ్చిన తరువాత కూడా నేవీలో వున్న మా స్నేహితులతో టచ్‌లో ఉన్నాను. తరచు ఉత్తరాలు వస్తూంటాయి. బంగారం విషయం తెలిస్తే నాకు వెంటనే తెలియపర్చమని నా ఫ్రెండుతో మరీ మరీ చెప్పివచ్చాను. కాని యింతదాకా ఆ విషయం తెలియలేదని మా వాడు రాస్తూన్నాడు" అన్నాడు.

"అయితే నీతోబాటు మరికొందరికి కూడా ఆ గోల్డు బాక్సులను గురించి తెలుసన్న మాట!"

"తెలుసు. అయితే అందరూ మా ఫ్రెండ్స్ సర్కిల్లో వాళ్ళే! మొత్తం నలుగురు. మనం ముగ్గురం. కలసి ఏడు గురం. ఎనిమిది బాక్సులకి ఓ బాక్స్ యెలాగో ప్రభుత్వం వశమైపోయింది. ఏడుగురికీ ఏడు బాక్సులు దక్కుతాయి. ఆ పెట్టెలోని బంగారం విలువ ఏభై రెండు లక్షల రూపాయి లుంటుందని లెక్క కట్టారు. అంటే మూడు న్నర కోట్లకు పైగా విలువగల బంగారం, కొద్దిపాటి శ్రమ పడితే మన వశమవుతుంది."

"ఈలోపల ప్రభుత్వమే సముద్రంలో వెతికించి ఆ పెట్టెల్ని వశపరచుకుంటే?"

"అసంభవం! ప్రభుత్వానికి బంగారు బాక్సులున్న సంగతి యెవరు చెప్తారు? మా స్నేహితులం అయిదు గురికే తెలుసా విషయం. వాళ్ళు ఎప్పటికీ చెప్పరు. శిధిలాలకోసమని, శవాలకోసమనీ గాలింపు చేస్తూన్న ఎయిరిండియా వాళ్ళు తెలియని బంగారం కోసం అనవసరంగా వెతుకులాట చేపట్టరు."

తనింకా యేవో సందేహాలు, అభ్యంతరాలు వెలి బుచ్చాడు. వాటన్నిటిని విక్టర్ తోసిపుచ్చేసి, "చూడు రాజా, అవకాశం ఒకసారే వస్తుంది. వచ్చి నీ తలుపు తట్టి పిలుస్తుంది. నువ్వందుకోకపోయావో నీ దురదృష్టం! యే మాటా రేపు చెప్పు. రెండు రోజుల్లో బొంబాయి వెళ్దాం. అక్కడ్నించి స్పాట్ కి వెళ్ళొచ్చు. ఆ ఏర్పా ట్లన్నీ నేను చూసుకుంటాను" అన్నాడు.

తను దైలమాలో పడిపోయాడు. అంత డబ్బు తను యెన్నాళ్ళు ఉద్యోగం చేసి సంపాదించగలుగుతాడు? జీవిత కాలం చాలదు. ప్రయత్నిస్తే యేం పోయింది? అనుకున్నాడు.

కాని, తను యిద్దరు పిల్లల్ని, భార్యని యెన్నడు వదిలి వుండలేదు. తమ కేంప్ వారం పడ్తుందో, నెలే పడ్తుందో! పైగా రిస్క్ తీసుకోవలసిన టాస్క్! ఇంత శ్రమపడ్డా ఫలితం దక్కుతుందా అన్నది అనుమానమే! వెనక ముందు ఆసరాలేని, తను పెళ్ళాం బిడ్డల్ని యిరుగు పొరుగువాళ్ళ రక్షణలో వదిలిపోవాలి!—అదీ రాజు సందేహానికి కారణం!

విక్టర్, నిరంజన్ కి కూడా యీ విషయం తెలియ చేయటానికి అసలు కారణం—నిరంజన్ ఒంటరివాడు కావటమే కాక, గజయీతగాడు! ఆరడుగుల పొడవుతో దృఢమైన కండరాలతో యెలాంటి కష్టమైన పనినైనా చిరునవ్వుతో అవలీలగా చెయ్యగల సమర్థుడు! పైగా యిలాంటి అడ్వెంచర్స్ అంటే అందరికన్న ముందే తయా రవుతాడు. మంచి స్నేహశీలి కూడా.

రాజు కూడా దుర్బలుడేం కాదు. దాదాపు అయిదడు గుల ఎనిదంగుళాల పొడవుతో ఎర్రటి ఛాయతో, పొడ

వుప తగ్గ శరీర సౌష్టవంతో బలిష్టంగానే కనిపిస్తాడు. నిజానికి వీళ్ళిద్దరి కన్న విక్టరే పొట్టిగా వుంటాడు. అయితే పొట్టివాళ్ళ కోవలోకి రాడు.... ఏవరేజ్ హైట్!

ముగ్గురి వయసు ముప్పయి ముప్పయి అయిదు సంవత్స రాల మధ్య వుంటుంది. అయినా చూడటానికి పాతికేళ్ళ యువకుల్లా యెప్పుడు హుషారుగా, అల్లరిచిల్లరిగా, తుళ్ళుతూ కేరింతలు కొడుతూ వుంటారు.

"నేను సిద్ధం!" అన్నాడు చివరకు రాజు.

## 2

బాంబే పోర్టు—

విక్టర్ నావల్ బేస్‌కి స్నేహితులిద్దర్నీ తీసుకు వెళ్ళాడు. గతంలో అక్కడ పనిచేసి వున్నందున పరిచయస్థులు స్నేహితులు చాలామంది విక్టర్‌ని చూసి ఆప్యాయంగా పలకరించటం, విష్ చేయటం, నవ్వుతూ షేక్‌హేండివ్వటం వంటి ఫార్మాలిటీస్‌తో దాదాపు రెండు గంటలు ఖర్చయిపోయాయి.

విక్టర్ నావల్ బేస్ సమీపంలో స్నేహితుల్ని నిలిపి తనొక్కడే లోపలికి వెళ్ళాడు. సివిలియన్స్ లోపలకు అనుమతించబడరు. విక్టర్ ఎక్స్‌సర్వీస్‌మన్ కావటంవల్ల అతనికలాంటి ఆటంకాలు లేవు.

పది నిమిషాల తర్వాత, యిద్దరు స్నేహితుల్ని వెంట బెట్టుకుని లోపలికి తీసుకు వెళ్ళాడు విక్టర్.

నిరంజన్, రాజు పోర్టును, హార్బర్‌ని ఇదివరకు చూసివుండని కారణంచేత పరీక్షగా గమనిస్తూ విక్టర్ వెంట నడిచారు.

అధునాతనమైన ఒక భవనంలోపలికి వాళ్ళిద్దర్నీ తీసుకు

వెళ్ళాడు విక్టర్. విశాలమైన హాల్లో యూనిఫాంలో వున్న ఇద్దరు అఫీషియల్స్ కూర్చొని వున్నారు.

విక్టర్ వాళ్ళిద్దరికీ నిరంజన్‌ని, రాజుని పరిచయం చేస్తూ, వాళ్ళిద్దరి గురించి, "ఈయన కపాడియా, ఈయన సందీప్" అంటూ పరిచయం చేశాడు.

కపాడియా సన్నగా పొడవుగా వున్నాడు. వయసు నలభై సంవత్సరా లుండవచ్చు.

సందీప్ ముప్పయి యేళ్ళలోపువాడు. పచ్చగా దబ్బ పండు ఛాయతో బాగా ఎత్తుగా బలిష్టంగా వున్నాడు. ఎప్పుడూ చెరగని చిరునవ్వు తన సొత్తన్నట్టు మంద హాసం చేస్తూ వుంటాడు. రాజుకు అతను బాగా నచ్చాడు.

కపాడియా జోక్స్ కట్ చేస్తూ ముఖ్యంగా అమ్మాయిల గురించి మాట్లాడుతూ నిరంజన్ నాకర్షించు కున్నాడు.

అందరూ కలిసి హోటల్లో ఒక గది తీసుకున్నారు.

వాళ్ళ గంట సమావేశంలో చాలా విషయాలు దొర్లాయి. కపాడియా, సందీప్ యిదివరకు విక్టర్‌తో పనిచేసిన నలుగురు స్నేహితుల్లోని యిద్దరు. తక్కిన యిద్దర్లో ఒకతను సముద్ర ప్రమాదంలో చనిపోయాడు. మరొకతను విశాఖపట్నం నావల్ బేస్‌కు బదిలీమీద వెళ్ళి పోయాడు.

"నా ఫ్రెండొకతను 'గోల్డు డిటెక్టర్'ని రూపొందిం చాడు. మెటల్ డిటెక్టర్, రహస్యంగా దాచిన మారణాయుధాల్ని కనిపెట్టినట్టే యిది ఇరవై మీటర్ల పరిధిలో ఎక్కడయినా గోల్డు సంక్షిప్తమై వుంటే దాన్ని కనిపెట్టి మనకు చెప్తుంది. దానికి ఓ ఎర్ర బల్బు,

కాలింగ్ బెల్ వంటి సాధనం అమర్చబడి వుంటాయి. బంగారాన్ని కనిపెట్టిన వెంటనే బల్బ్ వెలుగుతుంది. బెల్ మోగుతుంది. బంగారం యే దిశలో వుందో డైరెక్షన్ కూడా ఏరో మార్క్ ద్వారా సూచిస్తూంది" చెప్పాడు సందీప్.

విక్టర్ హర్షధ్వానం చేశాడు. "వెరీగుడ్! మీరు ఎలర్ట్‌గా వుంటారని నాకు తెలుసు. ఇక బంగారం మనకి చిక్కినట్టే" అన్నాడు.

"అప్పుడే యేం చెప్పగలం? ఆ స్పాట్‌కి చేరేలోపల ఎన్నో అడ్డంకులు. ఎంతసేపు మనం భారత సముద్ర జలాల్లోనే వెతుకులాడాలి. పొరపాటున విదేశీ సముద్రజలాల బార్డర్‌లోకి వెళ్ళామా అక్కడి నేవీఫోర్స్ మనల్ని కాల్చి చంపుతుంది. ఎట్‌లీస్ట్ బందీలుగానైనా పట్టుకుని, మన దేశాన్ని సంజాయిషీ అడుగుతుంది. చాలా రిస్క్!" అన్నాడు కపాడియా.

"బొంబాయి చేరటానికి ఏభై కిలోమీటర్ల దూరంలో కదా షిప్ పగిలిపోయింది!? అవి మన సముద్రజలాలే!" సందీప్ చెప్పాడు.

"కరెక్టే! కాని, సముద్రపు ఆటుపోటులకి ఆ పెట్టెలు ఎటైనా కొట్టుకుపోయే అవకాశముంది కదా! నావ మునిగిపోయిన స్పాట్ నుంచి కనీసం యిరవై మైళ్ళ దూరంలో కదా గోల్డు బాక్స్ దొరికింది....!? ఏం చెప్పగలం!" అన్నాడు కపాడియా. అతని వాదన సబబుగానే వున్నదనిపించింది.

"మనకు బార్డర్ యెక్కడుందో తెలుసు కదా! సముద్ర విహారానికి బయల్దేరినట్టు మన నావలో సిబ్బందికి చెపుతాం. హైదరాబాద్ నించి స్నేహితులు వచ్చారని,

సముద్రయానం పట్ల వారికి చాలా ఆసక్తి వుండటంవల్ల బాంబే వచ్చారని చెపుతాం. ఎవరూ అనుమానించరు. ఇకపోతే ఓ మోటార్ బోటు మంచిది సిద్ధం చేసుకుందాం రేపు. ఆక్సిజన్ సిలిండర్లు, రబ్బరు ట్యూబులు, తదితర ప్రాణరక్షణ సరంజామా అంతా ముందుగానే బోట్లో అమర్చుకోవాలి! ఇందులో తొందరపాటు పనికిరాదు. అలాగే ఓ వారంరోజులకి సరిపడే ఆహారం కూడా సిద్ధం చేసుకుంటే మంచిది!...."

కపాడియా చెప్తుంటే సందీప్ అడ్డొచ్చి, "ఆహారం దేనికి? మనం ఏ రోజు కా రోజు క్వార్టర్సుకి చేరకపోతే మన హాయ్యర్ అధారిటీస్‌కి అనుమానం రావచ్చు...." అన్నాడు.

కపాడియా, విక్టర్ తలలూపారు. "కరెక్టే! అయినా రెండురోజులకి సరిపడే ఆహారం పట్టుకెళ్తే మంచిది. ఎందుకంటే రాత్రికి రాత్రి వెను తిరిగొచ్చేబదులు, రాత్రి సమయంలో గాలింపు చేయటానికి అనుకూలంగా వుంటుంది. రెండురోజులకోసారి హెడ్ క్వార్టర్స్‌కి వస్తే సరిపోతుంది" అన్నాడు విక్టర్.

అతని ప్రతిపాదన అందరికీ నచ్చింది. ఆ పూటకు కపాడియా, సందీప్ కూడా ముగ్గురు స్నేహితులతో కలిసి విందారగించారు.

తర్వాత మరో రెండుగంటల పాటు చర్చ జరిగాక కపాడియా, సందీప్ వెళ్ళిపోయారు.

## 3

"అదిగో....ఆ కుడివైపు సూర్యుడు కనిపిస్తున్నవైపు పోనివ్వు. అక్కడ్నుంచి అయితే షిప్ పగిలిపోయిన స్పాట్‌కి దగ్గరదారి!" అన్నాడు కపాడియా.

సందీప్ స్టీరింగ్ దగ్గరున్నాడు. బోట్‌ని కపాడియా సూచించినవైపు తిప్పాడు.

రాజు, విక్టర్, నిరంజన్ ఆసక్తిగా సముద్రంవైపు దృష్టి సారించి చూస్తూన్నారు. విక్టర్ యేదో చెప్పలేని టెనన్‌తో అనీజీగా ఫీలవుతున్నాడు. రాజు అతని చేతి మీద చెయ్యివేసి మృదువుగా నొక్కాడు.

"నెర్వస్ కాకు! దొరికితే దొరుకుతుంది. లేకుంటే సరదాగా సముద్ర విహారంచేసి హైద్రాబాద్ తిరిగి వెళ్ళిపోదాం" అన్నాడు నిరంజన్.

బోటు పైనుంచి వందమీటర్ల పొడవున్న నైలాన్ తాడుని నీటిలోకి వదిలారు. దానికి చివర ఓ అయిస్కాంత క్షేత్రం అమర్చిన ఇనుప రాడ్ వున్నది. ఆ బరువు నీటి అడుగు భాగానికి తాడును దించటానికి బరువుగా ఉపయోగపడుతుంది.

ఇనుప పెట్టెలుగాని సముద్రపు అడుగున వుంటే అయస్కాంతానికి ఆకర్షింపబడి రాడ్‌కి తగులుంది. వెంటనే బోట్ ఆపి, దాన్ని పైకి చేరుకుంటారు మిత్రబృందం.

బోట్ వేగంగా దూసుకుపోతోంది.

ఓ బోట్ యెదురైంది వాళ్ళకు. దానిమీద నలుగురు యూనిఫాంలో వున్న నేవీ ఆఫీసర్స్ వున్నారు. కపాడియా వాళ్ళకు విష్ చేస్తూన్నట్టుగా టోపీ చేత బట్టుకుని గాల్లో రెండుసార్లు అయి యిటు ఆడించాడు.

అట్నుంచి వాళ్ళు కూడా టోపీలతో రిసీవ్ చేసుకొంటున్నట్టు టోపీలు గాల్లో ఆడించి నవ్వుతూ వెళ్ళిపోయారు.

అప్పుడు మధ్యాహ్నం ఒంటిగంట దాటింది.

సందీప్ లంచ్ ప్రపోజ్ చేశాడు. సందీప్, కపాడియా, విక్టర్ చికెన్ ఫ్రైతో రొట్టెలు తిన్నారు. రాజుకి రొట్టెలు తినే అలవాటు తక్కువ. నిరంజన్ కి యేదయినా ఒకటే! అతనుకూడా కపాడియా, విక్టర్ తో బాటు రొట్టెలు తీసుకొన్నాడు. రాజు కొద్దిగా రొట్టెలు పళ్ళు తీసుకున్నాడు.

లంచ్ అయిన తర్వాత అకస్మాత్తుగా నైలాన్ తాడుకేదో తగిలింది. అయిస్కాంతానికి యేదో అతుక్కున్నట్టు స్పష్టంగా తెలిసింది.

సందీప్ బోట్ వేగం బాగా తగ్గించేశాడు.

కపాడియా, విక్టర్ తాడును పైకి చేదుకోవటం మొదలు పెట్టారు. మరీ బరువుగా లేదు తగులుకొన్న వస్తువు. పైకి చేదుకోవటానికి పదినిమిషాలు పట్టింది. తీరా అయస్కాంతానికి ఆకర్షింపబడినవస్తువు శిధిలమైన విమానం రెక్క!

కపాడియా హుస్సురని నిట్టూర్చి, "జంబో జెట్ విమానం తాలూకు శిధిల భాగం! అనవసరంగా ట్రైయిన్ తీసుకున్నాం" అన్నాడు.

విమానం రెక్కని అయిస్కాంతం రాడ్ నించి విడదీసి మళ్ళీ సముద్రంలో పారేశాడు విక్టర్.

"మేమిద్దరం సోమరితనంగా కూచోలేకపోతున్నాం. మాకూ యేదయినా పని చెప్పు" అనడిగాడు రాజా విక్టర్ ని.

"అవసరపడినపుడు చెపుతానుగా. అంత దాకా కాసెట్ లో పాటలు వింటూ హాయిగా సముద్రం మీదికి దృష్టిని సారించి యెంజాయ్ చేస్తూండండి"

అన్నాడు విక్టర్.

కపాడియా మంచి ఇంగ్లీషు సాంగ్స్, హిందీ సాంగ్స్ ట్యూన్స్ వున్న కాసెట్స్, స్టీరియో రికార్డరుతో బాటు తెచ్చాడు. మిత్రులకి అది మంచి కాలక్షేపంగానే వున్నది.

రాజుకయితే అప్పటికే యింటి బెంగ పట్టుకున్నది. ఇల్లు వదిలివచ్చి మూడు రోజులయిపోయింది. నాలుగు రోజుల్లో తిరిగొస్తానని భార్యని ఒప్పించి వచ్చాడు. ఆమె తనని వదిలి ఒక్క రోజు కూడా వుండలేదు. పైగా వాళ్ళ ఆలనపాలన చూసేవాళ్ళెవరూ లేరు.

చీకటిపడింది.

విక్టర్ ఆనందంగా అరిచి చెప్పాడు: "షిప్ మునిగి పోయిన ప్రాంతం చేరుకోబోతున్నాం" అని.

కపాడియా, సందీప్ కూడా పరికించి చూసి, "ఎస్, స్పాట్‌కి చేరుకుంటున్నాం" అన్నారు.

సరిగ్గా అదే సమయంలో బోట్ అటు యిటు విపరీతంగా వూగింది.

సందీప్ స్టీరింగ్ ఫర్మ్‌గా పట్టుకుని, "జాగ్రత్తగా కూచోండి. వేవ్స్ వస్తున్నట్టున్నాయి...." అన్నాడు బిగ్గరగా.

కపాడియా, విక్టర్ సముద్రంవైపు పరిశీలనగా చూసి "సమీపంలో యెక్కడా వాయుగుండం కేంద్రీకృతమైన లక్షణాలు కనిపించటంలేదు. సముద్రం ప్రశాంతంగానే వుంది" అన్నారు.

నిరంజన్, రాజు మొదట కొద్దిగా కంగారుపడినా, వాళ్ళ మాటలకు తేరుకున్నారు.

మరోసారి బోట్ ఊగిసలాడింది. ఈసారి ఇదివరకటి

కన్న ఉధృతంగా వూగింది.

సందీప్ కళ్ళు చికిలించి చూశాడు. ఇంజన్ పక్కగా నీట్లో యేదో తల పైకెత్తి మళ్ళీ మునిగింది. ఆ కాస్త సేపట్లోనే సందీప్‌కి అదేమిటో చూచాయగా అర్థమయింది.

"మైగాడ్! షార్క్...." అనుకున్నాడు. కాని పైకి అనలేదు. బోటు మళ్ళీ ఎఫెక్టయితే చూద్దామనుకున్నాడు.

ఈసారి ఇంజను పక్కనున్న పడవ భాగాన్ని బలంగా కొట్టింది షార్క్. ఆ దెబ్బకు బోటు తలకిందులు కావలసిందే! కానీ సందీప్ చాలా అలర్టుగా వున్నాడు. స్పీడు అడ్జస్ట్ చేస్తూ స్టీరింగ్ కంట్రోల్ చేస్తున్నాడు.

కపాడియా షార్క్‌ని స్పష్టంగా చూశాడు. వెంటనే యారోగన్ అందుకున్నాడు. అందులో ఒకేసారి అయిదు బాణాలు గుప్పించటానికి వీలుంది. యారోస్ లోడ్ చేసి సిద్ధంగా గన్ పట్టుకుని నిల్చున్నాడు కపాడియా.

షార్క్ మళ్ళీ తలెత్తింది!

అంతే! ఒక్కసారిగా గన్ ఆపరేట్ చేశాడు కపాడియా.

ఒకసారి అయిదు బాణాలు షార్క్ శరీరంలో మహావేగంగా పోయి గుచ్చుకున్నాయి.

నీటిలో ఒక్కసారిగా పెద్ద అలజడి!

షార్క్ రెండుసార్లు బోట్‌ని బలంగా మోదింది. ఆ తర్వాత దూరంగా చెదిరిపోయినట్టు నీటిజాడనిబట్టి గ్రహించారు కపాడియా, విక్టర్.

"షార్క్ గాయపడి పారిపోయింది. ప్రస్తుతానికి గండం గడిచినట్టే!" అన్నాడు సందీప్.

కపాడియాతో బాటు తక్కిన ముగ్గురూ తేలిగ్గా ఊపిరి

వదిలారు.

కపాడియా మేప్ విప్పి బల్లమీద పరిచాడు. అప్పటికి బాగా చీకటి పడిపోయింది.

## 4

"గోల్డు డిటెక్టర్ నుంచి ఎలాంటి సూచనలు లేవు. అంటే గోల్డు బాక్సులు యీ ప్రాంతాల యెక్కడా లేవన్నట్టే!" అన్నాడు విక్టర్ సాలోచనగా, మేప్ మీదినుంచి తలెత్తి చూసి.

డిటెక్టర్ నించి ఎలాంటి కమ్యూనికేషన్స్ రావటం లేదు.

"మెటల్ డిటెక్టర్ కూడా వెంట తెచ్చుకొని వుండాల్సింది. గోల్డు ఓపెన్ గా లేదుకదా! ఐరన్ బాక్స్ లోపల కదా వుండేది!?" అన్నాడు రాజా.

కపాడియా భుజం చరుచుకొని, "డామిట్! పెద్ద రాంగ్ స్టెప్ వేశాం. రేపు మళ్ళీ రావలసిందే! ఈరోజు తిరిగి వెళ్ళిపోవటమే క్షేమకరం. రేపు మెటల్ డిటెక్టర్ కూడా వెంట తెచ్చుకుందాం!" అన్నాడు.

విక్టర్ సందీప్ వంక చూసి, "మనం షిప్ రెక్డ్ ఏరియాలోనే కదా యిప్పుడు పరిభ్రమిస్తున్నాం!?" అనడిగాడు.

"ఎగ్జాక్ట్లీ! అప్పుడే నాలుగు రౌండ్స్ వేశాను. అయిదో సర్కిల్ కూడా పూర్తికావస్తోంది. స్పాట్ కి అరవై మీటర్ల దూరం వరకు రౌండ్స్ వేశాను" అన్నాడు సందీప్.

"హెడ్ క్వార్టర్సునించి నూటఇరవై కిలోమీటర్లు వచ్చేశాం. పైగా యీ మీటర్ లో మరో నలభై కిలోమీటర్లు కేవలం రౌండ్స్ వేయటానికే చూపిస్తోంది. ఈ

స్పాట్‌కొచ్చి గంటన్నర దాటింది. కానీ యేమాత్రం ఫలితం కనిపించలేదు" అన్నాడు సందీప్ స్టీరింగ్ పక్క నున్న మీటర్‌లో చూస్తూ.

అందరిలోను నిర్లిప్తత, నిరాశావాదం చోటుచేసుకున్నాయి. డిన్నర్ అయిందనిపించారుగాని యెవరూ సరిగా తినలేదు.

రాత్రి తొమ్మిది గంటలు అయింది.

బోట్ చాలా మెల్లగా రౌండ్స్ వేస్తోంది.

"ఇప్పుడు వెనుతిరిగి వెళ్ళితే తెలతెలవార్తూండగా హెడ్‌క్వార్టర్స్ చేరుతాం. కాని దానివల్ల ప్రయోజనమేమిటి? మళ్ళీ తిరిగి రావాల్సిందేకదా!" అన్నాడు విక్టర్.

"కరెక్టే! కాని మనకి మెటల్ డిటెక్టర్ అవసరం కదా!" అన్నాడు కపాడియా.

విక్టర్ తలవిదిలించి, "మనవెంట డైవింగ్ డ్రెస్, ఆక్సిజన్ సిలిండర్సు వున్నాయికదా! నేను నీటి అడుగున పరిశోధిస్తాను. అప్పుడు ఏ డిటెక్టరూ అవసరముండదు" అన్నాడు.

సందీప్ వారించి, "స్పాట్ కరెక్టుగా లొకేటయితే తప్ప నీటి అడుగున వెతకటం వృథాశ్రమ! ఎనర్జీ వేస్టు!" అన్నాడు.

తక్కిన వాళ్ళు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. వచ్చినంత దూరం వెనక్కి వెళ్ళి, మళ్ళీ అదే లొకేషన్‌లోకి మర్నాడు రావటం ఎంతవరకు సమంజసంగా వుంటుందో ఆలోచిస్తున్నారు. సందీప్ చెప్పినట్టు వృథా శ్రమ కాదు గదా! అనిపించింది.

అకస్మాత్తుగా వాతావరణంలో ఏదో మార్పు

స్పష్టంగా కనిపించింది. చల్లటి గాలి నరాల్ని జివ్వుమంటూ వీస్తోంది. హోరుమన్న శబ్దం అలలమీదుగా తేలి తేలి వస్తోంది.

కపాడియా కళ్ళు చికిలించి చూశాడు చీకటి రాత్రులు. చుక్కల వెలుగు చాలా అస్పష్టంగా సముద్రంమీద పరుచుకొని వుంది. సందీప్ కూడా స్పష్టంగా విన్నాడు ఆ హోరు. విక్టర్ కి కూడా అది చిరపరిచితమైన హోరే!

ముగ్గురు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"వాయుగుండం!" అన్నాడు కపాడియా. అందర్లోను అతనే పెద్దవాడు, అనుభవజ్ఞుడు కావటంతో అతను చెప్పిందానికి తిరుగులేదని అక్కడున్న అందరికీ తెలుసు.

"ఇప్పుడెలా?" అన్నాడు రాజు. అతనికి యెందుకొచ్చానో అన్న పశ్చాత్తాపం తలెత్తి క్షణాల్లో మనసంతా ఆక్రమించుకున్నది. సముద్రమధ్యలో, జనసంచారానికి నూటయిరవై కిలోమీటర్ల దూరంలో వున్నారు.

నిరంజన్ మాత్రం నిమ్మకు నీరెత్తినట్టున్నాడు.

బోట్ దిగువకు అలల తాకిడి వచ్చేసిన గుర్తుగా బోట్ అటు యిటు ఊగింది. కపాడియా నీటిమీదుగా దృష్టిసారించి, "అందరు డైవింగ్ డ్రస్ వేసుకొని, సిలిండర్స్ వీపుకి అరేంజి చేసుకోండి!" అన్నాడు గంభీరంగా.

రాజు గుండె ఝల్లుమన్నది. "నాకు ఈత సరిగా చేతకాదు. ఎప్పుడో చిన్నప్పుడు చెరువులో యీదేవాడ్ని, అంతే!" అన్నాడు.

కపాడియా, సందీప్ ఆశ్చర్యంగా చూశారు. "ఆ మాట యిప్పటిదాకా మాతో చెప్పలేదేం విక్టర్?!"

అనడిగారు.

"నాకూ తెలియదు" అన్నాడు విక్టర్.

బోట్ ఈసారి చాలా వేగంగా ఊగిసలాడింది. సందీప్ బోట్‌ని వెనక్కి తిప్పి, వాయుగుండం కేంద్రీకృతమైన దిశకు వ్యతిరేక దిశలో బోట్‌ని పోనిస్తున్నాడు. అది హెడ్ క్వార్టర్స్‌కు పోయేదారి కాదని అతనికి తెలుసు. కాని గత్యంతరం లేదు. ప్రాణరక్షణ ముఖ్యం!

అందరు డైవింగ్ డ్రస్ వేసుకొని సిలిండర్లు వీపుకు కట్టుకుంటున్నారు. అవసరమైతే నీటి అడుగున దాగి ప్రాణాలు కాపాడుకోవాలని వాళ్ళ ఉద్దేశం! కాని నీటిలో నే అల్లకల్లోల స్థితి ఏర్పడిందిప్పుడు.

అలల వేగం హెచ్చింది. నిలువెత్తు అలలు లేచి సగంలో విరిగి సముద్రంలో పెద్ద శబ్దం చేస్తూ పతనమవుతున్నాయి. రాను రాను అలల వేగం, హోరు హెచ్చాయి. వాయుగుండం తుఫాన్‌గా మారటానికి ముందు స్థితి!

రాజువంక చూసి కపాడియా చెప్పాడు. "మీరు రబ్బరు ట్యూబులు రెండు మీతో సిద్ధం చేసుకోండి! మునిగిపోకుండా వాటి ఆధారంతో ఏదైనా తీరం చేరుకోవచ్చు....!" అని అతనంటుండగానే బోట్ మహా వేగంతో ఊగిసలాడింది. సందీప్ ఎంత కంట్రోల్ చేయాలన్నా శక్తికిమించిన పనయ్యింది.

అటు యిటు ఒరిగిపోతోంది బోట్. వందమీటర్ల నైలాన్ తాడును పైకి చేదారు! దాన్ని ఒకరితో మరొకరికి నడుములకి కట్టుకున్నారు. ట్యూబులు సిద్ధం చేసుకున్నారు.

సందీప్ చివరిసారిగా స్టీరింగ్ కంట్రోల్ చేయటానికి చేసిన ప్రయత్నం ఫలించలేదు. తాడి ప్రమాణం ఎత్తున రెండు పెద్ద అలలు ఒక్కసారిగా బోటుమీద పడ్డాయి.

అంతే—!

బోటు చటుక్కున తలక్రిందులయిపోయింది. ఒకేసారి అందరు సముద్రంలో పడిపోయారు. పడిపోబోయేముందు హెచ్చరిక చేసుకున్నారు. ఎట్టి పరిస్థితిల్లోను నడుముకు కట్టుకున్న తాళ్ళను వదిలిపెట్టకూడదని పెద్దగా అరచి చెప్పాడు కపాడియా.

రాజు తనతో తీసుకున్న రెండు రబ్బరు ట్యూబుల్ని చేతుల కిందుగాను పొట్ట కిందుగాను వచ్చేటట్టు అమర్చుకున్నాడు. అతన్ని ఎందుకో తను బతకనేమోననే అనుమానం వేధిస్తోంది.

# 5

పదినిమిషాలుకూడా గడవలేదు.

ఇంతలోనే ఒకరినుంచి మరొకరికి సంబంధాలు తెగిపోయాయి. వాళ్ళ నడుములకు కట్టుకున్న నైలాన్ తాడును జలచరాలు కొరికేశాయేమో, ఒక్కొక్కరి నడుముకు అటు యిటు తాడు ముక్కలు వేలాడుతూ కనిపించాయి.

ముందుగా భయపడిపోయినవాడు విక్టర్! అతను బాధపడింది తన గురించి కాదు. తన బలవంతంమీద బయల్దేరి వచ్చిన రాజాను గురించి.

అతనికి యీత సరిగా రాదు. మునిగింది చెరువో, కాలవో కాదు—సముద్రం! ఒకటి, రెండు కిలోమీటర్లు కాదూ - వందలకొద్దీ కిలోమీటర్లు యీదాలి! మామూలు సముద్రంకాదు—తుఫాన్‌లో చిక్కిన సముద్రం!

విక్టర్ యిలా ఆలోచిస్తూండగానే యేదో పెద్ద జలచరం అతనివైపు నోరు తెరుచుకొని రావటం కనిపించింది. దాన్నుంచి తప్పించుకోవటానికి మరో పక్కకు తిరిగి వేగంగా ఈదసాగాడు. కాని అది అతని వెంటనంటి మహా వేగంగా వస్తోంది.

విక్టర్ యీదుతూనే తీవ్రంగా ఆలోచిస్తున్నాడు? అది ఏమిటి? సొరచేపా, లేక ఏదైనా భయంకరమైన సముద్ర జీవా? యేమో, అలాంటిదాన్ని యెప్పుడూ చూడలేదు తను. పిక్క బలంకొద్దీ మహావేగంగా యీదుతూ ముందుకు సాగుతున్నాడు విక్టర్.

కపాడియా, అవలీలగా సముద్రాన్ని ఈదుతున్నాడు. రాను రాను సముద్రమంతటా వాయుగుండం తాలూకు ప్రభావం వ్యాపిస్తున్నట్టుగా అతను గ్రహించాడు. ముందుకు సాగిపోతున్నవాడల్లా చుట్టూ చూశాడు.

కొద్దిసేపట్లో వర్షంపడే సూచనలు కనిపిస్తున్నాయి. వర్షం మొదలయ్యేలోపల ఎంత దూరం యీదగలరు? చాలా కష్టం! కొద్దిగంటల పాటయితే నీటి అడుగున యెలాగో గడిపేయవచ్చు.

తను గతంలో సబ్ మెరిన్‌లో పనిచేశాడు. నీటిలో గడపటం తనకి బాగా అలవాటు. తనెలాగైనా బయటపడగలడుగాని, తక్కిన వాళ్ళ సంగతే అనుమానం.

కపాడియా యిలా ఆలోచిస్తూనే వేగంగా ముందుకు యీదుతున్నాడు. సరిగ్గా అప్పుడే సన్నటి తుంపర మొదలయ్యింది.

మిగతా వాళ్ళతో సంబంధం పూర్తిగా తెగిపోయిందని తెల్సుకోవటానికి రాజుకెంతో సేపు పట్టలేదు. అతనిలో సన్నగా వణుకు మొదలయ్యింది.

చేతుల మధ్య ఓ రబ్బరు ట్యూబు, పొట్ట దిగువున మరో ట్యూబు అతన్ని నీటిమీద తేల్చగలిగాయేగాని, ఉవ్వెత్తున లేచిపడుతున్న అలల తాకిడికి విపరీతమైన వేగంతో ఎటో తెలీకుండా విసిరివేయబడుతున్నాడు.

ఇంతలో చేతులకు అంతదాకా ఆధారంగా నిలిచిన ట్యూబ్ అలల వేగానికి ఎటో కొట్టుకొనిపోయింది. ఇక మిగిలింది పొట్ట దిగువ అమర్చుకున్న ట్యూబు మాత్రమే! దాన్ని జారిపోనీకుండా చూసుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు రాజు.

పొట్ట దిగువకు నీటిని రెండు చేతుల్తోను లాక్కుంటూ కాళ్ళు తపతప కొడుతూ తన ప్రయత్న లోపం లేకుండా రాజు యీదటానికి ప్రయత్నిస్తున్నాడు. కాని ఎంతో దూరం పోకుండానే ఎక్కడినుంచో ఓ అల వచ్చి ఏదో పక్కకు విసిరికొడుతోంది. మొహాన్ని నీళ్ళతో ముంచెత్తుతోంది. ఊపిరి అందటంలేదు.

సరిగ్గా అదే సమయంలో - ఓ నిలువెత్తు అల అతన్ని నీటిమీద ఎత్తి కుదేసింది. అంతే. అంతదాకా అతన్ని నీటిమీద తేలటానికి ఆలంబనగా మిగిలిన రెండో ట్యూబ్ కూడా అతన్నుంచి జారిపోయింది.

చీకటి — పైనుంచి సన్నని తుంపర! — ఆయాసం అతన్ని ఉక్కిరి బిక్కిరి చేశాయి.

నీటిమీద తేలటం అసాధ్యం అని తేలిపోయింది. ఆ చివరి క్షణాల్లో రాజు ఒకేఒక మంచి పనిచేశాడు. మాస్క్ ముఖానికి తగిలించేసుకొని ఆక్సిజన్ సిలిండర్‌కి కనెక్షన్ యిచ్చుకున్నాడు. ఊపిరి అందింది. కాని నీటిలో మునిగిపోయి అంతకంతకు నీటి అడుగు భాగానికి వేగంగా దిగిపోసాగాడు.

# 6

విక్టర్ ఆ సముద్రపు జీవినుంచి తప్పించుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

కాని అది అతనిమీద పగబట్టినట్టు విడవకుండా వెంటాడుతోంది. దాని వైపు తేరిపార చూడటానికి కూడా అవకాశం దొరకలేదు. కాని అది సొర చేప కాదు. అలాంటిదే మరో చేప కావచ్చు.

నోరు తెరుచుకొని, భయంకరంగా వున్న దాని ముఖం ఖడ్గమృగం ముఖాన్ని తలపింప చేస్తున్నది. దాదాపు పదిఅడుగుల పొడవుతో ఆరడుగుల వెడల్పుతో విచిత్రాకృతిలో వున్నదాజీవి! ఏదో తిమింగలం జాతి జలచరంలాగా వున్నది.

విక్టర్ యిక తన అంతిమ ఘడియలు సమీపించాయనుకున్నాడు. అప్పటికే అతను బాగా అలిసిపోయాడు. నడుముకు కట్టుకున్న ఆక్సిజన్ సిలిండర్ బరువు గమన వేగాన్ని గణనీయంగా తగ్గించి వేసింది. అయినా వీలయినంత వేగంగా ముందుకు ఈదుకుంటూనే పోతున్నాడు.

విక్టర్ మాస్క్ ముఖానికి తగిలించుకున్నాడు. సిలిండర్‌నుంచి ఆక్సిజన్‌కి కనెక్షనిచ్చుకున్నాడు. నీటి కింది భాగానికి మెల్లగా ప్రయాణం మొదలెట్టాడు.

చిత్రమేమిటంటే ఆ జలచరంకూడా నీటి అడుగు భాగానికొచ్చి విడవకుండా అతన్ని వెంబడిస్తోంది.

విక్టర్ దాని బారినుంచి తప్పించుకోవాలని వేగంగా, మరింత అడుగువరకు మునిగిపోయాడు. కాని ఆ జలచరంకూడా అతన్ని అంతే వేగంతో వెంబడిస్తోంది. నోరు తెరుచుకొని మహా వేగంగా అతన్నందుకోవాలని ప్రయత్నిస్తోంది.

విక్టర్ దుస్తులు తడుముకున్నాడు. చేతికి బటన్ నైఫ్ తగిలింది. ఆ చిన్న ఆయుధంతో ఆ పెద్ద జలచరాన్ని మట్టుబెట్టడం సాధ్యంకాదు. అయినా ఆపద సమయంలో అంతకన్న మరో మార్గం లేదు! అప్పటికే అది అతని కాలు అందుకోవటానికి సిద్ధంగా వుంది!

విక్టర్ గిర్రున తిరిగాడు. సరిగ్గా అతను దానికి ముఖాముఖి వచ్చాడు.

మెరుపు వేగంతో బటన్ నైఫ్ పైకితీసి బటన్ నొక్కాడు. దాదాపు అడుగు పొడవున్న పదునైన కత్తి బయటికొచ్చింది.

నోరు తెరుచుకొని వున్న ఆ జలచరం నోటిలోను, కళ్ళలోను చాకుతో ఇష్టమొచ్చినట్టు పొడిచేశాడు.

సముద్రపు నీరు ఆ ప్రాంతంలో ఎర్రగా మారిపోయి భయంకరంగా కనిపించింది.

జలచరం బాధతో మూలిగింది. రెట్టించిన కోపంతో అతనిమీదకు రాబోయింది. కాని కళ్లు కనిపించక, ఆ వేగంలో తల్లకిందు లయిపోయింది.

అదే అవకాశంగా మళ్ళీ చాకుతో దాని శరీరాన్ని బాగా గాయపరిచాడు విక్టర్. వెల్లకిలా తేలిపోయిందా జలచరం.

ప్రాణం పోయిందని గ్రహించి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు విక్టర్.

ఇదివరలో జలాంతర్గాముల్లో సంచరించి వుండటంవల్ల నీటి అడుగు భాగంలో దాక్కోవటం బాగా అలవాటు పడింది. తుఫాన్ తగ్గి పోయేవరకు నీటి అంతర్భాగంలో గడిపెయ్యటమే క్షేమకరమనిపించిం దతనికి.

తలకు చుట్టుకున్న మాస్క్ పైభాగంలో బాటరీతో

పనిచేసే బల్బుంది. దాని వెలుగులోనే అతను జలచరాన్ని చూడగలిగాడు. దాన్ని వేటాడగలిగాడు. లేకుంటే నిశ్శబ్దంగా అది తనని తినేసి వుండేది.

బల్బు వెలుగులో వాటర్ ప్రూఫ్ వాచ్ చూసుకున్నాడు. రాత్రి పదకొండున్నర కావస్తోంది. తాము సముద్రంలోకి దూకేసి రెండున్నరగంటలయ్యింది.

అతని ఆలోచనలు మళ్ళీ రాజుమీదకి తిరిగాయి. పాపం ఎలా వున్నాడో! బతికి వున్నాడో లేదో! ఈత రాదు సరికదా, సముద్రంలో మనుషుల్ని తినేయగల జంతువులుంటాయనే సంగతి అతనికి తెలియదేమోకూడా.

ఉపరితలంమీద వాన వేగం బాగా హెచ్చింది. ఆకాశం సముద్రం కలిసిపోయినట్టు కనిపిస్తోంది. కుండ పోతగా వర్షం! హోరున సముద్ర ఘోష!

సందీప్ సముద్రంపై ఈదుతూనే మిత్రులకోసం వెతుకుతున్నాడు.

ఎవరో నీటిమీద పెద్ద చారలు వేసుకుంటూ దూరంగా యీదుతూ పోవటం గమనించాడు సందీప్. రాజు కాదు కదా! వుత్సాహంతో వేగంగా అటు యీదుకుంటూ వెళ్ళసాగాడు.

వర్షం జోరు, గాలి హోరు హెచ్చాయి. సముద్ర ఘోష గుండె ల్ని అదరగొడుతోంది. ఉవ్వెత్తున్న అలలు లేచిపడుతున్నాయి.

అతి కష్టంమీద సందీప్ ఆ వ్యక్తిని చేరుకున్నాడు. అతను రాజు కాదు—నిరంజన్!

నిరంజన్ కూడా సందీప్ ని చూసి ఆనందంగా కేక పెట్టాడు. అతనికి కొండంత బలం వచ్చింది.

"రాజు కనిపించాడా?" అడిగాడు సందీప్.

"నేనూ అదే ప్రశ్న మిమ్మల్ని అడగాలనుకొం టున్నాను" అన్నాడు నిరంజన్.

"కపాడియాగాని, విక్టర్ గాని...."

"ఊహుఁ ఎవరూ కనిపించలేదు."

"దూరంగా ఏదో దీపంలా కనిపిస్తోంది."

సందీప్ నీటిమీద కనిపిస్తూన్న లైటు వంక సూచించాడు. నిరంజన్ కూడా చూశాడు. నీటిమీద ఏదో తేలి వస్తూన్నట్టు కనిపిస్తోంది.

"ఈ తుఫాన్ లో యేదో బోట్ వస్తున్నదే" చిత్రంగా లేదూ....?" అన్నాడు నిరంజన్.

వెలుగు క్రమంగా దగ్గరకొస్తోంది. వర్షం బాగా జోరుగా కురుస్తోంది. ఉవ్వెత్తున అలలు లేచిపడుతున్నాయి. సందీప్, నిరంజన్ నీటిమీద యెగిరి అంత దూరంలో పడ్డారు.

నిరంజన్ మునిగి అయిదు నిమిషాలవరకు పైకి రాలేక పోయాడు. నీళ్ళు తాగేసినట్టున్నాడు. ముక్కులోకి కూడా నీళ్ళుపోయినట్టుంది, ఉక్కిరిబిక్కిరై పోయి కాళ్ళు తపతప కొట్టుకుంటున్నాడు.

సందీప్ చాలా వేగంగా అతన్ని చేరుకొని అతని జుట్టుపట్టి నీటిమీదకి లాగాడు. నిరంజన్ కాసేపటివరకు తేరుకోలేకపోయాడు.

"మాస్క్ వేసుకోవలసింది.........!?" అన్నాడు సందీప్.

"అలల తాకిడికి మునిగిపోయాను. మాస్క్ వేసుకునే టంత వ్యవధి లేకపోయింది."

"నీళ్ళు బాగా తాగేశావా?"

"ఎంతో కాదు—కొద్దిగా!"

"అసలే ఉప్పునీరు. కడుపులో వికారం పుడుతుంది."

"తప్పనిసరి!"

"అరె__యిందాకా కనిపించిన లైట్ యిప్పుడు కనిపించదే...." సందీప్ కళ్ళు చిట్లించి చూశాడు. నిరంజన్ కూడా అటు చూసి ఆశ్చర్యపోయాడు.

బోట్ లా కనిపించిందే? ఏమయింది? ఇందాకా యెగిసిన అలల తాకిడికి మునిగిపోయిందా? అంతుబట్టలేదు వాళ్ళకి!

సరిగ్గా అప్పుడే కపాడియా గొంతు చాలా దయానీయంగా వినిపించింది. సందీప్, నిరంజన్ నిర్ఘాంతపోయి ఆ గొంతు వినిపించినవైపు చకచక అంగలు వేసుకుంటూ ఈదుకుంటూ సాగిపోయారు.

# 7

నీటి ఉపరితలంమీద బాగా వర్షం హెచ్చిన కారణంగా నీటి అడుగు భాగానికి మునిగి క్రింది భాగంవైపు డైవ్ చేయసాగాడు కపాడియా. కాని, అతను పాతిక మీటర్లు దిగాడో లేదో ఒక్కసారిగా ఇరవై ముప్పై చేపలు అతన్ని చుట్టుముట్టాయి.

కపాడియా మొదట నిర్లక్ష్యం చేశాడు. కాని అవి సొరచేప పిల్లలని, మనిషిని కొరుక్కుతినేస్తాయని అతను గ్రహించేలోపల అవన్నీ అతని చుట్టూ వలయాకారంగా యేర్పడిపోయాయి. నోళ్ళు తెరుచుకుని అతని మీదిమీదికి వచ్చేశాయి.

వాటికి చిక్కితే తనని సజీవంగానే కొరుక్కుతినేస్తాయని కపాడియాకు తెలుసు!

కపాడియా తనవెంట యారోగన్స్ తెచ్చుకున్నాడు. కాని యేం లాభం? యారోస్ నీట మునిగిపోయాయి

బోట్ తలకిందులైనపుడు. యారోగన్ని మాత్రం నడుముకి కట్టుకున్నాడు. సందీప్ దగ్గర రివాల్వర్ వుండాలి! ఉందో, అదికూడా పడిపోయినపుడు సముద్రంలో జారిపోయిందో తెలీదు. తనకి సందీప్ మళ్ళీ కనిపించలేదు!

సారచేప పిల్లలు ఒక్కొక్కటి నాలుగడుగుల పొడవు అరడుగు వెడల్పు వున్నాయి. నోరు తెరిచినపుడు వాటి నోట్లోని పదునైన పళ్ళు భయంకరంగా కనిపిస్తున్నాయి. నోరు ఎర్రగా వున్నది. తనని ఏ ముక్క కా ముక్క కొరుక్కు తినేయటానికి పది సారలు చాలు!

కపాడియా నడుముకున్న యారోగన్ చేతుల్లోకి తీసుకుని బలంగా వాటిని మోదసాగాడు. కాని నీటిలో దెబ్బ బలంగా తగల్లేదు.

సారచేపలు చుట్టుముట్టి కొరకటం మొదలెట్టాయి. కపాడియా వాటి బారినుంచి తప్పించుకోటానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

వేగంగా నీటి ఉపరితలంమీదికి రావటానికి ప్రయత్నించాడు కాని సారచేపలు అతన్ని అంగుళం కూడా కదలనివ్వలేదు.

కపాడియా యారోగన్తో వాటిని కొట్టడం మానలేదు. కాని అతని దెబ్బలు వాటిని చెదరగొట్టలేకపోయాయి.

నీటి అడుగుభాగంలో వాటితో పోరాడుతూ ఎంతోసేపు వుండలేకపోయాడు. అప్పటికే అతని కాళ్ళ చేతివేళ్ళను కొరికేసాయి సారలు.

కపాడియా చివరిప్రయత్నంగా వాటిని చెదరకొడుతూ నీటిమీదకు అతి కష్టంమీద ఈదుకొంటూ వచ్చాడు. సారలు అతన్ని వెంటాడి వేటాడుతూనే వున్నాయి.

కపాడియా చేతుల్లో పట్టు సడలిపోయింది.

"హెల్ప్! హెల్ప్!!" అంటూ హృదయవిదారకంగా కేకలు వేయసాగాడు కపాడియా.

సందీప్, నిరంజన్ ఆ కేకలు విన్నారు. హోరున కురిసే వర్షంలో, కన్ను చించుకున్నా కనిపించని ఆ చీకట్లో కపాడియా ఆర్తనాదాలు వినిపిస్తున్న వైపు వేగంగా ఈదుకుంటూ వెళ్ళారు.

దూరంగా కపాడియా కేకలు వినిపిస్తున్నాయి.

"హెల్ప్! హెల్ప్!" అంటూ శక్తినంతా కూడదీసుకుని అరుస్తున్నాడు కపాడియా.

"అది ఖచ్చితంగా కపాడియా గొంతే! ఏదో ప్రాణాపాయంలో చిక్కుకున్నాడు. లేకుంటే అంత దీనంగా కేకలు పెట్టడు. కపాడియా స్వతహాగా చాలా ధైర్యవంతుడు!" సందీప్ ఆయాసాన్ని కూడా లెక్క చేయకుండా బారలు వేస్తూ చెప్పాడు.

నిరంజన్ అతనితో సమానంగా ఈదలేకపోతున్నాడు. సందీప్ డిపార్టుమెంట్లో చాన్నాళ్ళుగా పని చేస్తున్నాడు. సుశిక్షితుడు. అతని ఉద్యోగమే అతనికి శిక్షణ! నిరంజన్ యెప్పుడో చిన్నతనంలో నేర్చుకున్న ఈత! ఇప్పుడు వయసు మీదపడ్డాక ఈదటం కష్టంగానే వున్నది.

దాదాపు పదిహేను నిమిషాల తర్వాత కపాడియా గొంతు విన్పించిన ప్రదేశం చేరుకున్నారు. అంతకు అయిదు నిమిషాల క్రితం నుంచి కపాడియా గొంతు వినిపించటంలేదు.

సందీప్ మనసు కీడును శంకిస్తోంది. నిబ్బరంగా ఈదు

తున్నాడు.

నిరంజన్ కాసేపటికి అతన్నందుకున్నాడు

సందీప్ ఆ ప్రాంతంలో చాలాసార్లు రౌండ్లు వేస్తూ తిరిగాడు. కాని కపాడియా జాడలేదు.

తన ఊహే కరక్టయితే కపాడియా యీ ప్రాంతాల నుంచే అరిచాడు. కాని, యిప్పుడు ఎక్కడా అతని జాడ లేదు. ఏమయ్యాడు?

సరిగ్గా అప్పుడే ఓ పెద్ద నిలువెత్తు అల ఎగిరి సముద్రంలో విరిగిపడింది. ఎగిరిపడ్డ అల ఎవరో వ్యక్తిని సముద్రంమీదికి విసిరింది.

సందీప్ మాస్క్‌కున్న బల్బ్ వెలుగ్లో స్పష్టంగా చూశాడు. ఆ వ్యక్తి మునిగిపోతుండగా అతివేగంగా అటు ఈది పట్టుకున్నాడు.

అతను కపాడియా! ముఖం, కాళ్ళు, చేతులు సొరలు తినేయగా కేవలం మొండి మొండెం మాత్రం మిగిలింది. ముఖం సగానికి పైగా చేపలు తినేయటంవల్ల గుర్తు తెలియటంలేదు. కానీ, సందీప్ అతని సహచరుడు! కపాడియాని చాలా వేగంగా గుర్తుపట్టాడు.

ఆత్రంగా అతడి నాడి చూశాడు. ఆడటంలేదు. ముక్కు, కళ్ళు వుండాల్సిన స్థానంలో గుంటలు మాత్రం వున్నాయి! అతని శరీరం వేడిని కోల్పోతోంది.

కపాడియా శ్వాస శాశ్వతంగా ఆగిపోయింది. కళ్ళ ముందే ప్రాణాలు విడిచిన సహచరుడి దీనస్థితికి సందీప్ మ్రాన్పడిపోయాడు.

నిరంజన్ కూడా గుర్తించాడు కపాడియాని. డామిట్! చేపలేవో తినేశాయి! కపాడియావంటి అనుభవజ్ఞుడే జలచరాల ధాటి కాగలేక ప్రాణం వదిలాడే, యిక

రాజు గురించి ఆలోచించేదేముంది? అతనుకూడా....

నిరంజన్ బాధగా తల విదిల్చాడు. విక్టర్ జాడ కూడా తెలియలేదు. అదృష్టవశాత్తూ రాజు విక్టర్‌కి కనిపించి, వాళ్ళిద్దరు యేదైనా సురక్షిత ప్రాంతానికి చేరి వుంటే ఎంత బావుండును! అనుకున్నాడు.

వర్షం కుండపోతగా కురుస్తూనే వుంది!

# 8

నడుముకు యేదో కొక్కెంలాంటిది తగులుకోవటం, ఎవరో పైకి చేరుతున్నట్టు నీళ్ళ అంతర్భాగంనించి పైకి లేవటం ఆశ్చర్యంగా అనిపించింది రాజుకు.

నడుముకు కట్టుకున్న సిలిండర్ బెల్టుకు కొక్కెం తగులుకున్నది! కొక్కెం ఓ గొలుసుకు కట్టబడి వున్నది!

అంటే ఎవరో తనని రక్షిస్తున్నారు! తను మునిగి పోయిన సంగతి తెలిసిన మిత్రులు నలుగురు తనకోసం గాలిస్తూ సహాయార్థం గొలుసును నీటి క్రింది భాగంవరకు దింపిస్తున్నారు రాజు తేలిగ్గా నిశ్వసించాడు.

ఉపరితలం మీదికి రాగానే హోరున కురుస్తూన్న వర్షం చప్పుడు కర్ణకఠోరంగా వినిపించింది. కాసేపటి వరకు అక్కడేమున్నదో, ఏం జరుగుతున్నదో రాజుకి కనిపించలేదు.

తర్వాత తెలిసింది—తనను చేరుకున్నది మిత్ర బృందం కాదని! అక్కడ బ్రహ్మాండమయిన ఓ షిప్ ల్యాండయి వున్నది. దానిమీద చాలామంది నేవీడ్రస్‌లో వున్న వ్యక్తులున్నారు.

అయితే వాళ్ళు ఇండియన్ నేవీకి సంబంధించినవాళ్ళు కాదని, వాళ్ళు ధరించిన యూనిఫామ్‌నిబట్టి గుర్తించాడు రాజు. అయితే వాళ్ళెవరు?

రాజును చూసినవాళ్ళు దిగ్భ్రాంతి చెందినట్టు స్పష్టంగా గమనించాడు రాజు. వాళ్ళు అతన్ని షిప్ డెక్ మీద పడుకోబెట్టారు. షిప్ నిండా అడుగడుగునా లైట్లు. పట్టపగల్లా వున్నది.

వాళ్ళు రాజును ఏదో అడిగారు. కాని ఆ భాష రాజుకి అర్థంకాలేదు.

వారిలో కెప్టెన్‌లా వున్న ఓ వ్యక్తి ముందుకొచ్చి రాజును, అతని డైవింగ్ డ్రస్‌ని, నడుముకు కట్టుకున్న ఆక్సిజన్ సిలిండర్ని చూసి తలూపి, తక్కినవాళ్ళ వంక సాభిప్రాయంగా చూసి, రాజువైపు సూటిగా చూస్తూ "హూ ఆర్యూ?" అనడిగాడు ఆంగ్లంలో.

రాజుకు ప్రాణం లేచివచ్చినట్టనిపించింది. జవాబు చెప్పెయ్యటానికి సంసిద్ధుడై అంతలోనే చటుక్కున ఆగిపోయాడు.

వారు విదేశీయులు! భారత నేవీ కాదు! తను నిజం చెప్పటం యెంతవరకు సమంజసంగా వుంటుందోనని డైలమాలో పడ్డాడు.

"నౌకా విహారానికి బయల్దేరాం మా మిత్రులం అయిదుగురం కలసి. మా బోట్ తుఫాన్‌లో చిక్కుకున్నది! తిరగబడిపోయింది. తలో దారిన విడిపోయాం" అన్నాడు రాజు ఆంగ్లంలోనే.

మరి యీ డైవింగ్ డ్రస్సూ, సిలిండర్ యెందుకు అనడుగుతాడేమో? ఏదో సమాధానం చెప్పాలి—అనుకున్నాడు రాజు. కాని, అతనా ప్రశ్న అడగలేదు.

కాని, కెప్టెన్ నమ్మినట్టులేదు. ముఖంలో అనుమాన వీచికలు స్పష్టంగా గమనించాడు రాజు. వాళ్ళు యే దేశానికి సంబంధించినవాళ్ళో అడగాలని నోరు తెరవ

బోయాడు.

అంతలో కెప్టెన్ అతనిదగ్గరగా గొంతు కూర్చొని, "నువ్వు భారతదేశ గూఢచారివి అవునా? బార్డర్‌లో నావల్ ఫోర్స్ ఎంతుందో యిన్ఫర్మేషన్ నీ దేశానికి చేర వేయటం కోసం వచ్చావు. అనుకోకుండా మా సబ్‌మెరైన్ సిబ్బంది కళ్ళపడిపోయావు. వాళ్ళు మాకు వైర్లెస్ ఇన్ఫర్మేషన్ ఇచ్చారు. నిన్ను వెంటనే లొకేట్ చేసి పట్టుకున్నాం. అవునా?" అన్నాడు క్రూరంగా రాజు కళ్ళలోకి చూస్తూ.

రాజు నిర్ఘాంతపోయాడు.

కెప్టెన్ రాజుని కాలర్ పుచ్చుకొని పైకిలేపి, "మాతో నిజం చెప్పకపోతే, నిన్ను ఖండఖండాలుగా చేసి మీ భారత ప్రభుత్వానికి కానుకగా పంపిస్తాం. నిజం చెపితే, బందీగానైనా ప్రాణాలతో వుంచుతాం. ఏ సంగతి వెంటనే నువ్వే నిర్ణయించుకొని చెప్పు!" అన్నాడు.

రాజు అనుకోని యీ ఆరోపణకి, కెప్టెన్ మూర్ఖత్వానికి కాసేపు నోటమాటరాక మౌనం వహించాడు. తనని వాళ్ళు గూఢచారిగా భావిస్తున్నారు. అంటే, యీ షిప్ వున్న సముద్ర ప్రాంతం భారత జలానికి సంబంధించినది కాదన్నమాట! బార్డర్లో వున్న విదేశీ నావల్ ఫోర్స్ అయ్యుండాలి. అయితే, వీళ్ళది దేశం?

రాజు ఎలాగో గొంతు పెకల్చుకొని, "నేను భారతీయుడ్నే గాని, గూఢచారిని మాత్రం కాదు. మీరలా అనుమానిస్తున్నారు, అంతే! మిమ్మల్ని నమ్మించటానికి నన్నేం చేయమంటారు?" అనడిగాడు.

కెప్టెన్‌తో బాటు అక్కడున్న వారంతా అపహా

స్వయంగా నవ్వారు. రాజుకి ఉక్రోషం, నిస్సహాయత. కోపం ఒక్కసారిగా పెల్లుబికాయి. నిగ్రహించుకున్నాడు.

కెప్టెన్ రివాల్వర్ రాజుకి గురిచేసి, "తుఫాన్‌లో కూడా నువ్వు రహస్యాలు తెలుసుకోవటాని కొచ్చావంటే నువ్వు సామాన్యుడివి కాదని నా కర్థమైపోయింది. నిన్ను ప్రాణాలతో వదలటమంటే మా రహస్యాల్ని మేమే బయటపెట్టుకున్నట్టే! గెట్ రెడీ, నీ యిష్టదైవాన్ని మనసారా స్మరించుకో!....ఇప్పటికైనా మించిపోయింది లేదు. నిజం చెప్పెయ్, నిన్నేం చెయ్యం! కమాన్....క్విక్!" అన్నాడు సూటిగా రాజు కళ్ళలోకి క్రూరంగా చూస్తూ.

రాజులో సాగర మథనం మొదలయింది. అయిన వాళ్ళందరికీ దూరంగా యీ విదేశీయుల చేత చిక్కి దిక్కులేని చావు చావబోతున్నందుకు విచారంగా వున్నది!

కెప్టెన్ చేతివేళ్ళు రివాల్వర్ మీద బిగుసుకున్నాయి.

# 9

విక్టర్‌కి అకస్మాత్తుగా ఎక్కడ్నుంచో సబ్‌మెరైన్ యింజన్ చప్పుడు వినిపించింది.

చెవులు వొగ్గబెట్టి జాగ్రత్తగా విన్నాడు. అనుమానం లేదు, అది జలాంతర్గామి ఇంజన్ శబ్దమే!

విక్టర్ ఆ శబ్దం వినిపిస్తూన్న వైపు చకచక యీదుకుంటూ వెళ్ళాడు. మాస్కుకున్న హెడ్‌లైట్‌లో సబ్‌మెరీన్ దూరంగా కనిపించింది. అతనికి ప్రాణం లేచి వచ్చింది.

ఇంత తుఫాన్‌లో సబ్‌మెరీన్‌లో ఎవరు సంచరిస్తూన్నారు? బహుశా బార్డర్లోని గస్తీ దళాలు, పొరుగు

దేశాలు భారత జలాల్లోకి ప్రవేశించకుండా కాపలా కాస్తూ వుండివుండాలి!

విక్టర్ జలాంతర్గామిని సమీపించబోయి దూరంగా ఆగిపోయాడు! అది నేవల్ ఫోర్స్‌కి సంబంధించినదికాదు. మరి, శత్రుదళాలకు సంబంధించిన జలాంతర్గామా? ఏమో అలాకూడా అనిపించటంలేదు.

అయితే, అందులో ఎవరున్నారు? జలాంతర్భాగంలో వాళ్ళు చేస్తూన్న పనేమిటి? తను వాళ్ళ కళ్ళపడటం మంచిది కాదేమో! ఈ ఆలోచన రాగానే విక్టర్ వెను తిరిగి దూరంగా యీదుకుంటూ వెళ్ళిపోవాలనుకున్నాడు.

కాని, అప్పుడే అనుకోని సంఘటన జరిగిపోయింది. ఒక్కసారిగా అతనిమీదకు నైలాన్ వల విసిరారెవరో! విక్టర్ వల్లో చిక్కుపోయాడు. విదిలించుకోబోయాడు, కాని సాధ్యం కాలేదు.

జలాంతర్గామి క్రమంగా నీటి ఉపరితలంమీదికి చేరు కుంది. దాంతోబాటు నైలాన్ వల్లో చిక్కున విక్టర్ కూడా ఉపరితలంమీదికి చేరుకున్నాడు.

సబ్‌మెరీన్ గ్లాసు తలుపులు తెరుచుకున్నాయి. విక్టర్ వలతోబాటు లోపలికి లాగెయ్యబడ్డారు. గ్లాసు తలుపులు మళ్ళీ మూసుకున్నాయి.

ఆ కాసేపట్లోను సముద్రంమీద మహా ఉధృతంగా కురుస్తున్న వర్షాన్ని, మహా వేగంగా వీస్తున్న పెను గాలిని గుర్తించాడు విక్టర్. ఏ ఆధారంలేని మనిషి ఆ తుఫాన్‌లో సముద్రంమీద బతికి వుండటం అసాధ్యం!

సబ్‌మెరీన్‌లోకి లాగెయ్యబడ్డాక ఒకసారి లోపలకు చూపులు సారించాడు విక్టర్!

ఎవరో నలుగురు వ్యక్తులు తన వంకే సూటిగా,

పరీక్షగా చూస్తూ కనిపించారు. నలుగురు బలిష్ఠంగా వున్నారు. ఎవరూ ఆరడుగులకు తక్కువుండరు. రక్తం తాగే నరరూప రాక్షసుల్లా వున్నారు.

అందులో ఒకడు ముందుకొచ్చి విక్టర్‌ని హిందీలో అడిగాడు. "కౌన్ హో తుమ్?" అని.

విక్టర్ వాళ్ళు స్వదేశీయులేనని గుర్తించాడు. కాని, డిపార్టుమెంటువాళ్ళు కాదని మొదటి చూపులోనే గ్రహించాడు.

ఒక నిమిషం ఏం సమాధానం చెప్పాలా అని సంకోచించాడు. చివరికి చెప్పాడు. "నేను మా స్నేహితులతో సముద్రయానం చేయాలని వచ్చి తుఫాన్‌లో చిక్కుకు పోయాను. తక్కిన నలుగురు బోట్ తిరగబడటంవల్ల సముద్రంలో పడిపోయారు."

వాళ్ళు అతనికి బాగా దగ్గరగా వచ్చారు. అందులో అందరికన్నా పొడవుగా వున్న వ్యక్తి విక్టర్ ముఖం లోకి సూటిగా చూసి, "నువ్వా? నువ్వు విక్టర్‌వి కదూ....!?" అన్నాడు.

విక్టర్ నిర్ఘాంతపోయి అతని వంక చూశాడు. "నేను గుర్తొచ్చానా?" అతను విషపు నవ్వు నవ్వుతున్నాడు.

విక్టర్ అతని ముఖంలోకి చూసి ఉలిక్కిపడ్డాడు.

అతని ముఖంపై నిలువుగా ఏర్పడ్డ గాయం తాలూకు మచ్చ స్పష్టంగా కనిపించింది. వెంటనే అతనికి రెండేళ్ళ క్రితం జరిగిన సంఘటన గుర్తువచ్చింది. 'అవును వీడు....వీడు....అనుమానం లేదు—వాడే!' అనుకున్నాడు మనసులో.

రెండేళ్ళ క్రితం తను నావల్ ఫోర్స్‌నించి రిజైన్ చేసి రావటానికి ఆర్నెల్లముందు — తను, మరికొందరు నేవీ

ఆఫీసర్స్‌తో బాటు చీకటిపడ్డాక బయల్దేరి వస్తూండగా అనుమానాస్పద పరిస్థితుల్లో ఓ ప్రయివేటు మోటర్ బోట్ యెదురయింది వాళ్ళకు. అప్పుడు సందీప్, కపాడియా కూడా తన వెంట వున్నారు.

కపాడియా ఆ బోట్‌ని ఆపమని సైగ చేశాడు. కాని బోట్‌లో వున్నవాళ్ళు అతని సిగ్నల్‌ని చూసికూడా ఆపలేదు సరికదా వేగం మరింత హెచ్చించారు.

దాంతో తమకు అనుమానం హెచ్చింది. అప్పుడు సందీప్ తమ డిపార్ట్‌మెంటల్ స్టీమర్ నడుపుతున్నాడు. పది నిమిషాల్లో వాళ్ళను వెంట తరిమి బోట్‌ని పట్టుకున్నారు.

అందులో నలుగురు వ్యక్తులున్నారు.

కపాడియా రివాల్వర్ తీసి పట్టుకొని వాళ్ళని సరెండర్ కమ్మని, కాకపోతే కాల్చిపారేస్తానని బెదిరించారు.

సరిగ్గా అప్పుడే ఆ బోట్ నించి కాల్పులు మొదలయ్యాయి. కపాడియా, తను, తక్కిన యిద్దరు నావల్ ఆఫీసర్స్ చాలా లాఘవంగా కాల్పుల్నించి రక్షించుకున్నారు. సందీప్ చుట్టూ బులెట్ ప్రూఫ్ గ్లాసుంది. అతనికి బయట జరుగుతున్నదంతా కనిపిస్తూనే వుంటుంది. సందీప్ చాలా అలర్ట్‌గా స్టీమర్ నడుపుతున్నాడు.

కపాడియా కాల్పులు సాగించాడు. తక్కిన వాళ్ళు గన్స్ అందుకొని బోట్ మీదికి గురిచేసి వాళ్ళని సరెండర్ కమ్మని ఎనౌన్స్ చేశారు. కాని వాళ్ళు వినిపించుకోలేదు.

తామందరు గన్స్ ఉపయోగించారు. అవతల్నుంచి కాల్పులు ఆగిపోయాయి. బోట్‌కి రంధ్రాలుపడి నీరు

లోపలికి ఎక్కేసింది. బోట్ మునిగిపోయే సమయంలో తాము నలుగురు అందులోకి యెక్కి, ఆ బోట్‌లో యేముందో చూడాలని ప్రయత్నించారు.

సరిగ్గా అప్పుడే ఓ వ్యక్తి చేతిలో ఓ బ్రీఫ్ కేసుతో పారిపోవటానికి ప్రయత్నిస్తున్నాడు. తాను ఒక్కసారిగా వెనుకనుంచి అతన్ని పోనివ్వకుండా వాటేసుకున్నాడు.

అతను బ్రీఫ్ కేసుతో తనని నెత్తిమీద మోదాడు. తనకి కళ్ళముందు చుక్కలు కనిపించాయి.

అతని చేతిలో చాకుంది. దాంతో తనని గాయపరచబోయాడు. తను అతని చెయ్యి మెలితిప్పాడు. చాకు అతని ముఖంమీద నిలువుగా చీరుకుపోయింది. అతను చాలా బలిష్ఠుడు. ఆరడుగుల పొడవున్నాడు. చాలా క్రూరంగా వున్నాడు.

బ్రీఫ్ కేసుతో బాటు సముద్రంలోకి గెంతేశాడు. కపాడియా చేతిలోని రివాల్వర్ ఆరుసార్లు గర్జించింది. తనతో వున్న యిద్దరు సహచరులు గన్స్ ఉపయోగించారు. కాని అతను ఏమైపోయాడో తెలియలేదు.

బోట్‌లో ముగ్గురు వ్యక్తులు చచ్చిపడున్నారు. అప్పటికే బోట్ సగంవరకు మునిగిపోయింది.

ఈలోపల తాము నలుగురు బోట్ అంతా చకచక వెతికారు. బోట్ విదేశీయులదికాదు, స్వదేశీయులదే! స్మగ్లర్స్‌ది.

బోట్‌లో అక్కడక్కడ విదేశీ గూడ్స్ దొరికాయి. టేప్ రికార్డర్స్, ఆడియో వీడియో సెట్స్ ఎలక్ట్రానిక్ వాచ్‌లు — దొరికాయి. ఫారిన్ షిప్పులు ల్యాండయినపుడు, పోయి స్మగుల్డు వస్తువులు చవకగా కొని, వాటిని బొంబేలో చేర్చి నల్ల బజార్లో అధిక లాభాలకు

అమ్ముకునే స్మగ్లర్స్ వాళ్ళు!

కపాడియా, తక్కిన ముగ్గురు కలిసి చకచక ఆ సరుకులన్నీ తమ స్టీమర్లోకి మార్చేశారు. తర్వాత బోట్ సాంతం నీట్లో మునిగిపోయింది. పై ఆఫీసర్లకి తెలియకుండా ఆ సరుకులన్నీ తాము కాష్ చేసుకున్నారు ఆ తర్వాత.

తానప్పుడు క్వార్టర్సులోనే వుంటుండేవాడు. అది జరిగిన వారం రోజుల తర్వాత రాత్రి పన్నెండు గంటలకి తనకెవరో నిద్రలేపినట్టనిపించి లేచి కూచున్నాడు పక్క మీద. ఆ పక్క భార్యాపిల్లలు నిద్రపోతున్నారు. ఎవరో నడవలో నడుస్తున్నట్టయి మెలకువ వచ్చింది తనకి.

అడుగుల చప్పుడు వినిపించింది స్పష్టంగా. చటుక్కున లైటు వేశాడు.

ఎవడో ఆజానుబాహువైన వ్యక్తి చేతిలో రివాల్వర్తో తన పడకగది వైపే వస్తున్నాడు. తన గుండె ఒక్క క్షణం ఆగి కొట్టుకున్నది. జాగ్రత్తగా పరిశీలించి చూశాడు. ముఖంమీద నిలువునా గాయం తాలూకు మచ్చ—అప్పుడే మాను పట్టినట్టు స్పష్టంగా తెలుస్తోంది.

తనకి వెంటనే గుర్తు వచ్చింది—అతను వారంరోజుల క్రితం తాను గాయపరచిన స్మగ్లర్! నలుగుర్లోనూ గాయపడి తప్పించుకుపోయిన స్మగ్లర్! ఇప్పుడిక్కడికెందుకొచ్చాడు? తనమీద పగబట్టాడా?

తను ఆలస్యం చెయ్యలేదు. ప్రాణ రక్షణ కోసం తన దగ్గర నిత్యం దాచుకునే రివాల్వర్ని అందుకొని కిటికీ లోంచి కాల్చాడు ఆ వ్యక్తిని.

అతను యీ దాడిని ఎదుర్కోవటానికి సిద్ధంగాలేడు. ఎదురు తిరిగి కాల్చబోయాడు. కాని తను మరోసారి

గురిచూసి కాల్చాడు. ఈసారి గుండు అతని కాలికి గుచ్చుకుంది. అతను కుంటుకుంటూనే పారిపోయి గోడ దూకేశాడు.

మళ్ళీ అతను తనకి బొంబేలో వుండగా తారసపడలేదు. మరో ఆర్నెల్ల తర్వాత తను ఉద్యోగం చాలించుకుని హైద్రాబాద్ వచ్చేశాడు.

విక్టర్‌కి ఆ వ్యక్తిని చూడగానే గతమంతా ఒక్కసారిగా గుర్తువచ్చింది.

"ఇప్పుడు చెప్పు మైడియర్ విక్టర్... నువ్వు మిత్రులతో సముద్రయానం చేస్తున్నావు కదూ! ప్రమాదవశాత్తు నీళ్లలో పడిపోయావు, అవునా?...." అతను హేళనగా నవ్వుతున్నాడు.

విక్టర్ ఏం మాట్లాడకుండా అతని వంకే చూస్తున్నాడు.

"నీకోసం చాలా వెతికాను. కాని నువ్వు నేవీనుంచి రిజైన్ చేసి వెళ్ళిపోయావని తెలిసింది. ఎంత ప్రయత్నించినా నీ అడ్రసు దొరకలేదు. లేకుంటే రెండేళ్ళ క్రితమే నువ్వెక్కడున్నా వెంటాడి వేటాడి చంపివుండేవాడ్ని. చూడు, నువ్వానాడు కత్తితో చేసిన గాయం నా మొహంమీద నా ప్రతీకారాన్ని గుర్తుచేస్తూ ఎలా మిగిలిపోయిందో...." అతను హిందీలో మాట్లాడుతున్నాడు. విక్టర్‌కి హిందీ బాగా వచ్చును.

"ఆ రోజు నిన్ను వెంటాడింది నేనొక్కడ్నే కాదు గదా! నీ కెందుకు నామీద కక్ష?"

"ఎందుకా? నన్ను వాళ్ళెవరూ గాయపర్చలేదు. నువ్వే రెండుసార్లు గాయపరిచావు. మొదటిసారి ముఖం మీద గాయంతో పదిరోజులు మాత్రమే బాధపడ్డాను.

కాని, నా కాలికి నువ్వు చేసిన గాయం రెండు నెలల వరకు నన్ను మంచంమీదనుంచి లేవనియ్యలేదు. చూడు."

అతను తన కుడికాలును చూపించాడు. కర్రకాలు లాగేశాడు. కాలు మోకాలివరకు తీసేశారు.

విక్టర్ మాట్లాడకుండా అతని మొండికాలువైపే చూస్తున్నాడు.

అతని కళ్ళల్లోకి రక్తపు జీరలు వచ్చాయి. కర్రకాలును మళ్ళీ బిగించి కట్టుకొని, విక్టర్ కళ్ళలోకి సూటిగా మాసి;

"నీ ఫ్రెండ్స్ నలుగురి పేర్లు నాకు తెలును. కపాడియా, సందీప్, కపూర్, జేమ్స్! కపూర్ సముద్రంలో పడి మరణించాడు. జేమ్స్ వైజాగ్ ట్రాన్స్‌ఫర్ మీద వెళ్ళిపోయాడు. పోతే కపాడియా సందీప్‌లమీద మా పగ తీర్చుకోవటానికి సరైన సమయం, అవకాశం దొరకలేదు. నా మటుకు నువ్వే ప్రత్యక్ష శత్రువువి! ఇన్నాళ్ళకి ఇక్కడ ఒంటరిగా దొరికావు. నిన్నిక ప్రాణాలతో వదలను....అయితే నిన్ను ఒక్కసారే చంపెయ్యను. కొద్ది కొద్దిగా చంపుతాను. చిత్రవధ చేసి చంపుతాను" అన్నాడు.

విక్టర్ ఆ పరిస్థితినుంచి యెలా తప్పించుకోవాలా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

మరోపక్క కపాడియా, సందీప్‌లమీద పగ తీర్చుకోవటానికి అవకాశం, సమయం దొరకలేదని చెప్తున్న అతని మాటల్లోని నిజాయితీ గురించి ఆలోచిస్తున్నాడు. ఆ గోడౌ కాల్పులు జరిపిన వారిలో కాపాడియానే ప్రముఖుడు! సందీప్ పడవలోకి రానేలేదు. స్టీమర్ నడపటంవరకే అతను చేసిన పని!

అతని చేతిలో పొడవాటి కత్తి ప్రత్యక్షమయ్యింది. అతను విక్టర్‌ని సమీపించాడు.

విక్టర్ తప్పించుకోవటానికి సందివ్వకుండా తక్కిన ముగ్గురు మూడు పక్కలా నించున్నారు. వాళ్ళ చేతుల్లో గన్స్ వున్నాయి. తను తప్పించుకోవటాని కేమాత్రం ప్రయత్నించినా నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తారు.

అతను దగ్గరగా మరింత దగ్గరగా వచ్చి సూటిగా విక్టర్ కళ్ళలోకి చూసి, "నీలో చెలరేగుతున్న అనుమానాలు తీర్చి మరీ చంపుతాను. కపాడియా, సందీప్‌ల నెందుకు వదిలేశానో తెలుసా? జేమ్స్‌తోబాటు వాళ్ళిద్దరు నాకు స్మగ్లింగ్ లో నేటివరకు చాలా సాయం చేశారు, చేస్తున్నారు. జేమ్స్ వెళ్ళిపోయినా వీళ్ళిద్దరు నాకు మీ డిపార్టుమెంటుకి, కస్టమ్స్ డిపార్టుమెంటుకి దొరక్కుండా సాయం చేస్తున్నారు.

మేము మామూలు మోటార్‌బోట్స్‌లో స్మగ్లింగ్ చేయటం ప్రమాదకరమని అండర్ వాటర్ బిజినెస్ మంచిదని సలహా యిచ్చింది వాళ్ళే! అందుకనే యీ సబ్‌మెరీన్ సంపాదించాం—కోట్లతో వ్యాపారం చేసే మాకు యిలాంటి సబ్‌మెరీన్స్ ఓ లెక్కా....? అర్థమైందా, మేం చట్టానికి దొరక్కుండా ఎలా స్మగ్లింగ్ విజయవంతంగా చేస్తున్నామో....!?" వికటంగా నవ్వుతూ కత్తితో విక్టర్ ముఖంమీద నిలువునా గాటు పెట్టాడు.

విక్టర్ బాధతో అరిచాడు. ముఖంమీదినుంచి నోటికి రక్తం ధారగా కారింది. పళ్ళ బిగువున భరించాడు.

అతను విషపు నవ్వు నవ్వి, "ఎలా వుంది? చల్లగా వుంది కదూ! మా ఎలక్ట్రానిక్ గూడ్స్ ఆ రోజు మీ

రందరు పంచుకున్నారు కదూ! ఆఫ్టరాల్ కొన్ని వేలు సంపాదించి వుంటారు, అందులో నీ వాటాకి పదివేలు కూడా వచ్చి వుండదు. కాని యీ రోజు మేం బంగారు బిస్కట్లుతోను, అపురూపమైన రత్నాలతోను అమూల్యమైన వజ్రాలతోను బిజినెస్ చేస్తున్నాం. కోట్లతో వ్యాపారం! నీ కక్కూడా వాటా కావాలా. చెప్పు!?" అంటూ యీసారి అతని యెడమ బుగ్గమీద గాటు పెట్టాడు.

విక్టర్ కి భరించలేనంత బాధగా వుంది! అతనిమీదికి కలియబడి ఆ కత్తితోనే అతని ప్రాణాలు తీయాలనిపించింది.

కాని మూడు డబుల్ బారెల్ గన్స్ తన గుండెలకే సూటిగా గురిచేయబడున్నాయని, తను అడుగు కదిపిన మరుక్షణం తన గుండెల్లో గుళ్ళు గుచ్చుకుంటాయని గుర్తు వచ్చి ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

అతను వికటంగా నవ్వుతున్నాడు. "ఏం భాయ్, చాలా హాయిగా వుంది కదూ! లెటజ్ హేవ్ ఎ ఫ్రెండ్లీ గెట్ టుగెదర్ డిన్నర్!" అంటూ యేదో సూపు వున్న పాత్రను అతని కందివ్వబోతున్నట్టు ముందుకు చాచి, విక్టర్ మొహాన చల్లాడు.

విక్టర్ గాయాలు భగ్గుమన్నాయి. "అబ్బా!" అంటూ పెద్దగా కేక పెట్టాడు భరించలేని బాధతో. వాళ్ళు నలుగురు పెద్దగా నవ్వుతున్నారు.

## 10

"అదిగో, మళ్ళీ కనిపిస్తున్నాయి లైట్లు! ఖచ్చితంగా యేదో మోటార్బోటో. స్టీమరో అలలమీద పడుతూ లేస్తూ వస్తోంది" అన్నాడు సందీప్. నిరంజన్ అటు

చూశాడు.

ఇప్పుడు వర్షం, హోరు, వుధృతం అంతగా లేవు. తుఫాన్ వర్షం అలాగే వుంటుంది. అప్పటికప్పుడే కుండ పోతగా వర్షం అంతలోనే తెరిపిడి పడినట్లుంటుంది. మరు క్షణం గాఢంగా మబ్బులు మూసి మిన్నూ మన్నూ ఏకం చేస్తూ వర్షిస్తుంది!

"అదేమిటి, ఆ పడవ గమ్యం లేకుండా అలా ఎగి రెగిరి పడుతూ పోతోంది? సరిగా గమనించారా?" అడిగాడు నిరంజన్.

సందీప్ పరీక్షగా చూసి తలాడించాడు.

ఇద్దరు వేగంగా అటు యీదుకుంటూ వెళ్లారు.

పడవ ఇంజన్ ఆగిపోయి వుంది. కేవలం అలల వాలులో కొట్టుకొనిపోతోంది.

సందీప్, నిరంజన్ వంక చూసి, "లోపల యెవరూ లేనట్టుంది. వెంటనే మనం దీంట్లోకి ఎక్కి తాత్కాలిక రక్షణ పొందవచ్చు. కమాన్, యీ పక్క నీటిమీదికి గొలుసు వేలాడుతోంది నేను యెక్కుతున్నాను. నా వెనకే యెక్కెయ్యండి" అన్నాడు గొలుసు పట్టుకొని ఎక్కుతూ.

నిరంజన్ అతని వెనక నే గొలుసు పట్టుకొని సందీప్ తో బాటు పడవ ఎక్కేశాడు.

సందీప్, నిరంజన్ లైట్ల వెలుర్లో పడవ లోపల పరీక్షగా చూశారు. ఎవరూ లేరు.

ఇద్దరు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. సందీప్ ఇంజన్ కేబిన్ వైపు నడిచాడు.

"లైట్లు వెలుగుతున్నాయి కాబట్టి ఖచ్చితంగా బ్యాటరీ పనిచేస్తోందన్నమాటే! మన అదృష్టం బావుంటే

ఇంజన్ కూడా స్టార్ట్ కావచ్చు" అంటూ ఇంజన్ స్టార్టు చేయటానికి ప్రయత్నించారు.

స్టార్ట్ కాలేదు. స్విచ్‌లన్నీ తడిమాడు. వైర్లు తడిసి పోయి వున్నాయి. ఇంజన్ దగ్గర నీళ్ళు! ఇంజన్ ఎందు కాగిపోయిందో అర్థమైంది.

నిరంజన్ అతనివంక ప్రశ్నార్థకంగా చూశాడు. సందీప్ తదేకదీక్షతో ఇంజన్ స్టార్టు చేయటానికి సకల ప్రయత్నాలు చేస్తున్నాడు.

సందీప్ శ్రమ ఫలించింది. ఇంజన్ స్టార్టయింది. అంత దాకా యిష్టం వచ్చినట్టు అటు నిటు ఊగిసలాడుతూ నడుస్తున్న పడవ సందీప్ కంట్రోల్లోకి వచ్చింది. ఇంధనం లెవెల్ చూశాడు. సంతృప్తికరంగా వుండటమే గాక, జెర్రీకేన్స్‌లో నింపివున్నాయి.

నిరంజన్ ఆనందంగా చూస్తున్నాడు సందీప్ వంక. తామిద్దరు చాలా అదృష్టవంతులు. తమ ప్రాణాలు నిలబడి పోయినట్టే! మరో అదృష్టమేమిటంటే, తుఫాన్ చెదిరి పోయింది.

నిరంజన్ వాచ్ చూసుకున్నాడు. తెల్లవారు ఝామున మూడు గంటలు కావస్తోంది. అయితే యిప్పుడు చీకటి అనే బాధ లేదు. బోట్‌లోని లైట్లు సముద్రం మీద కొంతవరకు వెలుగును వ్యాపింప చేస్తున్నాయి.

"హెడ్ క్వార్టర్సుకి వెళ్ళిపోదామా?" అన్నాడు సందీప్ హుషారుగా.

ఇద్దరు డైవింగ్ డ్రస్ విప్పేశారు. వీపుమీదినుంచి సిలిండరు తీసెయ్యగానే కొండంత బరువు దిగిపోయినట్టని పిస్తోంది.

నిరంజన్ సందీప్ వైపు సూటిగా చూసి "మరి, మన ఫ్రెండ్సు విషయం చూడొద్దా? కపాడియా ఎలాగో పోయారు. రాజా విక్టర్ జాడ తెల్సుకోకుండా వెళ్ళి పోవటమేనా?" అన్నాడు.

అతనికి వాళ్ళిద్దరి సంగతి తల్చుకుంటే మనసు బరువెక్కిపోతోంది. అత్యాశకు పోయి ప్రాణాలమీదికి తెచ్చుకున్నారు! అసలు విక్టర్ ప్రపోజ్ చెయ్యకపోతే తను, రాజా హైదరాబాద్ నించి కాలు కదిపేవారేనా!?

సందీప్ నిరంజన్ వైపు తిరిగిచూసి "చూడు బ్రదర్! వాళ్ళిద్దరి విషయం మర్చిపో! నా అభిప్రాయమేమిటంటే కపాడియాలాగానే వాళ్ళు కూడా ఏ జలచరాల పాల బడో ప్రాణాలు పోగొట్టుకుని వుంటారని! ఇది సముద్రం! దీని అడుగున అసంఖ్యాకమైన జీవరాసులు. అందులో మనుషుల్ని ముక్కలు చేసుకు తినేయగల చేపలే ఎక్కువ! వీళ్ళనికూడా...." అంటుండగా నిరంజన్ వారించాడు.

"....ప్లీజ్! అలా అనొద్దు వాళ్ళిద్దరు బతికే వున్నారని నా సిక్స్త్ సెన్స్ చెపుతోంది. దయచేసి కాసేపు వెతుకుదాం. ఎలాగూ రెండుగంటల్లో తెల్లారబోతోంది. తెల్లారేలోపల దొరికారా సరే, లేకుంటే మీరన్నట్టు ఏదో జరిగివుండాలి! అప్పుడిక హెడ్ క్వార్టర్సుకే పోదాం" అన్నాడు.

సందీప్ ఏదో ఆలోచిస్తున్నాడు. ఇంతలో అతడి దగ్గరున్న గోల్డు డిటెక్టర్ నుంచి ఏవో సంకేతాలు ఆరంభమయ్యాయి. సందీప్ దుస్తుల్లోంచి దాన్ని బయటకు తీసి ఆనందాశ్చర్యాలతో డయల్ వంక చూశాడు.

రెడ్ బల్బు వెలిగి ఆరిపోతూ 'ఏరోమార్కు' డైరక్షన్

చూపుతోంది!

ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోయాడు సందీప్. తాము అయిదుగురు సముద్రంలో పడిపోయేటప్పుడు కపాడియా దగ్గర్నుంచి దాన్ని తీసుకుని తన దగ్గర పెట్టుకున్నాడు. అయితే ప్రాణంకోసం పాకులాడే సమయంలో దాని విషయమే మర్చిపోయాడు.

కాని, యిప్పుడు అది బంగారాన్ని కనిపెడుతోందన్న మాట! బహుశా ఐరన్ బాక్స్‌లో బంగారం బయటికి తొంగిచూస్తోందేమో! అందుకే మెటల్ డిటెక్టర్ అవసరం లేకుండానే యిది పనిచేస్తోంది!?

నిరంజన్ ఆశ్చర్యంగా సంభ్రమంగా సందీప్ వంక చూశాడు.

సందీప్ అతనివంక తిరిగి "లోపల ఎక్కడైనా నైలాన్ తాడుగాని, లంగరు వేసే గొలుసుకాని వుందేమో చూడు, క్విక్!" అన్నాడు, బోట్ వేగం బాగా తగ్గించేసి.

నిరంజన్ పడవ వెతికి, "ఏమీలేవు. మనం ఎక్కి వచ్చిన గొలుసు మాత్రం నీట్లోకి వేలాడుతోంది" అన్నాడు.

"దాన్ని పైకి చేదుకో! ఎంత పొడవుందో చూద్దాం. మనకి చాలా పొడవైన తాడు, దాదాపు నీటి అడుగు భాగానికి తగిలేటంత పొడవైన తాడు కావాలి! దానికి చివర కొక్కెం తగిలించుదాం.

అదృష్టవశాత్తు మన అయిదుగురం కట్టుకున్న తాడు చివరి భాగం నా నడుముకే వున్నది. అవతలి చివర జలచరాలు కొరికేసినా యివతలి చివర అయస్కాంత క్షేత్రమున్న రాడ్ మిగిలింది. తాడుకి యీ

రాడ్ కట్టి నీటి అడుక్కి వదిలేద్దాం. ఆ బాక్సులు యీ రాడ్ కి ఆకర్షించబడతాయి. చూడు, చూడు. బాగా వెతుకు. తెల్లారిపోతే మళ్ళీ అవకాశం చేజారిపోతుంది. తుఫాన్ తగ్గిపోయింది. నావలు, బోట్లు సముద్రంమీద తిరగటం మొదలెడతాయి."

ఊరికే తొందరపడిపోతూ హడావిడిగా ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు సందీప్ స్టీరింగ్ దగ్గర్నుంచి.

నిరంజన్ నిర్విరామంగా బోట్లో తాడుకోసం వెతుకుతున్నాడు. కాని అతని మనసులో రాజు అమాయకమైన ముఖం, అతని గురించిన ఆలోచనలు ఆక్రమించుకుని మనసు భారమైపోయింది.

డబ్బుఆశ ఎంత చెడ్డది! చివరికి ప్రాణాలకి కూడా తెగించి సముద్రంమీద అన్వేషణకి ప్రేరేపించింది. కపాడియా ప్రాణాలు బలిగొన్నది. విక్టర్, రాజు కూడా బతికున్నారో.... లేదో....!?

సందీప్ కేకలతో యీ లోకంలోకి వచ్చాడు నిరంజన్. "వెతుకుతున్నావా? నిద్రపోతున్నావా?" అంటున్నాడు సందీప్.

నిరంజన్ పడవలోని ప్రతి అంగుళం వెతుకుతున్నాడు.

## 11

"నన్ను నమ్మండి. నేను గూఢచారిని కాదు. నీట్లో పడిపోయి ఒడ్డుకు యీదుకు పోవాలనే ప్రయత్నంలో మీకు దొరికాను, అంతే!" అన్నాడు రాజు. అతనికి నిస్సహాయతతోను, ఉక్రోషంతోను కంటనీరు తిరిగింది.

కెప్టెన్ రాజు సమీపించి అతని రెండు చెంపలు ఛెళ్ళు ఛెళ్ళున వాయించాడు.

"నువ్వు బాగా ముండివాడిలాగా వున్నావు. మా సైని

కులతో యిన్ని మాటలుండవు. మాకు ద్రోహం తలపెట్టిన వాడి కుత్తుక ఉత్తరించటమే మాకు తెలిసిన శిక్ష! ఎందుకనవసరంగా ప్రాణాలు పోగొట్టుకుంటావు?! నిజం చెప్పు." అన్నాడు కర్కశంగా.

రాజు ప్రాణాలమీద ఆశ పూర్తిగా వదిలేసుకున్నాడు. అతనికి నచ్చచెప్పటం అనవసరం!

కెప్టెన్ సూటిగా అతనివంక చూసి "కేవలం విహారార్థం సముద్రయానం చేయబోయేవాళ్ళు యింత ప్లాన్డ్‌గా ఆక్సిజన్ సిలిండర్లు, డైవింగ్ డ్రస్ వేసుకుని బయల్దేరరు. సమ్‌థింగ్ రాంగ్ విత్ యూ! నిజం చెపితే నీకేలాంటి హానీ చెయ్యకుండా వదిలేస్తాం. కమాన్, టెల్ ది ట్రూత్!" అనునయంగా చెప్పాడీసారి. చంపుతానని బెదిరిస్తున్నాడే గాని, రివాల్వర్ ప్రయోగించటంలేదు.

అంటే, తననించి సమాచారం రాబట్టాలని విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు కెప్టెన్. తను నిజం చెప్పేస్తే?! ఏమో, అది కూడా అబద్ధమని వాళ్ళు కొట్టిపారేస్తే! పైగా ఎప్పుడో నీట మునిగిపోయిన గోల్డు బాక్స్‌ల గురించి యీనాడు బయల్దేరి వచ్చామంటే నవ్వరా!?

రాజు ఎటూ తేల్చుకోలేకపోతున్నాడు.

కెప్టెన్ రాజు ముఖంలో మారుతున్న రంగుల్ని చాలా తేలిగ్గా గుర్తించాడు. అతనేదో చెప్పాలని చెప్పలేక పోతున్నాడని గ్రహించాడు.

"కమాన్ మిస్టర్! నువ్వు చెప్పటానికి సంకోచించకు. నువ్వు చెప్పేది నిజమని నాకనిపిస్తే నీకేలాంటి అపకారం చెయ్యను. నిన్ను మీ దేశానికి క్షేమంగా పంపించేస్తాం. లెట్ మి నో ది ట్రూత్!" మళ్ళీ అనునయంగా అడిగాడు కెప్టెన్.

రాజు వాళ్ళందర్నీ ఓసారి పరీక్షగా చూశాడు. వాళ్ళేదేశస్థులైనా డ్యూటీలోవున్న నేవీ ఆఫీసర్స్! తను ఆత్యాశతో, అక్రమంగా బంగారం సంపాదించటానికి దురాశాపరులతో చేతులు కలిపిన స్వార్థపరుడు! హాయిగా బ్యాంక్‌లో వుద్యోగం చేసుకుంటూ వచ్చే జీతంతో భార్యా బిడ్డలతో సంసారం సుఖంగా సాగిపోతుంటే తీరి కూచుని విక్టర్ చూపిన ప్రలోభానికి లోబడి దారి తప్పాడు. తన స్వార్థానికి, అక్రమ ప్రవర్తనకి శిక్ష అనుభవించాల్సిందే!

అంగ్లంలోనే అంతదాకా సంభాషణ సాగుతోంది.

రాజు కెప్టెన్ వంక చూసి, "మీరు నమ్మతారనే విశ్వాసంతో నిజాన్ని మీకు చెప్పేస్తున్నాను. అయిదుగురు స్నేహితులం మేం. మూడు సంవత్సరాల క్రితం ఈ పరిసర ప్రాంతాల్లో గల్ఫ్ కంట్రీస్ నుంచి బొంబేవస్తున్న నావ మునిగిపోయింది. దాంట్లో ఎనిమిది బంగారంతో నిండి వున్న పెట్టెలున్నాయి. నా స్నేహితులికి ఆ విషయం అప్పట్లోనే తెలిసి సముద్రంలో తీవ్రంగా గాలించారు. కాని, వాళ్ళకి దొరకలేదు.

ఈ మధ్య జంబోజెట్ విమానం కూలిపోయినపుడు శిథిలాలకోసం అన్వేషణ కొనసాగిస్తుండగా ఓ పెట్టె బంగారం భారత ప్రభుత్వ సిబ్బందికి దొరికిన విషయం మీకు తెలిసేవుంటుంది. ఆ పెట్టె అప్పుడు మునిగిపోయిన ఎనిమిది పెట్టెల్లోను ఓ పెట్టె అయివుంటుందని నా స్నేహితులు ఊహించి వాటిని వెతకటానికి నన్ను తీసుకుని బోట్‌లో బయల్దేరి వస్తుండగా తుఫాన్‌లో చిక్కి బోట్ మునిగిపోయింది...." చెప్పాడు రాజు.

కొంతసేపటి వరకు కెప్టెన్‌తో బాటు ఆ షిప్‌లో

వున్న వాళ్ళంతా ఆశ్చర్యంనుంచి తేరుకోలేదు.

"వ్వాట్? అయితే ఆ తక్కిన నలుగురు ఏరి? వాళ్లేం చేస్తుంటారు?" అడిగాడు కెప్టెన్.

రాజు మస్తిష్కం చాలా చురుగ్గా పనిచేసింది. ఇండియన్ నేవీలో పనిచేస్తున్నారనే నిజం చెపితే, భారతదేశ ప్రతిష్ఠకే భంగకరం! ఎవరో కొద్దిమంది అవినీతి పరులైన దేశద్రోహులవల్ల యావద్భారత దేశానికే తలవంపులు రానివ్వకూడదు!

రాజు వెంటనే "వాళ్ళు నాతోబాటు హైద్రాబాద్‌లో పనిచేస్తున్నవాళ్ళే!" అన్నాడు కెప్టెన్‌తో.

కెప్టెన్ అనుమానంగా చూశాడు. "నువ్వేం చేస్తుంటావు హైద్రాబాద్‌లో?" అడిగాడు.

"బ్యాంక్‌లో కేషియర్ని."

"అలాగా! అయితే నీతో వచ్చిన నలుగురు నేహితులు కూడా నీ కొలీగ్సేనా!?"

రాజుకి అతనలా ఎందుకు రెట్టించి అడుగుతున్నాడో అర్థమయ్యింది. మామూలు సివిలియన్స్‌కి సముద్రంలో మునిగిపోయిన నావలో బంగారమున్న రహస్యమెలా తెలుస్తుంది? అది కేవలం నావల్ ఫోర్స్‌కి మాత్రమే తెలుసుకోవటాని కవకాశముంటుంది.

రాజు తడుముకోకుండా చెప్పాడు. "నలుగుర్లోను ఒకతను ప్రైవేట్ ఫర్మ్‌లో పనిచేస్తున్నాడు తక్కిన ముగ్గురో ఒకతను ఎక్స్ నావల్ ఆఫీసర్."

కెప్టెన్ సంతృప్తిపడ్డట్టు అతని ముఖంలో వచ్చిన మార్పుల్ని బట్టి గ్రహించాడు రాజు.

"ఆల్‌రైట్! నువ్వు నిజం చెపుతున్నావని మాకింకా పూర్తి నమ్మకం కుదర్లేదు. నావ మునిగిపోయిన స్పాట్

నీకు తెలుసా?”

“ఆ స్పాట్ నేను చెప్పిన ఆ ఎక్స్‌నావల్ ఆఫీసర్‌కి మాత్రమే తెలుసు! మేం నలుగురం అతనికి సాయంగా మాత్రమే వచ్చాం. నేను నీటిలో ఎక్కడపడ్డానో, అక్కడ్నుంచి తుఫాన్ తాకిడికి గురై అలలు ఎంత దూరం నన్ను విసిరాయో నాకు తెలియదు. దాదాపు అయిదారుగంటలు నీట్లో ఎటో పక్కకు నెట్టివేయబడుతూనే వున్నాను.”

“ఉహూఁ! నీటిలో మనుషుల్ని కొరుక్కుతినే సొరలు, భయంకర సముద్ర జీవాలు నీకు ఎదురు కాలేదా? అయిదారు గంటలు నీటిలో కొట్టుకుపోయినా నిన్నవి ఏమీ చెయ్యలేదా? క్వైట్ ఇంట్రస్టింగ్!”

“నిజం సర్! కేవలం అదృష్టమే నన్నింతవరకు కాపాడింది. నేను బతికుంటానని కల్లోకూడా ఊహించలేదు. నీటిలో మునిగిపోయినపుడే బతుకుమీద ఆశ వదిలేసుకున్నాను.”

“ఆల్‌రైట్! మేమే నావ మునిగిపోయిన ఆ స్పాట్‌కి వెళ్ళివుండేవాళ్ళం! కాని అది భారత ప్రభుత్వానికి సంబంధించిన ప్రాంతమయివుంటుంది. మేము అక్కడికి ప్రవేశించకూడదు. దురాక్రమణగా పరిగణిస్తారు. సరిహద్దు గస్తీదళాలతో యుద్ధానికి దిగవలసి వస్తుంది. ఈ విషయం మేం మీ ప్రభుత్వ నావల్ ఫోర్స్‌కి వైర్లెస్‌లో వెంటనే తెలియచేస్తాం. తరువాతి పని వాళ్ళే చూసుకుంటారు.” అన్నాడు కెప్టెన్.

రాజాకి అతని పాలసీ బాగా నచ్చింది. అంతదాకా పొరుగు రాజ్యాలన్నీ దురాక్రమణానికి అవకాశం దొరికితే చాలు, భారతదేశంమీద దాడికి సిద్ధమవుతాయని తన అభిప్రాయాన్ని ఆ క్షణంలోనే మార్చేసుకున్నాడు.

కాని, రాజుకి తెలియని విషయం మరొకటి వున్నది. పైకి ధర్మపన్నాలు పలికిన ఆ విదేశీ కెప్టెన్ అప్పటి కప్పుడే తమ జలాంతర్గాముల్ని రెండిటిని భారత జలాల్లోకి రహస్యంగా ప్రవేశించటానికి ఆదేశాలిచ్చాడని, ఆ స్పాట్ లో బంగారం కోసం వెతకటానికి సిబ్బందిని ఆఘమేఘాలమీద పంపించటానికి అన్ని ఏర్పాట్లు చేశాడనీ, రాజుకు తెలియదు.

రాజుకి అతిథి మర్యాదలన్నీ ఘనంగా ఏర్పాట్లు చేయించాడు కెప్టెన్.

ముందుగా వేడి వేడి టీ అందజేశారు. అతను డైవింగ్ డ్రస్ మార్చుకుని, వేరే దుస్తులు తొడుక్కోవటానికి యేర్పాట్లు చేశారు. అతనికి తినటానికి రొట్టెలు యిచ్చారు.

రాజుకి వెచ్చగా వుండటానికి షిప్ లో ప్రత్యేకంగా యేర్పాటు చేసిన సెగదు ముందు కూర్చుండ చేశారు.

రాజు వాళ్ళ మర్యాదలు చూసి ముచ్చటపడి పోయాడు. ఇంత కర్టియస్ గా వ్యవహరిస్తూన్న ఆ విదేశీయులకి పదే పదే కృతజ్ఞతలు తెలియజేసుకున్నాడు.

కాని, ఆ మర్యాదల వెనక మరణం పొంచి వున్నదని గాని, బంగారం వాళ్ళ చేత చిక్కగానే తనని ముక్కలుగా నరికేసి సముద్రంలోని జీవరాశికి ఆహారంగా వేస్తారని, తన జీవితానికి అది చరమాంకమని అతనికి తెలియదు!

## 12

విక్టర్ బాధతోను, నిస్సహాయతతోను, అవమానంతోను, భగ్నమంటున్న గాయాలతో, భగ్గుమంటున్న

మనసుతో, పళ్ళ బిగువున బాధను భరించి ఆ నలుగురి వైపు చూస్తున్నాడు.

మూడువైపుల తుపాకులు తనవైపు గురి చేయబడి వున్నా వాళ్ళు అంత ఎలర్ట్‌గా లేరని క్షణంలో చూసి గుర్తించాడు విక్టర్. ఎదురుగా కత్తితో అతను!

అతని ముఖాన్ని తను కావాలని గాయపరచలేదు. కాని అతను తన రెండు బుగ్గలమీద కావాలని గాయాలు కల్పించాడు. అతను తన నివాసంలోకి వచ్చి తనని చంపటానికి ప్రయత్నిస్తూన్న సమయంలో నే ప్రాణరక్షణార్థం అతన్ని కాల్చాడు. గుండు కాలిలో గుచ్చుకుని బతికి పోయాడుగాని, తను ఎలర్ట్‌గా కాల్చివుంటే అప్పుడే చచ్చి వుండేవాడు. తన కీ పాట్లుండేవి కావు!

అతను కత్తితో మళ్ళీ విక్టర్‌ని సమీపించాడు. ఈ సారి విక్టర్ ఛాతీమీద నిలువునా స్వరుమంటూ కత్తితో గాటు పెట్టాడు.

సున్నితమయిన స్థలాల్లో అతడలా హింసించటం విక్టర్‌కి దుర్భరంగా వుంది. ఈ చిత్రహింసకన్న ఒకేసారి చావటమే సుఖమనిపించింది. చచ్చేటపుడు వాళ్ళతో పోరాడి, వీలయితే వాళ్ళని కూడా చంపెయ్యాలి!

విక్టర్‌లో మొండిధైర్యం చోటుచేసుకుంది. అతను 'సూప్' వున్న పాత్రను అందుకున్నాడు గాయంమీద చల్లటానికి!

సరిగ్గా అదే సమయంలో మెరుపు వేగంతో తన కుడి వైపు నున్న అనుచరుడిమీదికి లంఘించాడు విక్టర్. అతను యీ దాడి నెదుర్కోవటానికి సిద్ధంగా లేడు.

విక్టర్ అతన్ని తలమీద బలంగా కొట్టి, అతని చేతి లోని డబుల్ బారెల్ గన్ చేజిక్కించుకున్నాడు. మెరుపు

వేగంతో నాయకుడ్ని, ఓ అనుచరుడ్ని కాల్చేశాడు. అనుచరు లిద్దరూ గన్స్ పొజిషన్‌లోకి తెచ్చుకునేలోపల యిది జరిగిపోయింది.

ఇక ఒకే ఒక అనుచరుడు మిగిలాడు. విక్టర్ చేతి లోని గన్‌లో గుళ్ళు లేవు! అనుచరుడు టప టపమంటూ రెండుసార్లు కాల్చాడు. కాని విక్టర్ వూహించనంత వేగంతో నేలమీద అమాంతం దొర్లిపోయి అతని కాళ్ళకు తన కాళ్ళు పెనవేసి కింద పడేశాడు.

గుండు తగిలిన అనుచరుడు వెంటనే చనిపోయాడు గాని, నాయకుడు కొనప్రాణంతో వున్నాడు. అతని చేతిలో విక్టర్‌ని గాయపరచిన కత్తి అలాగే వున్నది. దాన్ని పొజిషన్‌లోకి తెచ్చుకున్నాడు. కష్టంమీద చేతిని పైకెత్తి విసిరాడు.

అప్పటికే అనుచరుడు, విక్టర్ ఒకరితో ఒకరు కిందు మీదవుతూ ముష్టియుద్ధానికి తలపడ్డారు. నాయకుడు విసిరిన కత్తి, విక్టర్‌కే గురిపెట్టబడినా, వాళ్ళిద్దరూ కిందు మీదు కావటంతో అనుచరుడి వెన్నులో గుచ్చుకున్నది కత్తి.

అంతే! అతను విక్టర్‌ని వదిలేసి పక్కకి తిరిగాడు. ఆ స్ప్లిట్ సెకండ్‌ని తన కనువుగా మార్చుకున్నాడు విక్టర్. కత్తిని అనుచరుడి వెన్నులో నుంచి లాగి మళ్ళీ అదేచోట రెండుసార్లు పొడిచాడు.

అంతే! వాడు వెంటనే ప్రాణాలొదిలేశాడు, వెన్ను పూస నుజ్జయిపోయి.

విక్టర్ ఒక్క వూపులో లేచి నాయకుడి దగ్గరకు గెంతాడు కత్తితో.

"ఏరా, నువ్వింకా ప్రాణాలతోనే వున్నావా? నన్ను

చిత్రహింసలకు గురిచేస్తావు కదూ? ఇప్పుడు నిన్ను ముక్కలు ముక్కలుగా కోసి జలచరాలకు విందు చేస్తాను" అంటూ కత్తితో నాయకుడి శరీరంలో అందిన చోటల్లా కసిగా పొడిచాడు.

నాయకుడి కళ్ళు విక్టర్ వంక అలా చూస్తూనే వున్నాయి. కాని అతని ప్రాణాలు యెప్పుడో అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

విక్టర్ శత్రుసంహారం జరిగిందని తృప్తిగా లేవబోయాడు—కాని శత్రు శేషం యింకా మిగిలే వున్నది.

విక్టర్ గన్ లాక్కున్న అనుచరుడు స్పృహ తప్పి నేలమీద పడ్డాడేగాని చావలేదు. విక్టర్ మీద ఒక్కసారిగా వెనుకనుంచి దాడి చేశాడు.

లేవబోతున్న విక్టర్ సబ్ మెరీన్ బాడీలో బోర్లా పడిపోయాడు. అనుచరుడు తుపాకీని లోడ్ చేసుకోవటానికి ఒక్క క్షణం ఆలస్యం చేశాడు.

విక్టర్ ఆ సమయాన్ని సద్వినియోగం చేసుకున్నాడు. నేలమీద పడివున్న ఖాళీ గన్ అందుకొని మడమతో ఆ అనుచరుడి తలమీద ఫెడీమని కొట్టాడు.

అంతే! మరుక్షణం ఆ అనుచరుని తల పగిలి, నెత్తురు మడుగులో పడి గిలగిల్లాడాడు. విక్టర్ మరోసారి వాడి తలమీద మోదాడు.

అనుచరుడి శ్వాస శాశ్వతంగా ఆగిపోయింది.

విక్టర్ బాగా అలసిపోయాడు. పదినిమిషాల వరకు అలసట తీర్చుకోవటానికి అలాగే కూర్చుండిపోయాడు నిస్త్రాణగా.

ఆటోమాటిక్ సిస్టంతో పనిచేసే అధునాతనమైన ఆ సబ్ మెరీన్ తన దారిన మెల్లగాపోతూనే వున్నది అంత

సేవూ! విక్టర్ లేచి సబ్ మెరీన్ కేబిన్ లోకి వెళ్ళాడు. దాన్ని ఆపరేట్ చేయటం అతనికి బాగా తెలుసు. ఇప్పుడు ఆ జలాంతర్గామికి తను ఏకైక యజమాని. తన అదృష్టం బావుంది!

ఆనందంతో చిన్నగా ఈలవేశాడు విక్టర్.

దుస్తుల్లో దాచుకున్న స్వాట్ మేప్ బయటికి తీశాడు. దాంట్లో ఆ రేబియన్ నావ మునిగిపోయిన స్థలం ఎర్ర సిరాతో మార్క్ చేయబడి వున్నది!

ఇప్పుడు యీ సబ్ మెరైన్ యే ప్రాంతంలో వున్నదో ముందు తెలుసుకోవాలి! దీన్ని నీటిమీదికి తీసుకువెళ్ళాలి! తనకి మామూలు పరిస్థితుల్లో అయితే సరిహద్దుకిరువు వున్న సముద్రజలాలు బాగా గుర్తే! అయితే ప్రస్తుతం సముద్రం తుఫానులో చిక్కుకుని వున్నది. అయినా ఫరవాలేదు, సబ్ మెరైన్ లైట్ల వెలుతురులో సముద్రాన్ని గుర్తుపట్టగలడు తను!

అది యే దిశలో వున్నదో తెల్సుకోవటానికి సబ్ మెరైన్ లో దిక్సూచి అమర్చబడి వున్నది. తనదే ఆలస్యం.

సబ్ మెరైన్ ని నీటి ఉపరితలంమీదికి తేల్చాడు విక్టర్. వాచ్ చూసుకున్నాడు. తెల్లవారుఝామున మూడుగంట లయింది.

ఉపరితలంమీదికి రాగానే అద్దాల్లోంచి సముద్రం మీదికి చూసి ఆశ్చర్యపోయాడు విక్టర్.

తుఫాన్ ఎప్పుడు తెరిపి యిచ్చిందో తెలేదు. సముద్రంమీద అలజడి బాగా తగ్గిపోయింది. అలలు చెల రేగటంలేదు. హోరున్నదో లేదో, శబ్దం లోనికి విన్పించ కుండా అద్దాల తలుపులు అడ్డుకొంటున్నాయి గాని, పరి

స్థితి ప్రశాంతంగా వుందని గ్రహించాడు విక్టర్.

మేప్‌లోకి ఓసారి చూశాడు. ఇంతసేపు సబ్‌మెరైన్ ఉత్తరంగా పయనిస్తోంది. తను వెళ్ళవలసిన స్పాట్ తూర్పువైపు వున్నది. నీటిమీదనే సబ్‌మెరైన్ గమనదిశ మార్చుకున్నాడు. తూర్పుకు మళ్ళించాడు.

దూరంగా నీటిమీద దీపాలు కనిపిస్తున్నాయి. ఏవో షిప్పో, లేక బోట్లో తిరగటం మొదలయ్యిందో సరిగా గుర్తుపట్టలేక పోయాడు. 'స్పాట్'కి దారి చూసుకున్నాడు.

మెల్లగా నీటి అంతర్భాగానికి సబ్‌మెరైన్ మళ్ళించాడు. నెమ్మదిగా నీట్లోకి పయనిస్తోంది. అయితే తను నీటిపైకి తేలుతున్నప్పుడు తన సబ్‌మెరైన్ ఉనికిని వేరొకరు గుర్తించారని గాని, తనకి త్వరలోనే మరో శత్రువు ఎదురవుతున్నాడని గాని విక్టర్‌కి తెలియదు.

సబ్‌మెరైన్ తూర్పుదిశలో నీటి అడుగుభాగంలో ఉత్సాహంగా సాగిపోతున్నది.

## 13

సందీప్ ఆదేశానుసారం అంతవరకు నీటిలో వేలాడుతున్న గొలుసును చేదుకోవటానికి బోట్ పక్క భాగం వైపు నడిచాడు నిరంజన్. గొలుసు బరువుగా వుంది.

పైకి చేదుకోవటం మొదలెట్టాడు. చేదుకు నేకొద్దీ యింకా యింకా పైకొస్తూనే వున్నది.

సందీప్ అసహనంగా స్టీరింగ్ దగ్గర్నుంచి అరిచాడు. అప్పటికి గొలుసును చేదుకోవటం పూర్తయింది. డెక్ మీద పోగుపడ్డ గొలుసు చూసి, 'కనీసం అరవై, డెబ్భై మీటర్ల పొడవుంటుంది' అనుకున్నాడు నిరంజన్.

సందీప్ దగ్గరగా వచ్చి చెప్పాడు నిరంజన్, సందీప్

మొహం ఆనందంతో వెలిగిపోయింది.

"ష్యూర్ లక్కీ!....ఇదిగో యిటొచ్చి కాస్త స్టీరింగ్ కంట్రోల్ చెయ్యి....స్పీడ్ తక్కువలోనే వెళ్ళనివ్వు. నేను ఈ మేగ్నెట్, గొలుసు చివర అరేంజి చేసి వస్తాను" అంటూ అయస్కాంత రాడ్‌ను తీసుకుని డెక్ మీదకి వెళ్ళాడు సందీప్.

నిరంజన్‌కి పడవ నడపటం తెలియదు. అయితే అంత క్రితం అరగంట నుంచీ జాగ్రత్తగా సందీప్‌ని అబ్జర్వ్ చేస్తున్నందువ స్టీరింగ్ కంట్రోల్ చెయ్యటం పెద్ద కష్టమనిపించలేదు.

ఈలోపల సందీప్ మేగ్నెట్ రాడ్‌ని గొలుసు చివర అమర్చి, దాన్ని మళ్ళీ నీటిలోకి వదిలేసి నిరంజన్ దగ్గర్నుంచి స్టీరింగ్ అందుకున్నాడు.

గోల్డ్ డిటెక్టర్ 'పీప్....పీప్....' మంటూ శబ్దం చేస్తోంది. రెడ్ బల్బ్ వెలిగి ఆరుతోంది. 'ఏరో మార్క్' దిశ చూపిస్తోంది. దానికి అనుగుణంగానే మెల్లిగా పడవని పోనిస్తున్నాడు సందీప్.

"మనం పైన పడవలో వుండటంవల్ల ఉపయోగమేమిటి? నీటి అడుగుభాగంలో వున్న పెట్టెలు, అయస్కాంత క్షేత్రానికి ఆకర్షించలేనంత లోతులో వుంటే యింత ప్రయత్నమూ వ్యర్థమే కదా!" అన్నాడు నిరంజన్.

"అఫ్‌కోర్స్, లొకేషన్ తెలిసింది! అయస్కాంతానికి ఆకర్షింపబడేంత లోతులో వున్నదీ లేనిదీ నేను లోతుకి దిగి తెలుసుకోవాలనుకుంటున్నాను. స్పాట్ ఇదే! అందులో ఎలాంటి అనుమానం లేదు! ఈ ఏరియాలోనే తెల్లవారేవరకు రౌండ్స్ వేద్దాం" అన్నాడు

సందీప్.

గోల్డు డిటెక్టర్ శబ్దాల్ని వినిపిస్తూనే వున్నది. ఏరో మార్క్ సూచిస్తూన్న దిశగా సందీప్ పడవని పోనిస్తూనే వున్నాడు.

ఇంతలో, గొలుసు దేన్నో తగులుకున్నట్టు గ్రహించాడు సందీప్. స్టీరింగ్ నిరంజన్‌కి అప్పగించి ఒక్క అంగలో డెక్ మీదకి చేరుకుని గొలుసుని కదిపిచూశాడు. అతని కళ్ళు మిలమిల మెరిశాయి.

గొలుసుకు యేదో బరువయిన వస్తువు తగిలింది. అయస్కాంత క్షేత్రానికి ఆకర్షించుకోబడింది.

సందీప్ చేదుకోవటం మొదలెట్టాడు. దాదాపు పదిహేను నిమిషాలు పట్టింది గొలుసును పూర్తిగా చేదుకోవటానికి.

చివర తగులుకొనివున్న వస్తువును చూడగానే ఒక్కసారిగా సందీప్‌ని నిరాశా నిస్పృహలు ఆవరించుకున్నాయి.

అది విమానంయొక్క మరొక శిధిల భాగం. సీటింగ్ వుండే ట్రంక్ భాగం! అందుకే అంత బరువున్నది!

సందీప్ అయస్కాంతం నుంచి అతి కష్టమ్మీద దాన్ని తొలగించి, నీటిలోకి విసిరెయ్యబోయి, మళ్ళీ అంతలోనే యేదో స్ఫురించి డెక్ మీదనే వుంచేశాడు. మళ్ళీ మరోసారి శిధిలం అయిస్కాంతానికి ఎట్రాక్ట్ కావచ్చును! రౌండ్ వేయటంవల్ల అందు కవకాశమున్నది. మరోసారి వృధా ప్రయాస దేనికి?

నిరంజన్ ఆత్రుతగా అడిగాడు. "ఏమైనా ఫలితం కనిపించిందా?"

సందీప్ తల అడ్డంగా తిప్పి, "లేదుగానీ, అట్టడుగున

వున్న వస్తువుల్ని ఆకర్షించుకోగలిగినంత లోతువరకు మన గొలుసు జారివున్నది! ఫరవాలేదు. మనం నీటి అంత ర్భాగంలో వెతుకులాడవలసిన పనిలేదు. గొలుసుకున్న అయస్కాంత క్షేత్రంకూడా చాలా బలిష్టంగా వున్నది" అన్నాడు.

సరిగ్గా అదే సమయంలో పడవ అటు యిటు ఊగిస లాడింది. సందీప్, నిరంజన్ కొద్దిగా కంగరు పడ్డారు. సందీప్ నిరంజన్ దగ్గర్నుంచి స్టీరింగ్ అందుకున్నాడు. కాని పడవ ఊగిసలాడటం మానలేదు.

కారణ మేమిటో సందీప్ కి అంతుబట్టలేదు. గోల్డు డిటెక్టర్ వైపు చూశాడు. రెడ్ బల్బు వెలగటంలేదు. అప్పుడు గమనించాడు, అందులోనించి శబ్దాలు కూడా రావటం లేదని!

సందీప్ చకచక మీటలన్నీ నొక్కి పడవ కంట్రోల్ చేయటానికి చేతనైన ప్రయత్నాలు చేస్తున్నాడు.

## 14

విక్టర్ ఆటోమాటిక్ సబ్ మెరైన్ లో సాధ్యమైనంత వేగంగా స్పాట్ కి చేరుకోవాలని ఆత్రుత పడున్నాడు. ఇంజన్ కంట్రోల్ చేయనవసరంలేదు. డైరెక్షన్ చూసు కోవటమే తన పని! అది తనకి బాగా లభించింది.

ఈలోపల సబ్ మెరైన్ అంతా కలియ తిరిగి ఎక్క డైనా నీరు లోపలికి ప్రవేశించటానికావకాశమున్నదో, లేక జలచరాలు ఏమైనా డామేజి చేస్తున్నాయో చూసు కోవటానికి అవకాశం దొరికింది.

అంతే కాదు, లోపల బుల్లెట్ స్టాక్ ఎంతున్నదో, మరణాయుధాలేమున్నాయో చూడటానికూడా అవ

కాశం చిక్కింది.

లోపల తను చూసిన మూడు గన్స్ కాక, మరో రివాల్వర్ వున్నది. బహుశా అది నాయకుడు ఉపయోగించే రివాల్వర్ అయుంటుంది. తనని హింసించాలనే ఉద్దేశతో కత్తిని మాత్రమే ఉపయోగించాడు. కాని చివరి క్షణాల్లో అతనికి రివాల్వర్ని అందుకోవటానికి అవకాశం దొరకలేదు.

విక్టర్ రివాల్వర్ మేగజైన్ తెరిచి చూశాడు. లోడ్ చేసి వున్నది. ఆరు గుళ్ళు అలాగే వున్నాయి. రివాల్వర్ పేంటు జేబులో పెట్టుకున్నాడు. బుల్లెట్సున్న రెండు బెల్టులు దొరికాయి. దాదాపు రెండువందల పైచిలుకు బుల్లెట్సున్నాయి. మూడు గన్స్‌లో లోడ్ చేశాడు విక్టర్.

ఒకవేళ శత్రువులెవరైనా ఎటాక్ చేస్తే ప్రాణరక్షణకు సరిపడే బుల్లెట్సున్నాయి.

ఎక్స్‌ప్లోజివ్స్ వాడటం మెరైన్‌కి ప్రమాదకరమనో, ఏమో మరేవిధమైన మరణాయుధాలు లోపల దాచలేదు వాళ్ళు!

శవాల్ని చూస్తూంటే విక్టర్‌కి కంపరమెత్తింది. చివరగా స్టోర్స్‌కని ఓ గది కేటాయించబడి వున్నది. ఒక్కొక్కళ్ళని లాక్కుపోయి ఆ గదిలో పడేసి తలుపు వేసేశాడు. ఇందాకే సబ్ మెరైన్‌ని ఉపరితలం పైకి తీసుకువెళ్ళినపుడు శవాల్ని సముద్రంలోకి తోసేసి వుండాల్సిందనుకున్నాడు.

ఇంతలో అతనికో మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఆ నాయకుడు, తన ముగ్గురు అనుచరులతో పెద్ద ఎత్తున స్మగ్లింగ్ చేస్తున్నాడు. రత్నాలు, వజ్రాలతో చేస్తు

న్నానని ప్రగల్భాలు పలికాడు. అంటే ఆ రత్నాలు, వజ్రాలు, యీ జలాంతర్గామిలోనే యెక్కడో దాచి వుండాలి కదా!

విక్టర్ ఉత్సాహంగా బాడీలోపలంతా ప్రతి సెంటిమీటరూ విడవకుండా వెతకటం మొదలెట్టాడు. అతని ప్రయత్నం వృథా కాలేదు — ఓ అరగంట శ్రమపడ్డాక ఓ చెక్క పెట్టెలో భద్రంగా దాచిన ముఖమల్ పెట్టె కనిపించింది.

దాన్ని తెరిచి చూసిన విక్టర్‌కి కళ్ళు తిరిగినంత పనయింది. దాన్నిండా రత్నాలు, వజ్రాలు! సబ్ మెరైన్ వాటి కాంతితో రకరకాల రంగుల్లో వెలిగిపోతోంది!

విక్టర్‌కి వాటి నాణ్యత గురించి తెలియదు. కాని కోట్లు విలువ చేస్తాయని అతని మనసుకి నిశ్చయంగా తెలుస్తోంది! తనెంత అదృష్టవంతుడు! ఇంతటి ఐశ్వర్యానికి తనొక్కడే యజమాని ఇప్పుడు! వాటా అడిగేవాడెవడూ లేడు.

ఒకవేళ తన మిత్ర బృందం యెదురైనా తన దగ్గర యీ అమూల్యమైన ఆస్తి వున్నట్టు వాళ్ళకు తెలియదు-తెలిసే అవకాశం అణుమాత్రమైనా లేదు. ఇది స్మగ్లర్స్ సబ్ మెరీన్ అని వాళ్ళకి తను చెప్తేనే తెలుస్తుంది. తను చెప్పడు!

విక్టర్ ఆనందంగా యీల వేశాడు.

స్పాట్ మేప్ తీసిచూశాడు చాలా దగ్గర్లోకి వచ్చేశాడు. స్పీడోమీటర్ చూశాడు. తన అంచనా కరెక్టయితే మరో అయిదారు కిలోమీటర్లకన్నా యెక్కువ దూరముండదు.

విక్టర్ ఆనందంగా వున్నాడు. తను ఆ గోల్డ

బాక్సులు దొరక్కుండానే కోటీశ్వరుడై పోయాడు. అవికూడా తనకే చేజిక్కితే తను అతి పెద్ద బిలియనీర్ అయిపోతాడు.

కలల్లో తేలిపోతున్నాడు. ఆ రత్నాలు, వజ్రాలు తీసుకొని వెనక్కి వెళ్ళిపోయి వుంటే ఏమయివుండేదో గాని, వాటితో సంతృప్తిపడక, మరీ దురాశకు పోవటం వల్ల తన ప్రాణాలకే ముప్పురాగలదని అతడు తెలుసుకోలేకపోయాడు.

సరిగ్గా అదే సమయంలో సబ్ మెరైన్ యింజన్ మీదుగా వున్న అద్దం పక్కకు ఓ గొలుసు, అయస్కాంత క్షేత్రం వున్న రాడ్ తో వేలాడుతూ కనిపించింది.

అంతే, విక్టర్ అదిరిపడ్డాడు! అవును, ఖచ్చితంగా అది కపాడియా ఏర్పాటు చేసిన అయస్కాంత క్షేత్రమున్న రాడ్! ఇక్కడికెలా వచ్చింది? పైనుంచి లోపలికి యెవరు వేలాడతీశారు?

కపాడియా, సందీప్ కూడా స్పాట్ కి చేరుకున్నారా? వాళ్ళకి బోట్ ఎలా దొరికింది? ఏదైనా స్టీమర్ నించో, షిప్ నించో గొలుసు వేలాడతీశారా? చిత్రంగా వుందే?

ఇప్పుడు తనేం చెయ్యాలి? వాళ్ళనికూడా తనతో కలుపుకోవాలా? సరాసరి జలాంతర్గామిని ఆ గొలుసు వేలాడే దిశలో ఉపరితలంమీదికి తీసుకుపోతే, వాళ్ళు కనిపిస్తారు.

కాని.... కాని.... విక్టర్ మనసు అందు కంగీకరించలేదు. అతనిలో స్వార్థం బుసకొట్టింది. వాళ్ళకి తను కనపడకూడదు. తను బంగారానికి అతి సమీపంలో వున్నాడు జలాంతర్గామిలో.

వాళ్ళు చాలాదూరంగా, ఎక్కడో సముద్రంమీద

వున్నారు. తనకున్న అవకాశాలు వాళ్ళకిలేవు! తను బాక్సులను కళ్ళతో చూడగలడు. కొద్దినిమిషాల్లో వాటిని స్వాధీనం చేసుకోగలడు.

విక్టర్‌లోని స్వార్థమే గెలిచింది!

జలాంతర్గామి ఉపరితలానికి రెండు మూడుసార్లు అయస్కాంత రాడ్ తగిలింది, కాని బలమైన గాజు తప్ప ఇనుము లేకపోవటంవల్ల రాడ్‌కి అతుక్కో లేదు.

కాని విక్టర్‌కన్న ముందే ఆ బాక్సులను మరో జలాంతర్గామి అన్వేషిస్తూ వాటికి బాగా సమీపంలోకి చేరుకున్నదనిగాని, ఆ జలాంతర్గామికి సారథ్యం వహిస్తూన్న వ్యక్తి అతనికి అత్యంత సన్నిహితుడనిగాని విక్టర్‌కి మరో గంట తర్వాత గాని తెలియలేదు.

## 15

సందీప్ చాలా కష్టంమీద స్టీరింగ్ కంట్రోల్ చేయగలిగాడు.

ఎందుకో తెలియదు, అంత ఉధృతంగా క్రిందినుంచి అలలు లేచి పడవ తలక్రిందులయ్యే పరిస్థితి సంభవించింది. ఇంతవరకు తుఫాన్‌లోకూడా తలక్రిందులు కాకుండా నిల్చిన పడవ, తుఫాన్ తగ్గిపోయాక విపరీతంగా ఊగిసలాడటానికి కారణమేమిటో అతనికి అంతుబట్టలేదు.

సరిగ్గా అదే సమయంలో తమ పడవ కిందుగా సముద్ర గర్భంలో ఒకేసారి నాలుగు జలాంతర్గాములు తీవ్రమైన అన్వేషణలో వున్నాయని గాని, ఆ కారణం చేత నీటి అంతర్భాగంలో విపరీతమైన అలజడి పుట్టి తమ పడవని ఊపివేసిందనిగాని అతనికి తెలియదు.

సరిగ్గా అప్పుడే గోల్డు డిటెక్టర్‌లోని రెడ్ బల్బు వెలి

గింది. మళ్ళీ పీప్ .... పీప్ ....శబ్దాలు రావటం మొదలయ్యింది. సందీప్ ఆనందంతో చిన్నగా ఈలవేశాడు.

"వెరీగుడ్! మనం రాంగ్ ట్రాక్‌లో పోవటంలేదు. కరెక్టుగానే పోతున్నాం" అన్నాడు నిరంజన్‌తో.

నిరంజన్ తలూపి, "అసలు ఈ పడవ ఎవరిది? దీంట్లోని మనుషులేమైపోయుంటారు?" అనడిగాడు.

ఇంత పిచ్చివాడివేమిటన్నట్టుగా అతనివంక చూశాడు సందీప్. "తుఫాన్ అలలు యీ పడవను ఎత్తివేసి వుంటాయి. అప్పుడు యిందులో ప్రయాణిస్తూన్న వాళ్ళు ఎగిరి సముద్రంలో పడిపోయివుంటారు. సముద్రపు నీరు ఇంజన్‌లోకి ప్రవేశించి ఇంజన్ ఆగిపోయింది. కంట్రోల్ లేని పడవ అలలమీద యిష్టం వచ్చినట్టు ప్రయాణం చేస్తూ మన కళ్ళబడింది" అన్నాడు.

అయ్యుండవచ్చునన్నట్టు తలూపి, "ఇంతకూ యీ పడవలో యెవరు ప్రయాణంచేసి వుంటారు?!" అని యింకా యేదో అనబోతుంటే సందీప్ కోపంతో అరిచాడు.

"ఇక యిలాంటి పనికిమాలిన ప్రశ్నలువేసి నా బుర్ర పాడుచేయకు" అంటూ కసురుకున్నాడు.

నిరంజన్ మాట్లాడలేదు.

## 16

రాజుకి రొట్టెలు తిన్నాక సత్తువ వచ్చింది. వేడి పుట్టింది, నెగడు దగ్గర కూచున్న కాసేపటికి, బాగా రిలాక్సయ్యాడు. తనని ఫ్రీగా వదిలేసినట్టు కనిపించినా, తను వాళ్ళ బందీ అని అతను గ్రహించటానికి మరో అర గంట పట్టింది.

నెగడు దగ్గర్నుంచి లేచి, పక్కనున్న కేబిన్ వైపు

వెళుతుండగా అతని చెవులపడ్డాయి కొన్ని మాటలు. అందులో కెప్టెన్ గొంతు స్పష్టంగా వినిపిస్తోంది. అయితే అతనిప్పుడు ఆంగ్లంలో మాట్లాడటంలేదు. అందుకని తనకి ఆ మాటలు పూర్తిగా అర్థంకాలేదుగాని కొన్ని మాటలు స్పష్టాస్పష్టంగా వినిపించాయి.

అందులో 'సబ్ మెరైన్' అన్న మాట బాగా అర్థ మైంది. అవతలి వ్యక్తి కూడా ఆ మాట నే ఉచ్చరించ టంతో అతని అనుమానం బలపడింది.

తను వాళ్ళకి గోల్డు బాక్స్ల గురించి వివరాలు చెప్పే శాడు. సబ్ మెరైన్స్లో ఆ స్పాట్ కి బయల్దేరుతున్న సంగతి అవతలి వ్యక్తి కెప్టెన్తో చెప్తుండి వుండాలి!

అంటే, భారత ప్రభుత్వ జలాల్లోకి ఆ విదేశీయులు తమ జలాంతర్గాముల్లో బయల్దేరి వెళుతున్నారా? సరి హద్దుల్లో భారత గస్తీదళాలు జలాంతర్గాముల జాడ కనిపెట్టలేవా? బహుశా వాళ్ళ కళ్ళుగప్పి బార్డర్ దాటేస్తారా?

కెప్టెన్తో మాట్లాడి వాళ్ళ అభిప్రాయాన్ని గ్రహిం చాలి! వాళ్ళ ప్లాన్ ఏమిటో వాళ్ళ చేత నే చెప్పించాలి!

అంతలో కెప్టెన్ అటుగా వచ్చి రాజుని చూసి చిర్నవ్వుతో, "మీకిక్కడ సౌకర్యంగా వుందా?" అంటూ చాలా సౌమ్యంగా అడిగాడు ఆంగ్లంలో.

రాజు చిర్నవ్వుతో తలూపి, "మా దేశానికి వైర్లెస్ మెసేజ్ పంపుతామన్నారు, పంపారా?" అనడిగాడు.

కెప్టెన్ ఒక్క క్షణం గతుక్కుమని, అంతలోనే సర్దుకొని "ఎ, ఎస్! పంపాం, పంపాం!" అన్నాడు.

"నన్ను మా దేశపు జలాల్లో వదిలిపెడతామన్నారు. నేనిక వెళ్ళవచ్చునా?" అడిగాడు రాజు.

అంతవరకు చిర్నవ్వులు చిందిస్తూన్న కెప్టెన్ ముఖం సీరియస్ అయిపోయింది. "ఎందుకంత తొందర? పంపించేస్తామని అన్నాం కదా!" అన్నాడు.

"అవుననుకోండి. నేను అర్జంటుగా వెళ్ళాలి. భార్యా పిల్లలను చూడాలి. దయచేసి ...."

కెప్టెన్ ముఖంలో మొట్టమొదటి సారిగా కర్కశత్వం చోటు చేసుకున్నది. "మిస్టర్! ఇక్కడున్నంత కాలం నువ్వు మా చెప్పుచేతల్లోనే వుండాలి! నువ్వు చెప్పిన యిన్ఫర్మేషన్ కరెక్టేనని మేము నిర్ధారణ చేసుకోవాలి కదా! నేను మొదట్లోనే చెప్పాను. నువ్వు చెప్పిన విషయం నిజమని కన్ఫర్మ్ అయినాకనే నిన్నొదలిపెడతామని!" అన్నాడు.

రాజు పరిస్థితులు మారటం గుర్తించాడు. "ఇంతకీ.... మీరే దేశస్థులు? ఈ సముద్రజలాలు యే దేశానికి చెందినవి?" అడిగాడు.

"అవసరమయినపుడు నువ్వే తెలుసుకుంటావు" అంటూ కెప్టెన్ చరచర వెళ్ళిపోయాడు.

రాజు ఆలోచనలో పడిపోయాడు.

# 17

విక్టర్ ఉలిక్కిపడ్డాడు.

సబ్‌మెరైన్ మీద బలంగా దెబ్బలు పడుతున్నాయి. ఒక్కసారిగా అనుకోని ఈ దాడికి ఉక్కిరిబిక్కిరై పోయాడు విక్టర్.

తేరిపార చూశాడు. అదిరిపడ్డాడు.

తిమింగిలంవంటి భారీ శరీరంతో వున్న జలచరం తోకతో జలాంతర్గామిమీద బలంగా మోదుతున్నది.

జలాంతర్గామి అటుయిటు విపరీతంగా వూగిపోతోంది.

విక్టర్ ఆ జలచరం బారినించి యెలా తప్పించుకోవాలో తెలీక తికమకపడ్డాడు.

దానిపై కాల్పులు సాగించాలంటే రివాల్వర్ పట్టేటంత మేరయినా జలాంతర్గామి తలుపు తెరవాలి. ఆ మరుక్షణం జలాంతర్గామి లోపలికి నీరు ప్రవేశిస్తుంది! నీటితో నిండిపోతే మళ్ళీ దాన్ని బయటికి డ్రెయిన్ చేయాల్సి వుంటుంది. పంప్ సెట్ ఎటాచ్ చేయబడి వున్నది. కాని దాన్ని ఆపరేట్ చేయాలంటే సమయం వృధా అవుతుంది.

తిమింగిలంలా వున్న ఆ జలచరం మరింత గట్టిగా గ్లాసుమీద మోదుతున్నది!

తను కాల్పులు సాగించకపోతే మరికొద్ది నిమిషాల్లో అది గాజు తలుపుల్ని బద్దలు కొట్టేస్తుంది! ఇక తనకి నిధిని చేరుకొనే అవకాశం శాశ్వతంగా తప్పిపోతుంది!

ఆ జలచరం మరింత గట్టిగా మోదుతున్నది! ఇక కొద్ది క్షణాల్లో సబ్ మెరైన్ తుక్కు తుక్కయిపోయేలా వున్నది. అంత దృఢంగా వున్నది దాని దెబ్బ!

విక్టర్ యిక ఆలస్యం చెయ్యలేదు.

రివాల్వర్ పొజిషన్‌లో పట్టుకున్నాడు. తూటాల బెల్టు నడుముకి కట్టుకున్నాడు. తలుపు కొద్దిగా తెరిచి దాని సందులో రివాల్వర్ వుంచి ఆ జలచరంమీద కాల్పులు సాగించాడు.

అది కోపంతో ఘూర్ణిల్లింది. తోకతో మరింత బలంగా సబ్ మెరైన్‌ని బాదింది. అద్దం చిట్లింది. ఆరు తూటాలు ఖర్చయిపోగానే మళ్ళీ వెంటనే లోడ్ చేసి మళ్ళీ కాల్చాడు విక్టర్.

ఆ జలచరం రెట్టించిన కోపంతో గాజు తలుపులమీద

బలంగా మోదుతూనే వున్నది.

తన తూటాలు వ్యర్థమైపోతున్నందుకు ఓపక్క బాధ, మరోప్రక్క సబ్ మెరైన్ దెబ్బతినేస్తుందనే ఆత్రుత, ఇంకోపక్క నీళ్ళు మెల్లిగా సబ్ మెరైన్ బాడీలో నిండిపోయి ఇంజన్ మునిగిపోయే పరిస్థితి ఎదురైనందుకు దుగ్ధ— ఒక్కసారిగా అతడ్ని పిచ్చివాడ్ని చేశాయి.

పట్టు వదలకుండా దాని శరీరం నిండా గుళ్ళవర్షం కురిపిస్తూనే వున్నాడు విక్టర్. సబ్ మెరైన్ చుట్టూ యెటు చూసినా ఆ జలచరం శరీరం నుంచి స్రవిస్తూన్న ఎర్రటి రక్తం! బీభత్సంగా వున్నదా దృశ్యం.

జలచరం ఈసారి శక్తినంతా కూడదీసుకుని ఒక్కసారిగా సబ్ మెరైన్ అద్దాలను పగలగొట్టేసింది. విక్టర్ పిచ్చికోపంతో దాన్ని కాలుస్తూనే వున్నాడు.

చివరికి ఆ జలచరం తపతప కొట్టుకుంటూ ఆఖరిశ్వాస విడిచింది.

సబ్ మెరైన్ ఇంజన్ లోపలికి నీళ్ళు వెళ్ళిపోయాయి. ఇంజన్ గరగరమని చప్పుడు చేసి చటుక్కున ఆగిపోయింది.

పరిస్థితి ఒక్కసారిగా తారుమారైపోయినందుకు విక్టర్ పిచ్చివాడయిపోయాడు. రత్నాలు, వజ్రాలు వున్న ముఖమల్ పెట్టెను గుప్పుల్లో దాచుకున్నాడు. ఆక్సిజన్ సిలిండర్ని మళ్ళీ నడుముకి కట్టేసుకున్నాడు. డైవింగ్ డ్రస్ వేసుకున్నాడు.

సబ్ మెరైన్ ఇంజన్ దగ్గరకు వెళ్ళి పరీక్షించాడు. ఇంజన్ స్టార్ట్ చేయటానికి ప్రయత్నించాడు. లాభంలేకపోయింది. అప్పటికి మూడొంతులు పైగా మునిగిపోయింది ఇంజన్ వున్న కేబిన్.

విక్టర్ మేప్‌ని చుట్టి నడుము దగ్గరున్న వాటర్ ప్రూఫ్ క్లాత్‌లో దాచుకున్నాడు. పెట్టె భద్రంగా వుందో లేదో చూసుకుని, నీటిలోకి ఉరికాడు. వేగంగా ముందుకు ఈదుకుంటూ వెళ్ళసాగాడు.

మాస్క్‌కి అమర్చివున్న హెడ్‌లైటులో దారి వెతుక్కుంటూ, దిశను గుర్తుపెట్టుకుంటూ తూర్పువైపు ఈదుకుంటూ వెళ్తున్నాడు, దృఢనిశ్చయంతో.

# 18

"అదేదో సబ్‌మెరైన్! ప్రొజెక్షన్ కనిపిస్తోంది, చూడు!" అన్నాడు గస్తీదళం కెప్టెన్, సార్జంట్‌తో.

"ఎస్! డెఫినెట్లీ యిటీజ్ సబ్‌మెరైన్!" అన్నాడు సార్జంటు పరీక్షగా చూస్తూ.

భారతజలాల సరిహద్దుల్లో వున్న షిప్ డెక్‌మీద నుంచి పరీక్షగా చూస్తున్నారు కెప్టెన్, సార్జంట్ లిద్దరూ. ఏదో గుర్తించటంకోసం నీటి ఉపరితలంమీదికొచ్చి మళ్ళీ నీటి అడుగుభాగానికి విక్టర్ తన సబ్‌మెరైన్‌ను నడుపుకుపోతుండగా గస్తీదళం కెప్టెన్ కళ్ళబడింది మెరైన్.

"సో. లెటజ్ ఫాలో దట్ సబ్‌మెరైన్! శత్రుదళాలు ఏదైనా కుట్ర చేస్తూవుండమ్చు. లెటజ్ అటాక్ విత్ అవర్ ఫోర్స్!" అన్నాడు కెప్టెన్.

సార్జంట్ అప్పటికప్పుడు భారత నేవీదళానికి చెందిన సబ్‌మెరైన్‌లో సిబ్బందితో బయల్దేరాడు. ముందు విక్టర్‌ది, వెనుక బాగా దూరంగా భారత నేవీకి చెందిన సబ్‌మెరైన్ నడుస్తున్నాయి.

అలా పదిహేను నిముషాలు గడిచాయి.

"కాల్పులు వినిపిస్తున్నాయి గమనించావా?" అన్నాడు కెప్టెన్ సార్జంటుతో.

సార్జంటు తలూపాడు. "ఆ సబ్ మెరైన్‌లోని వ్యక్తులు సాగినా వుండాలి! వాళ్ళకు వేరే యెవరో యెదురుపడటమో, లేక షార్క్, తిమింగలమో యెటాక్ చేసి వుండాలి! తోకతో కొడుతున్న శబ్దం కూడా స్పష్టాస్పష్టంగా వినిపిస్తోంది" అన్నాడు.

తక్కిన సిబ్బంది కూడా ఆ శబ్దాలు విన్నారు.

మరో పదినిమిషాల తర్వాత శిథిలమయిపోయిన సబ్ మెరైన్, చచ్చిపడున్న జలచరం కనిపించాయి వాళ్ళకు.

సార్జంట్ సిబ్బందిని ఎలర్ట్‌గా వుండమని హెచ్చరించి సబ్ మెరైన్‌ని సమీపించాడు—కాని అక్కడ యెవరూ లేరు—శవాలు తప్ప.

"వాట్? రియల్లీ యింట్రస్టింగ్!" అన్నాడు కెప్టెన్ సార్జంటుతో.

దూరంగా యీదుకుంటూ వెళ్తున్న విక్టర్ అస్పష్టంగా కనిపించాడు.

"స్పీడప్....! అతన్ని పట్టుకోవాలి!" అన్నాడు కెప్టెన్.

నేవీ సబ్ మెరీన్ వేగంగా నీటిలో పయనిస్తోంది. మరి కాస్సేపట్లో విక్టర్ దొరికిపోతాడనగా ఎక్కడ్నుంచో సబ్ మెరీన్ ఇంజన్ శబ్దాలు వినిపించాయి.

కెప్టెన్ శ్రద్ధగా విని, "ఎస్. ఆ శబ్దాలు బార్డర్ నుంచి వినిపిస్తున్నాయి" అన్నాడు.

గన్స్‌తో అందరూ పొజిషన్‌లోకి వచ్చేశారు.

అంతకంతకు ఇంజన్ శబ్దాలు దగ్గరయ్యాయి.

రాజు డెక్ మీద కాలు గాలిన పిల్లిలా తిరుగుతున్నాడు.

ఈపాటికి వీళ్ళసబ్ మెరైన్స్ బయల్దేరిపోయివుంటాయి. ఈ విషయం భారత నేవీ బార్డర్ సెక్యూరిటీ దళానికి తను చేర్చగలిగితే యెంత బావుండును! ఇప్పటికే తను రెండుసార్లు తప్పటడుగులు వేశాడు. దాన్ని యిప్పటికయినా సరిదిద్దుకుంటే బావుంటుంది!

రాజు చుట్టూ పరిశీలనగా చూశాడు.

ఒకరిద్దరూ తప్ప తక్కినవాళ్ళు నిద్రమత్తులో జోగుతున్నారు, తెల్లవారుఝాము నిద్ర! వాచ్ చూసుకున్నాడు.

నాలుగు గంటలయింది.

మెల్లగా తను విప్పిన డైవింగ్ డ్రస్ వేసుకున్నాడు. సిలిండర్ వీపుకి కట్టుకున్నాడు. మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ ఇంజన్ పక్కగా వున్న గొలుసు దగ్గరకు నడిచాడు.

కెప్టెన్, మరికొందరు సిబ్బంది డెక్కి ఆ చివర వున్నారు. ఇదే సరైన అదను.

గొలుసు నిచ్చెనమీదుగా మెల్లిగా నీటిలోకి దిగాడు రాజు. భారత సెక్యూరిటీ స్టాఫ్ ఎక్కడుంటుందో తనకి తెలియదు. అయినా వాళ్ళు కూడా యిదే బార్డర్లో వ్యతిరేక దిశలో వుండాలి కదా! అదే బండ గుర్తు అతనికి.

నెమ్మదిగా నీటి ఉపరితలంమీదనుంచి కొద్దిగా అడుగు భాగానికి జారి అప్పుడు ఈదటం మొదలు పెట్టాడు. అండర్ వాటర్లో ఈదటానికి వీలైన డ్రస్ అది. అందుకే

తనకు సర్వకాల సర్వావస్థలందు ప్రాణం కాపాడుకోవ టానికి వీలవుతోంది.

సిలిండర్ నించి సరఫరా అవుతున్న ఆక్సిజన్ పీల్చు కుంటూ జాగ్రత్తగా పరిసరాలను గమనించుకుంటూ బార్డర్ చేరుకుంటున్నాడు.

అతను తప్పించుకుపోయిన పదినిమిషాలకు కెప్టెన్, రాజు లేకపోవటం గమనించాడు. తన సిబ్బందిమీద పెద్దగా అరుస్తూ కేకలు పెట్టాడు.

మరుక్షణం నీటిపైకి కాల్పులు సాగించారు. కాని అప్పటికే రాజు చాలాదూరం వెళ్ళిపోయినట్లు వాళ్ళకు తెలియదు.

రాజుకి దూరంగా యేదో షిప్ కనిపించింది. ఆతనికి ప్రాణం లేచివచ్చింది. ఇప్పుడు సర్ఫేస్ మీద ఈదుకుంటూ వెళ్తున్నాడు. బార్డర్ చూడాలంటే నీటిలోపల ఈదు కుంటూ వెళ్తే తెలియదు. అందుకే ఉపరితలంమీద ఈదు కుంటూ పది నిమిషాల్లో షిప్ చేరుకున్నాడు.

షిప్ డెక్ మీద భారత నేవీదళం అతనికి కన్నుల పండువ చేస్తూ కనిపించింది.

తనని శత్రువనుకొని కాల్చేసే ప్రమాదమున్నది. అందుకని ముందుగానే మిత్రుడనని తెలియచెప్పటం కోసం లోపల ధరించిన బనియన్ చించేసి వాళ్ళకి కని పించేలా ఎగరేశాడు.

అవతలినుంచి వాళ్ళు గుర్తించినట్టు సంకేతం అందింది! వాళ్ళుకూడా తెల్లటి గుడ్డ ఎగరేస్తూ అతన్ని రిసీవ్ చేసుకున్నారు

మిత్రత్వానికి తెలుపును సంకేతంగా వాడతారని విక్టర్ ఓసారి తనతో చెప్పాడు. సమయస్ఫూర్తితో

వ్యవహరించాడు రాజు.

భారత సెక్యూరిటీ దళం అతన్ని షిప్ మీదికి చేరు స్తున్నది.

# 20

ఒక్కసారిగా రెండు పక్కలనుంచి తమ పడవమీద దాడిచేసిన రెండు పడవలని చూసి సందీప్ ఉలిక్కి పడ్డాడు.

వాళ్ళు భారత నేవీదళానికి చెందిన సెక్యూరిటీ గార్డ్స్!

"హేండ్సప్!" అంటూ రెండు పడవలనించీ హెచ్చ రికలు వినిపించాయి.

సందీప్ తో బాటు, నిరంజన్ కూడా చేతులు ఎత్తి నించున్నారు. సందీప్ ఎడమ చేత్తో స్టీరింగ్ కంట్రోల్ చేస్తున్నాడు.

"అయామ్ నేవీ ఆఫీసర్ సందీప్! మేము విహారార్థం ఈ పడవలో సముద్రం మీదికి వచ్చాం...." యేదో చెప్పబోయి త్రుళ్ళిపడి అటు చూశాడు సందీప్.

ఓ పడవలో రక్షకదళంతో బాటు రాజు నిల్చుని వున్నాడు. నిరంజన్, రాజుని ఆనందంగా చూస్తు న్నాడు. రాజు బతికే వున్నాడా? థాంక్ గాడ్! అను కున్నాడు.

రక్షకదళం సార్జెంట్ సందీప్ వంక తీక్షణంగా చూసి, "ప్రూవ్ యువర్ ఐడెంటిటీ ఎట్ సెక్యూరిటీ బార్డర్ లైన్!" అన్నాడు.

"ఓ.కే. సర్!" అన్నాడు సందీప్.

సెక్యూరిటీ గార్డ్స్ సందీప్ ని, నిరంజన్ ని తమ

పడవలో ఎక్కించుకొని భారత నేవీదళానికి చెందిన సెక్యూరిటీ బార్డర్ కి తీసుకు వెళ్లారు.

## 21

ఎదురుగా వస్తూన్న మరో సబ్ మెరీన్ వంక గుడ్లప్ప గించి చూస్తూ వుండిపోయాడు విక్టర్.

భారత నేవీ x సీదళానికి చెందిన జలాంతర్గామి యేమోనని పరికించి చూశాడు. x సీ దళానికి చెందినది కాదుగాని, భారత నేవీకి చెందినదే! బొంబే నావల్ బేస్ కి సంబంధించినది కాదు.

మరి ?

కేబిన్ వైపు చూసి అదిరిపడ్డాడు.

అతను జేమ్స్! విశాఖ పోర్టులో పనిచేస్తూన్న జేమ్స్. బొంబేనించి ట్రాన్స్ ఫరయి వెళ్ళిపోయిన తమ అయిదు గురు మిత్ర బృందంలోనివాడు. అయిదో వాడు చనిపోయిన కపూర్.

జేమ్స్ దూరంనించే విక్టర్ని గుర్తించాడు.

మొదట ఎవరైనా శత్రువేమోనని రివాల్వర్ చేతో పట్టుకొని షూట్ చేయటానికి సిద్ధంగా నించున్నాడు కేబిన్లో. కాని అంతలోనే అతన్ని విక్టర్ గా గుర్తించాడు!

ఆ సబ్ మెరీన్ కి నీరు లోపల ప్రవేశించకుండా యేర్పాటున్నది! జేమ్స్ విక్టర్ని ఆ మార్గంగుండా లోపలికి చేరుకున్నాడు.

జేమ్స్ కాక మరో ముగ్గురున్నారు సబ్ మెరీన్ లో.

"హాలో ఫ్రెండ్. యెలా వున్నావ్?" అంటూ మిత్రుని ఆలింగనం చేసుకున్నాడు జేమ్స్.

విక్టర్ ఆనందంగా అతన్ని హత్తుకొని, "ఇంత

అకస్మాత్తుగా ఇక్కడ యిలా కలుస్తామని అనుకోలేదు. వైజాగ్ నించి ఎప్పుడొచ్చావు? సబ్ మెరీన్ లో వస్తూన్న వేమిటి?" ప్రశ్నల వర్షం కురిపించాడు విక్టర్.

"నీకో అద్భుతం చూపిస్తాను, ఇలా రా!" అంటూ విక్టర్ ని వెంటబెట్టుకొని లోపలి గదిలోకి తీసుకువెళ్లాడు జేమ్స్.

అక్కడ వరసగా యేడు నల్లని పెట్టెలు - ఐరన్ బాక్స్ లున్నాయి. విక్టర్ సంభ్రమంగా చూస్తున్నాడు.

"ఇదేమిటో గ్రహించావా?" అడిగాడు జేమ్స్.

విక్టర్ ఆనందంతో చిన్న కేక పెట్టాడు. అవి బంగారంతో నిండి వున్న ఎనిమిది బంగారు పెట్టెల్లోని యేడు బాక్స్ లు! బంగారంతో వున్న నల్లయినప్పెట్టెలు! గాడ్! జేమ్స్ కెలా దొరికాయివి.

"ఆశ్చర్యపోకు ఫ్రెండ్! వీటికోసమే ప్రత్యేకంగా వైజాగ్ నించి వచ్చాను. నేను సబ్ మెరిన్ ఇంజనీర్ని కదా! ట్రెయినీస్ కి శిక్షణ యిచ్చే మిషమీద మెరీన్ తీసుకొని మా ట్రయినీస్ ముగ్గుర్ని వెంటబెట్టుకొని యిక్కడికి వచ్చేశాను, వైజాగ్ పోర్టునించి.

నువ్వు గ్రహించే వుంటావు. బంగాళాఖాతంలో కూలిపోయిన జంబోజెట్ విరిగిన శిధిలాలతో బాటు అన్వేషణలో దొరికిన బంగారమున్న ఇనప్పెట్టె—అలనాడు మనం వెతికి వెతికి వేసారిపోయిన గల్ఫ నావలో చిక్కుకుపోయిన పెట్టెలో ఒకటని!

అందుకే వెంటనే బయల్దేరి వచ్చేశాను. నా అన్వేషణ ఫలించింది. పెట్టెలు నేనూహించిన స్పాట్ లోనే దొరికాయి. వెంటనే మన ట్రెయినీస్ ముగ్గురి సాయం

లోను లోడ్ చేసేశాను.

కాని ఫ్రెండ్స్, వీటిలో మీ ముగ్గురికీ వాటా యిస్తాను. మన నలుగురికీ నాలుగు, మూడు వాటాలు ఈ ముగ్గురికే పంచుతాను. నేను మాట తప్పేవాణ్ని కాదు, స్నేహానికి ప్రాణం పెట్టేవాడిని ...ఓ.కే!?" అన్నాడు నవ్వుతూ జేమ్స్.

"మరి యిప్పుడెక్కడికి వెళ్తున్నావు?"

"వైజాగ్ .... ముందు సరుకు క్షేమంగా సురక్షిత ప్రాంతానికి చేర్చాలి కదా! ఆ తర్వాత వాటాలు."

"ఓ పని చెయ్యకూడదూ?"

"ఏమిటి?"

"నే నెలాగూ కనిపించాను కదా! సందీప్, కపాడియాల వాటాలు, నా వాటా—మూడూ నాకిచ్చెయ్యకూడదూ! నీకు బరువు తగ్గుతుంది!?" అన్నాడు విక్టర్ జేమ్స్ వంక నవ్వుతూ చూసి.

"ఓ.కే....ఓ.కే! విత్ ప్లజర్. కాని, ఎలా తీసుకు వెళ్తావు?"

"ముందు బొంబే పోర్టులో మూడు పెట్టెలు సురక్షితంగా దించేద్దాం. మనకి తెలిసినవాళ్లే కదా అందరూ!"

"నీ యిష్టం! ... అన్నట్టు నువ్వు సర్వీస్ వదిలేసి హైద్రాబాద్ వెళ్ళిపోయావు కదూ....మళ్ళీ యెప్పుడు వచ్చావిక్కడికి?"

"మూడు నెలల క్రితం మళ్ళీ సర్వీస్‌లో జాయినయ్యాను, నీకు రాయటం జాప్యం చేశాను."

జేమ్స్ నవ్వి, "అయితే నే నో విషయం కనిపెట్టాను, చెప్పనా?" అన్నాడు.

విక్టర్ తొట్రుపడుతూ చూసి, "ఏమిటది?" అన్నాడు.

"నువ్వుకూడా ఈ పెట్టెల గురించి అన్వేషిస్తూ ఇటు ఈదుకుంటూ వచ్చావు, అవునా?"

విక్టర్ పెద్దగా నవ్వేసి, "నీకు తెలివి అమోఘం! కరెక్ట్! మరోసారి ట్రయిల్ చేసి, పెట్టెలు కనిపిస్తే కపాడియా, సందీప్‌ల సాయంతో మరోసారి వచ్చి తీసుకువెళ్ళాలనుకున్నాను. పేపరు వార్త చూసి, నీలాగే ఊహించాను. మనవాళ్ళిద్దరితోను సంప్రదించానుకూడా!" అన్నాడు.

"సరే, బొంబే పోర్టుకి నడిపించమంటావా?"

"ఆఁ! ఆలస్యం దేనికి? కాసేపట్లో తెల్లవారబోతోంది కదా!"

జేమ్స్ ట్రెయినీస్‌లో ఒకతనికి సూచన లిచ్చాడు. అతను సబ్ మెరీన్‌ను బొంబే పోర్టు వైపుగా మళ్ళించాడు.

మరుక్షణంలో—

"మీ నలుగురు చేతులు పైకెత్తి ఆ మూలకు వెళ్ళి వరుసగా నించోండి!" అన్నాడు విక్టర్ కఠినంగా.

జేమ్స్‌తో బాటు తక్కిన ముగ్గురూ నిర్ఘాంతపోయి విక్టర్ వైపు చూశారు.

విక్టర్ చేతిలో పిస్తోలు నిగనిగ మెరుస్తోంది.

జేమ్స్ కదలబోయాడు.

విక్టర్ అరిచాడు. "కదలొద్దు. నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను."

"విక్టర్, ఏమిటిది? హాస్యానికయినా హద్దులుండాలి!" జేమ్స్ ఏదో చెప్పబోయాడు.

"ఇది హాస్యానికాదు మైడియర్ ఫ్రెండ్! నిజం

గానే చెప్తున్నాను. మీరు నలుగురు వెంటనే సముద్రం లోకి దూకేసి, అదృష్టముంటే ప్రాణాలు కాపాడు కోండి. లేదా నా చేతుల్లో నిర్దాక్షిణ్యంగా ప్రాణాలు కోల్పోతారు!" విక్టర్ బెదిరించాడు.

"ఇది నీకు న్యాయంకాదు విక్టర్! కష్టపడింది మేమైనా నీకు షేర్ యిస్తామన్నాను. నువ్వు కోరినట్టే ముందు మీ పోర్టుకే మెరీన్‌ను నడిపిస్తున్నాను. నువ్వు వెన్నుపోటు పొడుస్తావా నన్ను?" జేమ్స్ ఆవేదనగా అన్నాడు.

"వెన్నుపోటు కాదు! దయతలచి మిమ్మల్ని ప్రాణాలతో వదిలేస్తున్నాను కదా? లేకుంటే కాల్చలేనా మిమ్మల్నందర్ని? క్విక్, తలుపుగుండా నీటిలోకి వెళ్ళిపోండి! జేమ్స్.. జేబులో చెయ్యి పెట్టొద్దు. హేండ్సప్!" నలుగుర్నీ రివాల్వర్‌తో కవర్ చేస్తూ అరిచాడు విక్టర్.

జేమ్స్, అతని ఫ్రెండ్స్ ముగ్గురు తలుపువైపు అడుగులు వేశారు.

## 22

భారత దేశానికి చెందిన కెప్టెన్, సార్జెంట్ సిబ్బందితో ఇంజన్ చప్పుడు వినిపిస్తున్నవైపు సబ్ మెరీన్‌లో సాగి పోయారు.

దూరంగా తూర్పుదిశగా సాగిపోతూ శత్రువుల సబ్ మెరీన్స్ రెండు కనిపించాయి.

"సో, వీళ్ళు మన సముద్రజలాల్లోకి అక్రమంగా ప్రవేశిస్తున్నారు. నిస్సంకోచంగా ఆ మెరీన్స్‌ని కాల్చెయ్యండి!" కెప్టెన్ ఆదేశించాడు.

అప్పటికి శత్రుదళాల సబ్ మెరీన్స్ కూడా వీళ్ళను చూసి, తొందరగా అటు బార్డర్ వైపు పారిపోవటానికి ప్రయత్నించాయి.

భారత నేవీదళం గుళ్ళవర్షం కురిపించింది. ఆ రెండు సబ్ మెరీన్స్ మీద, అవతల్నించి వాళ్ళు దాడి చేసేలోపల రెండు సబ్ మెరీన్స్ ని నిర్దాక్షిణ్యంగా పేల్చేసింది భారత నేవీదళం.

విజయగర్వంతో బార్డర్ సెక్యూరిటీ షిప్ వైపు సాగిపోయింది సబ్ మెరీన్. ఇంతలోనే మరో సబ్ మెరీన్ వస్తున్న సూచనగా ఇంజన్ శబ్దం వినిపించింది.

కెప్టెన్ సార్జెంట్ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు.

సార్జెంట్ సిబ్బందివైపు చూసి "బి, ఎలర్ట్. మరో శత్రు మెరైన్ కావచ్చు!" అన్నాడు.

మెరీన్ దగ్గరపడింది.

"అరె, అది మన భారత నేవీకి చెందిన సబ్ మెరీన్! శిక్షణ కోసం ఉద్దేశింపబడిన మెరిన్ అది! మన బేస్ ది కాదు. మెట్ బి ఫ్రం వైజాగ్!" అన్నాడు కెప్టెన్.

సరిగ్గా అప్పుడే విక్టర్, జేమ్స్ ని వాళ్ళ ట్రెయినీస్ ని రివాల్వర్ తో బెదిరిస్తున్నాడు.

కెప్టెన్ అద్దాల్లోంచి అది చూశాడు. "దేరీజ్ సమ్ థింగ్ రాంగ్! దాన్ని చుట్టుముట్టండి!" అన్నాడు.

సరిగ్గా అప్పుడే జేమ్స్ మెరుపులా వెనుతిరిగి విక్టర్ ని యెగిరి తన్నాడు. అతని చేతిలోని రివాల్వర్ యెగిరి దూరంగా పడింది.

జేమ్స్ కిందపడిన రివాల్వర్ అందుకుని విక్టర్ ని కాల్చబోయాడు. విక్టర్ నేలమీద దొర్లి జేమ్స్ ని, కాళ్ళతో అతని కాళ్ళను పెనవేసి కిందకు లాగేశాడు.

సరిగ్గా అదే సమయానికి సెక్యూరిటీ సిబ్బంది చకచక ఆ మెరీన్ లోపలికి ప్రవేశించారు.

జేమ్స్, విక్టర్ చేతులు ముందుకు చాపి సెక్యూరిటీ సిబ్బందికి లొంగిపోయారు.

ఏడు పెట్టెల బంగారంతో, దోషులను తీసుకొని, భారత నేవీదళం సెక్యూరిటీ సిబ్బంది విజయోత్సాహంతో సెక్యూరిటీ షిప్ వైపు సాగిపోయింది.

—: అయిపోయింది :—

సీరియల్



• బొమ్మిడి అప్పారావు

(గత సంచిక తరువాయి)

"సార్, ఆ నాయుడికి కొంతమంది కోయవాళ్ళు మద్దతు నిస్తున్నారని నా అనుమానం. ఎందుకంటే ఆ నాయుడి లారీ మన ఘాట్ రోడ్ వైపునించి కాక మహారాష్ట్రకు చెందిన ఫారెస్టు బార్డర్ నించి వచ్చింది. అందుకే మన గార్డుకి ముందుగా తెలియలేదు" అన్నాడు తాణేదారు మర్నాడు.

రాఘవేంద్రరావు తలూపి, "వాళ్ళెవరో ఆమాకీ తెల్సుకోండి! వాళ్ళు ఎవరయినదీ తెలిస్తే ప్రభుత్వానికి తెలియచేసి శిక్షపడేలా చూద్దాం. కొందర్ని అదుపులోకి తీసుకోగానే తక్కినవాళ్ళకి బుద్ధొస్తుంది" అన్నాడు.

"అలాగే సార్! సర్వే తోటలు దాటి కొంతదూరం పోతే ఏటవాలు కొండ వున్నది. అక్కడ ఓ కోయ గూడెం వున్నది. వాళ్ళకే యెక్కువ అవకాశ

మున్నది."

"సర్వే తోటలు దాటి యున్నదూ మనం వెళ్ళలేదు కదా!"

"అక్కడి కోయవాళ్ళు అప్పుడప్పుడు మన క్వార్టర్స్ పక్కగా ఘాట్ రోడ్ కి వెళ్తూండగా చూశాం. వాళ్ళకి తెలుగు తెలుసు. కొండజాతి యాసలో మాట్లాడుతుం టారు."

"బి వాచింగ్ దోస్ ఫెలోస్! సర్వేతోపు మాత్రం దాటి వెళ్ళొద్దని మనవాళ్ళని హెచ్చరించు. అక్కడ పట్టపగలే పులులు, సింహాలు, తిరుగుతుంటాయని మన ఫిలిప్ చాలాసార్లు చెప్పాడు."

"అవును సార్! మనకి రాత్రిళ్ళు అతి సమీపంగా వినిపించేవి వాటి గర్జనలే!"

"సో బీ కాషస్!"

"ఓ.కే సార్, సెలవు!" జమేదార్ వెళ్ళిపోయాడు.

అతను వెళ్తూండగానే ఓ అజానుబాహులైన వ్యక్తి లోనికి వచ్చాడు. జ్వలిత తండ్రి దగ్గరకు రాబోతూ లోపలి గది గుమ్మందగ్గరే ఆగిపోయింది. భీకరంగా వున్న ఆ వ్యక్తివంక పరిశీలనగా చూసింది.

అతనికి దాదాపు ఏభైయేళ్ళుంటాయి. జుట్టు అక్కడక్కడ నెరిసింది. పెద్ద బుగ్గమీసాలున్నాయి. నల్లగా పోతపోసిన కంచు విగ్రహంలా వున్నాడు. కాళ్ళకు మిలటరీ బూట్లున్నాయి. నోట్లో పైపు వెలుగుతోంది. అతని చేత డబుల్ బారెల్ గన్ వున్నది.

రాఘవేంద్రరావు కూచున్న చోట్నుంచి లేవకుండానే సూటిగా అతనివంక చూశాడు.

"అయామ్ మేజర్ వీరేంద్ర!" అన్నాడు ఆ వ్యక్తి.

రాఘవేంద్రరావు హుందాగా తలూపాడు.

"రెండు నెలల క్రితం కొత్తగా వచ్చిన ఆఫీసర్ మీరే ననుకుంటాను?!" అన్నాడు ఆంగ్లంలో నే.

"ఎస్!" అన్నాడు రాఘవేంద్రరావు.

"ఐ బిలాంగ్ టు బళ్లారా!"

"తెలుసు—గతంలో మిమ్మల్ని చూడలేదు గాని, నెలరోజుల క్రితం మీ కోసం కబురుపెట్టాను. మీరు ప్రభుత్వంనించి గాని, మా డిపార్టుమెంటునించి గాని యెలాంటి అనుమతి తీసుకోకుండా అడవిలో ఓ గ్లాస్ హౌస్ నిర్మించారు. దాన్ని వెంటనే రిమూవ్ చెయ్యవలసిందిగా కోరాం. కాని ఈరోజు వరకు మీ నుంచి జవాబు లేదు."

"అవును. ఇదివరకటి ఆఫీసర్ అనుమతి తీసుకున్నాను. జస్ట్ మ్యూచువల్ అండర్‌స్టాండింగ్! ఆయన్ని బాగా సంతోష పెట్టాను కూడా! నాకు హంటింగ్ హాబీ! నెలకి పదిహేను రోజులు యిక్కడ గడుపుతుంటాను. అందుకే గ్లాస్‌హౌస్ కట్టుకున్నాను. మిమ్మల్ని కూడా సంతోష పెడ్తాను...."

"మిస్టర్ వీరేంద్రా!...." రాఘవేంద్రరావు కంఠం ఉరిమింది. "ఎవరితో మాట్లాడుతున్నారో మరిచిపోవద్దు. మీరు నన్ను సంతోషపెట్టక్కర్లేదు. గ్లాస్ హౌస్‌ని వెంటనే అక్కడ్నుంచి తొలగించండి. అంతే కాదు, అడవిలో హంటింగ్ నిషిద్ధం! హంటింగ్ కోసమే అయితే మీ రీ అడవిలో అడుగుపెట్టడానికే వీల్లేదు. మైండిట్!"

సంభాషణ ఆంగ్లంలో నే సాగుతోంది.

వీరేంద్ర ఎర్రటి కళ్ళు మరింత ఎర్రబారాయి. తీక్ష

ణంగా చూశాడు రాఘవేంద్రరావువైపు.

"బేబీ, రెండు టీ పట్రామ్మా!" అంటూ లోపలికి కేక పెట్టాడు రాఘవేంద్రరావు.

బీరేంద్ర కుర్చీలోంచి లేవబోయాడు.

"ప్లీజ్, బి సీటెడ్! హేవ్ సమ్ టీ!" అన్నాడు రాఘవేంద్రరావు చిన్నగా నవ్వుతూ.

సరిగ్గా అప్పుడే జ్వలిత రెండు టీ కప్పుల్తో అక్కడికి వచ్చింది. బీరేంద్ర ఆమెవైపే గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయాడు. జ్వలిత మౌనంగా కప్పులు టీపాయ్‌మీద పెట్టేసి లోనికి వెళ్ళిపోయింది. సంస్కారహీనంగా ఆ పెద్దమనిషి తనవంకే యెగాదిగా చూడటం ఆమెకు చిరాకు కలిగించింది. తండ్రి కోసం అవన్నీ భరించింది. తమపై అథార్టీ చలాయించబోతున్న ఆ వ్యక్తికి తండ్రి అతిథి మర్యాదలు చేయటం ఆమెకు నచ్చలేదు. కాని తండ్రి గొప్ప సంస్కారవంతుడని ఆమెకు తెలుసు. శత్రువునయినా తన సరసన కూర్చోబెట్టి సహపంక్తిన భోజనం పెట్టిసాడు!

బీరేంద్ర టీ కప్పు అందుకుని సిప్ చేసి, టీపాయ్‌మీద పెట్టేస్తూ, "మరోసారి బాగా ఆలోచించుకోండి! నా గ్లాస్‌హౌస్‌వల్ల మీ కెలాంటి ఆటంకము లేదు. అది మీకు అడ్డుగా లేదు. ఇక రూల్సంటారా, చెప్పానుగా మ్యూచువల్ అండర్‌స్టాండింగ్! వస్తాను" అంటూ లేచాడు.

"ప్లీజ్ రిమూవ్ విథిన్ ఎ వీక్!" అన్నాడు రాఘవేంద్రరావు సూటిగా.

బీరేంద్ర వెనక్కి తిరిగి రాఘవేంద్రరావు వంక సూటిగా చూసి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళి

పోయాడు.

జ్వలిత తండ్రిని సమీపించి. "ఎందుకు డాడీ, ఇలాంటి వ్యక్తులతో మనకు పేచీ? చూసీచూడనట్టే పోతే మంచి దేమో," అన్నది.

రాఘవేంద్రరావు చురుగ్గా చూశాడు కూతురివంక. "చూడమ్మా, నా కడుపున పుట్టిన బిడ్డ యిలా పిరికి తనంతో బేలగా మాట్లాడుతుందని ఎన్నడూ భావించ లేదు. ఈరోజు వీడు, రేపు మరొకడు, ఎల్లుండి ఇంకొ కడు___అడవి నాక్రమించుకుంటారు. అటవీ సంపదని కొల్లగొడతారు. మాకు ప్రభుత్వం జీతమిస్తున్నది ఇలాంటి స్వార్థపరులతోను అవినీతిపరులతోను చేతులు కలిపి ప్రజా ధనాన్ని కొల్లగొట్టమని కాదు, కాపాడమని! నా విధి నిర్వహణలో నా ప్రాణాలే పోతలసివచ్చినా వెను దీయను. ఇలాంటి మకురుగొడ్లకెలా బుద్ధి చెప్పాలో నాకు బాగా తెలుసు!" అన్నాడు.

జ్వలిత సిగ్గుపడింది. "సారీ! డాడీ! కన్న తండ్రి పట్ల స్వార్థం నా చేత అలా మాట్లాడించింది. అంతే! మీరు మీ డ్యూటీస్‌పట్ల ఎంత సిన్సియరో, ఎంత రిజిడో నాకు తెలుసు! నన్ను క్షమించు!" అన్నది.

రాఘవేంద్రరావు మందహాసం చేసి, "నీ కాలేజి విశే షాలేమయినా చెప్పమ్మా!" అన్నాడు మాటమారుస్తూ.

"డాడీ! మరి అడవిలోకి వెళ్ళామా?"

"చెట్లు, గుట్టలు తప్ప చూడటానికేముందమ్మా? అయినా అడవి ఆల్ మోస్టు చూసేసినట్టే!"

"అటవి జంతువుల్ని చూశ్చేదుగా....!"

"ఇక ఆ ఆలోచన విరమించుకో అమ్మా!"

"అంతేనా డాడీ!"

"రిస్క్ తీసుకోకూడదు బేబీ, తెలీకపోతే యేమో గానీ, అక్కడ క్రూరమృగాలున్నాయని తెలిసి తెలిసి వెళ్ళటం ప్రమాదం!"

"నీ యిష్టం డాడీ!"

"నిరాశపరుస్తున్నానని బాధపడుతున్నావా బేబీ!"

"లేదు డాడీ! నువ్వెందుకు వద్దంటున్నావో తెలుసు కదా! కాలక్షేపం కావటంలేదు!"

"క్యాసెట్సన్నీ కొత్తవే కదమ్మా! నీ అభిమాన రచయితల నవల్సుకూడా తెప్పించాను. ఇంకా యేం కావాలో చెప్పు, సిరిపూర్ నించి తెప్పిస్తాను."

"ఇంకేమొద్దు డాడీ!"

"మధ్యాహ్నం కాన్ఫరెన్స్‌కి వెళ్తున్నానమ్మా! రెండు రోజుల్లో తిరిగివస్తాను."

"ఎక్కడికి డాడీ....!?"

"వరంగల్!"

"మరి నువ్వు లేకుండా...."

"మా స్టాఫ్ అంతా వున్నారు కదమ్మా! నేను, డ్రైవర్, అటెండర్ మాత్రం వెళుతున్నాం. ఠాణేదార్ గోపాల్, గార్డు ఫిలిప్, కుక్ వీరయ్యా నిమ్మల్ని అనుక్షణం కనిపెట్టుకొని వుంటారు."

"అయినా ఇంత సడన్‌గా చెపుతున్నావేమిటి డాడీ! నేనొచ్చినప్పట్నుంచీ కాన్ఫరెన్స్ సంగతే ఎత్తలేదుగా నా దగ్గర!"

"ముందే చెపితే హైద్రాబాద్ వెళ్ళిపోతానని బెదిరిస్తావని!"

"అది సరైన కారణం కాదని నాకు తెలుసు!"

"నీ దగ్గర నిజం దాస్తే లాభం లేదమ్మా.... మొదట

మన తాణేదార్ గోపాల్ ని పంపించాలనుకున్నాం. అయితే నిన్న రాత్రే నిర్ణయం తీసుకున్నాను— నేనే వెళ్ళి రావాలని! ముఖ్యంగా నాయుడి ఆగడాల గురించి, ఈ బీరేంద్ర దురాక్రమణ గురించి, యింకా మరికొన్ని ముఖ్యమైన విషయాలు— నేనే స్వయంగా మాట్లాడా లనుకొంటున్నాను."

"తప్పదా డాడీ!"

"తప్పదు బేబీ! మొదట్లోనే ఈ నిజాల్ని మాకెందుకు చెప్పలేదని డైరెక్టర్లు అడిగితే యేమని సమాధానం చెప్పుకోను! అది నా ప్రిన్సిపుల్స్ కే వ్యతిరేకం. తల వంచుకునే పరిస్థితి రానివ్వను."

జ్వలిత మౌనంగా వుండిపోయింది.

ఆ మధ్యాహ్నం రాఘవేంద్రరావు మరునాడు జరగబోయే కాన్ఫరెన్స్ కి బయల్దేరి వెళ్లాడు.

* * *

మర్నాడు జ్వలితకేమీ తోచలేదు. కాసేపు రికార్డులు విన్నది. కాసేపు పత్రికలు తిరగేసింది. చాలా బోర్ అనిపించింది. తండ్రి మర్నాటికిగాని తిరిగి రాడు! తల్లి కూచోబెట్టి ఎక్కడలేని పిండివంటలు చేసేసి తినమని బలవంతం చేస్తోంది. ఆకల్లేదని చెప్పినా, తినలేనని మొత్తుకున్నా ఆమె వినటంలేదు.

జ్వలిత చెప్పులు వేసుకొని, "అమ్మా, కాసేపు అలా బయట తిరిగొస్తాను!" అన్నది.

సుభద్రమ్మ భయంగా బయటికి తొంగిచూసి, "ఇప్పుడెక్కడికే అమ్మా! ఇది హైదరాబాదు సిటీకాదు, అడవి! పురుగు పుట్రా యథేచ్ఛగా తిరుగుతుంటాయి. అసలే మీ నాన్నగారు లేరాయె! ఇప్పుడొద్దులే తల్లీ!"

అన్నది.

"ఎంత సేపు, ఓ అరగంటలో తిరిగొచ్చేస్తా!"

"ఫిలిప్‌ని తోడు తీసుకు వెళ్ళు, వీరయ్యని పంపించనా?"

"వద్దొద్దు, నే నేం చంటిపిల్లను కాదు; ఒక్కత్తినీ వెళ్ళిరాగలను."

జ్వలిత హడావిడిగా బయటికొచ్చేసింది. ఇంకా అక్కడే వుంటే సిబ్బంది నందర్నీ తనవెంట పంపిస్తూందేమోనని భయంవేసిందామెకు. వెంట కెమెరా తీసుకు వెళ్ళటం మరచిపోలేదు.

అపురూపమైన దృశ్యం కనిపించినప్పుడల్లా దాన్ని ఫిల్ముమీద ముద్రిస్తూ వచ్చింది. ప్రకృతి ఒడిలో పరవశిస్తూ ఆమె చాలా దూరం నడుస్తూ వెళ్ళింది. దార్లో ఆమెకు కుందేళ్ళు, అడవి బాతులు, పురి విప్పి ఆడే నెమళ్ళు, రంగు రంగుల పక్షులు, వాటి శ్రావ్యమైన కూతలు ఆహ్లాదంగా, మనోరంజకంగా కనిపిస్తూ వినిపించాయి.

ఎక్కడ్నుంచో లారీ శబ్దం వినిపించి ఆగిపోయింది జ్వలిత. అడవికి అవతలివైపునించి దూసుకుంటూ వచ్చిందో లారీ. పెద్ద మర్రిచెట్టు వెనక దాక్కొని చూసింది జ్వలిత.

లారీ సరాసరి ఓ కలపలాట్ దగ్గరకు వెళ్ళి ఆగింది. కేబిన్‌లో ముగ్గురు వ్యక్తు లెవరో వున్నారు. బాడీలో నలుగురు మనుషులున్నారు. అంతదాకా కలపలాటు పక్కనున్న నలుగురు వ్యక్తులు లారీని చూసి బయటకొచ్చారు.

కేబిన్‌లోనించి దిగిన వ్యక్తిని చూసి త్రుళ్ళిపడింది జ్వలిత. బుంగమీసాలతో, నెత్తురు ముద్దల్లా వున్న కళ్ళతో లావుగా పొడవుగా క్రూరంగా వున్నాడతను.

అలాంటి వ్యక్తి గురించి తండ్రి యెన్నోసారి వర్ణించి చెప్పాడు. అతని పేరు యేదో వున్నది; గుర్తు రావటం లేదు.

కలపలాటు పక్కనున్న వ్యక్తుల్లో ఒకడు ముందుకొచ్చి, "చెందనం సిద్ధంగుండది నాయుడ్గోరా!" అన్నాడు.

జ్వలితకు వెంటనే అతని పేరు నాయుడని స్ఫురించింది. నాలుగు రోజుల క్రితం తండ్రిచేత చీవాట్లు తిని వెళ్ళిన నాయుడు ఇత నేనన్నమాట! తండ్రి లేకుండా చూసి మళ్ళీ వచ్చాడు.

నాయుడు ఆ వ్యక్తి భుజం తట్టి, "సెభాష్ రా సింగా! మీ గూడెపోళ్ళ కోసమని రంగు రంగుల పూసల పేర్లు, రిబ్బన్‌లు, సిలుకు గుడ్డలు యింకా నువ్వడిగినవన్నీ తెచ్చినాం. తీసుకపో!" అన్నాడు.

ఆ వ్యక్తి, సింగడు — ఆనందంగా తన వెంటనున్న ముగ్గుర్ని వెంట పెట్టుకుని లారీ దగ్గరకు వరుగెత్తాడు.

జ్వలిత చాలా వేగంగా ఆలోచిస్తోంది. ఆటవికుల సాయంతో నాయుడు చందనం చెక్కల్ని అక్రమంగా రవాణా చేయబోతున్నాడు. వేలకి వేల ఖరీదుచేసే చందనాన్ని క్షణాల్లో అడవి నుంచి దాటించబోతున్నాడు. తండ్రిలేడు. ఇలాంటి స్థితిలో ఆ తండ్రి కన్నకూతురిగా ఆ న్యాయాన్ని ఎదిరించవలసిన బాధ్యత తన మీద వున్నది! కాని తను అబల, ఒంటరి స్త్రీ. వాళ్ళు దాదాపు పదిమంది మొరటు మొగాళ్ళు!

వెంటనే రాణేదారుకి, ఫారెస్టుగార్డు ఫిలిప్‌కి తెలియ జెయ్యాలి. వాళ్ళు వచ్చినా యీ నాయుడు లొంగుతాడనే నమ్మకం లేదు! అయినా తన ప్రయత్నం తను చెయ్యాలి! కెమెరాతో ఆ దృశ్యాన్ని ఫోటో తీసింది.

పగలే కాబట్టి ఫ్లాష్ అవసరం లేకపోయింది.

జ్వలిత చెట్టుపక్క నుంచి మెల్లగా మరో చెట్టు చాటుకు ఒంగి నడుస్తూ వెళ్ళింది. సరిగ్గా అప్పుడే ఆమె ముందు నుంచి ఎండుటాకులమీద జరజరా పాకుతుంటూ ఓ నల్లత్రాచు వెళ్తూ కనిపించింది.

జ్వలిత గుండె ఒక్క క్షణం ఆగి కొట్టుకున్నది. పొర పాటున దాని తోక తొక్కితే కస్సున కాటందుకుని వుండేది!

చెట్లమధ్య గుబురుగా పిచ్చిమొక్కల పొదలు భయం కరంగా పెరిగిపోయి వున్నాయి. వాటి వెనుకగా చాటు చేసుకుంటూ మెల్లగా క్వార్టర్సువైపు జరుగుతోంది జ్వలిత.

ఓ పక్క లారీ లోడ్ అయిపోతోంది. తను వెంటనే వెళ్ళి వాళ్ళను తీసుకురాకుంటే లారీ తప్పించుకు వెళ్ళి పోతుంది!

జ్వలిత అప్పుడే చిన్న పొరపాటు చేసింది. వేగంగా వెళ్ళటానికి పరుగెత్తపోయింది. ఆమె కట్టుకున్న ఎర్ర చీర తన ఉనికిని దాచుకోలేక పోయింది. సింగడి కళ్ళలో పడిపోయింది.

"నాయుడ్డొరా, యెవత్తో ఆడది!" అంటూ అరిచాడు సింగడు.

నాయుడుతో బాటు అందరూ ఉలిక్కిపడి చూశారు. జ్వలిత చీర కొంచెం యెత్తిపట్టుకుని పరుగు పెడుతోంది.

"అది ఆఫీసర్ కూతురు బాబూ!" అన్నాడు పని వాళ్ళలో ఒకడు.

"ఉహుఁ! అలాగా. అది యింకా ప్రమాదం. రేయ్

సింగా, నువ్వే తగినోడివి. దాన్ని ప్రాణాలతో వదలకు” అన్నాడు నాయుడు.

“ఒగ్గను!” అంటూ బాణంలా దూసుకుపోయాడు సింగడు. వాడి చేతిలో యెలాంటి ఆయుధం లేదు. అయినా వాడి కాలు ముందుకే సాగిపోయింది.

వెనకనుంచి యెవరో తరుముకురావటం గుర్తించింది జ్వలిత. బాణంలా దూసుకొస్తున్న ఆ కోయ యువకుడ్ని వెంటనే గుర్తుపట్టింది.

సింగడు మరింత దగ్గరగా వచ్చేశాడామెకి. చేయి చాచి పట్టుకోపోయాడు. సరిగ్గా అప్పుడే ఠాణేదార్ జ్వలితను వెతుక్కుంటూ వస్తున్నాడు. జ్వలితను వెంబడిస్తున్న సింగడ్ని చూశాడు.

“ఒరేయ్!” అంటూ పెద్దగా అరిచాడు ఠాణేదార్ గోపాల్.

అంతే! సింగడు అదే వేగంతో వెనుతిరిగి పారిపోయాడు.

జ్వలిత తను చూసిన దృశ్యం గురించి గబగబ చెప్పింది. గోపాల్ పరుగెత్తికెళ్ళాడు పరుగెత్తుతూనే “మీరు ఫిలిప్‌కి కబురు చెప్పండి అమ్మాయిగారూ!” అంటూ అరిచి చెప్పాడు.

జ్వలిత ఫిలిప్ కోసం పరుగెత్తింది. దార్లో ఆమె చీర, లంగా ముళ్ళకంచెలకు పొదలకు చుట్టుకుని చాలా చోట్ల చిరుగులు పడిపోయింది. రాళ్ళు గుచ్చుకుని గాయాలయ్యాయి. చెప్పులతో పరుగెత్తలేక వాటిని దార్లో ఓ చోట వదిలేసింది. తను చేసినపని యెంత పొరపాటో, ఆ అడవిలో చెప్పుల్లేకుండా నడవటం ఎంత దుస్సాధ్యమో

తెలిసివచ్చిందామెకి.

గోపాల్ వెళ్ళేసరికి లారీ చాలావరకు లోడ్ అయిపోయింది.

"మిస్టర్ నాయుడూ! లారీ వెంటనే అన్‌లోడ్ చేయించు!" అన్నాడు గోపాల్ దగ్గరగా.

నాయుడు క్రూరంగా నవ్వాడు.

"ఓరి పిచ్చివాడా! మీ బాస్‌లాగా నువ్వు పొగరుబోతోడివి రా! ఏంటీ అన్‌లోడ్ చేయించాలా? లారీనా, నిన్నా?"

నాయుడితో పాటు అతని మనుషులంతా పకలబడి నవ్వారు.

గోపాల్ కోపంతో "నోర్ముయ్యి" అంటూ హుంకరించాడు.

నాయుడు మరుక్షణం సుడిగాలిలా దూసుకుని వచ్చి గోపాల్ రెండు చెంపలు చెళ్ళున చరిచాడు. గోపాల్ చేతిలో ఎలాంటి ఆయుధమూ లేదు. నేలమీదికి ఒంగి పొడవుపాటి వెదురు బొంగు నందుకున్నాడు. నాలుగు దెబ్బలు వేశాడు నాయుడి నెత్తిమీద. రెండు తగిలాయి రెండు తప్పించుకున్నాడు.

అయితే ఆ తరక్షణంలో లోడ్ చేస్తున్న నాయుడు మనుషులు ఆటవికులు చేతికందిన కర్రలతో పొడవాటి చందనం చెక్కలతో గోపాల్ మీద విరుచుకుపడ్డారు.

గోపాల్ వాళ్ళ ధాటికి నిలబడలేక పోయాడు. తూలి నేలమీద వెల్లకిలా పడిపోయాడు.

అంతే! ఒక్కసారిగా అతని శరీరాన్ని శత్రువుల ఆయుధాలు నుజ్జు నుజ్జు చేసేశాయి.

"అబ్బా...." అంటూ గోపాల్ అంతిమశ్వాస వదిలే

కాడు.

"ఒరే, వీడ్ని లారీలో చెక్కలమీద పడేసి పైన చందనం చెక్కలు పేర్చెయ్యండిరా" అంటూ ఆజ్ఞాపించాడు నాయుడు.

మరుక్షణం గోపాల్ శవంతో లారీ రివ్వున సాగుడు పోయింది. సింగడు, అతనితోటి ఆటవికులు క్షణాల్లో సర్వేతోపు దాటి మాయమైపోయారు.

ఫిలిప్, రుక్ వీరయ్య, వాచ్‌మన్ అక్కడికొచ్చేసరికి లారీ వెళ్ళిపోయింది. గోపాల్ ఎక్కడా కనిపించలేదు. వాళ్ళు ఆశ్చర్యంగా ఆ ప్రదేశమంతా వెతుకుతుండగా వెనుకనుంచి జ్వలిత వచ్చేసింది. ఆమెను క్వార్టర్స్ వదలి రావద్దని చెప్పివచ్చారు ఫిలిప్ బృందం. అయినా ఆమె ఊరికే వుండలేక వారి వెనక బయలేరింది.

"మీరెందు కొచ్చారమ్మా, రావద్దన్నాం కదా!" అన్నాడు వీరయ్య.

"ఫరవాలేదు. గోపాల్ ఏరీ?" అడిగింది జ్వలిత.

"అదే అర్థం కావటంలేదు అమ్మాయిగారూ!" అన్నాడు వాచ్‌మన్.

"ఏమిటి, యిక్కడ రక్తం మరకలు ఎవరివి?" జ్వలిత వంగి నేలమీద పరీక్షగా చూసింది.

"అవును, రక్తం మరకలే! ఇవిగో పక్కన రక్తంతో తడిసిన కర్రలు, చెక్కలు వున్నాయి" ఫిలిప్ అరిచి చెప్పాడు.

"అయితే గోపాల్‌ని వాళ్ళు...." జ్వలిత అర్థోక్తిలోనే ఆగిపోయింది.

అందరూ ఒకరి ముఖాలొకరు భయం భయంగా

చూసుకున్నారు!

ఫిలిప్ మోకాళ్ళమీద కూచుని 'క్రాస్' వేసు కున్నాడు, గుండెలమీద చేతులు వేసుకుని.

"మరి, గోపాల్ శరీరం ఇక్కడెక్కడో వుండాలి కదా?" జ్వలిత పరిసరాల్ని గమనిస్తూ అన్నది.

అప్పటికే ఫిలిప్, వీరయ్యా, వాచ్‌మన్ ప్రతి పొద, గాలించి వచ్చారు. ఎక్కడా గోపాల్ శరీరం కనిపించ లేదు—గోపాల్‌ని చంపేశారని వాళ్ళందరికీ మనసులో నిర్ధారణ అయిపోయింది. కాని పైకి చెప్పుకోవటానికి ఒక్కరూ సాహసించలేకపోతున్నారు.

"మీ తాణేదార్ యేమయిపోయాడో నే చెప్పనా?" అన్న మాటలు వినిపించి అందరూ చగ్గున తలలు తిప్పి చూశారు.

ఎదురుగా బీరేంద్ర! ఎంతో నిర్లక్ష్యంగా నడుస్తూ, చేతో గన్ పట్టుకుని కోరగా చూస్తూన్నాడు.

జ్వలిత అతనివంక చూసి వెంటనే చూపు తిప్పుకుంది. బీరేంద్ర ఆమెని తినేసేలా చూస్తున్నాడు. తన తండ్రి కన్న వయసులో పెద్దవాడై వుండీ కూడా పరాయి ఆడ పిల్లవైపు కాముక దృష్టితో చూస్తూన్న ఆ మేజర్ పట్ల జుగుప్స, అసహ్యం కలిగాయా మెకు.

ఫిలిప్ చేతిలోని గన్‌మీద అతని చేతులు బిగుసు కున్నాయి. ఎన్నాళ్ళుగానో తమకు పెద్ద సమస్యగా తయారయిన మేజర్ వంక ప్రశ్నార్థకంగా చూశాడు ఫిలిప్!

"నాయుడు, అతని మనుషులు మీ తాణేదార్‌ని బహుమానంగా తీసుకువెళ్ళారు" ఇంగ్లీషులో చెప్పాడు బీరేంద్ర.

"ఏమిటి మీరంటున్నది?"

"అర్థం కాలేదా? నాయుడిమీద పెద్ద హీరోలా ఉత్త కత్తిముక్కతో ఫైట్ చేయబోయాడు మీ ఆఫీసర్. అంతే, చంపేసి తమ వెంట శవాన్ని తీసుకుపోయారు వాళ్ళు!"

అందరూ నిశ్చేష్టులై నిల్చుండిపోయారు. శవాన్ని కూడా వదలకుండా తీసుకుపోయారా? ఆ నాయుడెంత రాక్షసుడు?....

"అయితే, మీరందంతా చోద్యం చూస్తూ కూర్చున్నారా? నాయుడ్ని యెదిరించి బుద్ధి చెప్పలేకపోయారా? ఇదేనా మీ మిలిటరీ న్యాయం?" ఆవేశంగా అడిగాడు ఫిలిప్.

మేజర్ ఫక్కున నవ్వి, "మీ ఆఫీసర్ నా మీద నే కత్తి దూశాడు కదా? అతని స్టాఫ్‌ని నే నెందుకు రక్షించాలి? అనవసరంగా ఆ నాయుడితో నే నెందుకు శత్రుత్వం పెట్టుకోవాలి?" అన్నాడు.

జ్వలితకు కోపంతో ఒళ్ళు దహించుకుపోయింది. "మిస్టర్ మేజర్! మా నాన్నగారిమీద కత్తితో ఓ నిండు ప్రాణాన్ని పదిమంది రాక్షసులు నిలువునా తీసేస్తుంటే చూస్తూ వినోదం చూడటం మానవత్వ మనిపించుకోదు" అన్నది.

మేజర్ ముఖం ఎర్రబడింది. "నీ ఫాదర్ రూల్స్ మాట్లాడేడు కదా! లేకుంటే ఆ నాయుడి లాంటివాళ్ళని పదిమందిని ఊచకోతగా నరికెయ్యగలను. కాని కల్పించుకోను. నే నీ అడవి కొచ్చింది జంతువుల్ని వేటాడటానికి మనుషుల్ని కాదు!" వక్రంగా నవ్వాడు.

జ్వలిత యేదో చెప్పబోతే వీరయ్య ఆమెను వారించి,

"పదండి అమ్మాయిగారూ! ఈ పెద్దాయన్తో వాదన మనకి అనౌసరం. రేపు పెద్దయ్యగారొచ్చాక చెపుదాం, పదండి. అమ్మగారు మీ కోసం బెంగ పెట్టుకుంటారు" అన్నాడు.

జ్వలిత కొద్ది క్షణాలు అక్కడే నిల్చుండిపోయింది. అంతిక్రితంవరకు జీవంతో వుండిన గోపాల్ ఈ క్షణంలో నిర్జీవుడు! అతని నిలువెత్తు విగ్రహం ఇంకా ఆమె కళ్ళ ముందు మెదుల్తూనే వున్నది! తను చెప్పాకనే, అతను నాయుడి మీదికి నిరాయుధంగా పోరాటానికి వెళ్ళిపోయాడు. సమయానికి ఫిలిప్ వచ్చివుంటే అతని ప్రాణాలు పోయివుండేవి కాదు!

అతని ఆత్మశాంతికి ప్రార్థిస్తున్నట్టు రెండు నిమిషాలు అలానే వున్నాక ముందుకి కదిలింది. వెనుకనుంచి మేజర్ కళ్ళు తనని నఖశిఖ పర్యంతం ఎక్స్‌రే తీస్తూంటాయని ఆమెకు తెలుసు. ఆమె మనసంతా విషాదంతో నిండిపోయింది. తండ్రి రాగానే నాయుడిమీద ప్రతీకారం తీర్చుకోవాలి! అలాగే బీరేంద్రని తక్షణం అడవినుంచి వెళ్ళగొట్టించాలి! అతని అద్దాల మందిరాన్ని నేలమట్టం చేయించాలి.

ఆమె మనసు యిల్లు చేరేవరకూ కుత కుత లాడ్తూనే వున్నది.

* * *

మర్నాడు రాఘవేంద్రరావు రాగానే గోపాల్ మరణవార్త తెలియజేసింది జ్వలిత.

స్థాణువులా నిల్చుండిపోయాడు రాఘవేంద్రరావు. గోపాల్ నిజాయితీకి, నీతికి నిలబడే మనిషి. ఇదివరకటి ఆఫీసర్‌తో అతనికి మనస్పర్థలు రావటానికి కారణం—ఆ

ఆఫీసర్ అవినీతికి, గోపాల్ నీతికి ప్రతినిధులు కావటమే! ఆ ఆఫీసర్ బదిలీ అయి వెళ్తూ గోపాల్ మీద చాలా చెడ్డగా రాసి వెళ్ళిపోయాడు. కాని డైరెక్టరేట్ లో గోపాల్ కి మంచి చరిత్ర వుంది! అందుకే అతనిమీద ఎలాంటి చర్య తీసుకోబడలేదు.

ఫిలిప్ కొత్తగా బదిలీ అయివచ్చాడు. తనకన్న పది హేనురోజుల ముందు! అయితే అతను గోపాల్ కన్న స్ట్రిక్ట్ అని ఆదిలోనే గ్రహించాడు తను. గోపాల్ ని, ఫిలిప్ ని రెండు కళ్ళలాగా చూసుకొంటున్నాడు రాఘవేంద్రరావు.

కొద్ది క్షణాలవరకు ఆ షాక్ నించి తేరుకోలేదు రాఘవేంద్రరావు.

ఆ తర్వాత అతని నోటినించి ఒకే మాట బయట పడింది. "నాయుడూ! నీ అంతు చూస్తాను!"

జ్వలిత మనసులోను అదే మాట ప్రతిధ్వనించింది.

"మిస్టర్ ఫిలిప్! అడవిలోకి బయటున్నించి ఈగ కూడా మారటానికి వీల్లేదు. మనవాళ్ళందర్నీ కీలకమైన స్థానాల్లో వుంచి రాత్రింబవళ్ళు కాపలా కాయండి. అదనంగా స్టాఫ్ కావాలని నిన్న కాన్ఫరెన్స్ లో చెప్పాను. రెండు మూడు రోజుల్లో స్టాఫ్, మందుగుండు సామాను వస్తాయి. వీరేంద్ర కోసం స్పెషల్ ఆర్మ్డ్ పోలీసు వస్తుంది. మేళతాళాలతో సాగనంపుతారు" అన్నాడు రాఘవేంద్రరావు.

అతని చుట్టూ స్టాఫ్ అందరూ చేతులు కట్టుకుని నించు న్నారు.

"నేను రేపు ఉదయం ఢిల్లీ వెళ్లాలనుకొంటున్నాను. గోపాల్ హత్య గురించి యిన్ఫర్మేషన్ యిచ్చివస్తాను.

నాయుడి అడ్రసు యెవరికయినా తెలుసా?" అడిగాడు రాఘవేంద్రరావు.

"గోపాల్ ఒక్కడికే తెలుసు సార్! కాని యిప్పుడతను లేడు" వాచ్‌మన్ చెప్పాడు.

"ఇంకెవరికీ తెలియదా?"

"వరంగల్ అని తెలుసు సార్! వరంగల్ వెళ్తే తెలియకపోదు."

"సరే, ఆ సంగతి పోలీసులే చూసుకుంటారు. యెన్నాళ్ళు తప్పించుకోగలడు? అలవాటుపడ్డ వక్రదారి కాయక మానదు! రెడ్ హాండెడ్‌గా పట్టుకు తీరాను!" అన్నాడు రాఘవేంద్రరావు.

గోపాల్ మరణం అతన్ని బాగా కుంగదీసింది. అదే సమయంలో అతని రక్తాన్ని మరిగించింది. నాయుడు, వీరేంద్ర నరరూప రాక్షసుల్లాగా, తన సామర్థ్యాన్ని సవాల్ చేస్తూన్న ప్రత్యర్థుల్లా కనిపిస్తూన్నారు. వికటాట్టహాసం చేస్తూ అతని మీదకి విరుచుకుపడుతున్నట్టు తన అసమర్థతను వేలెత్తి చూపుతున్నట్టు అనిపించింది రాఘవేంద్రరావుకి.

జ్వలిత ఆ తర్వాత చెప్పింది. "డాడీ! ఇక నాలుగు రోజులే వున్నాయి నా సెలవులు. వెళ్ళాలి!"

రాఘవేంద్రరావు ఆవేశం, ఆ పాటికి చాలావరకు తగ్గింది. "అలాగేనమ్మా! నేను రేపు వరంగల్ వెళ్ళి వచ్చాక వెళ్దువులే....ఏమిటో నువ్వొచ్చావే గాని సీతో పట్టుమని రెండు రోజులు గడిపింది లేదు. మా ఫారెస్టు వ్యవహారాల్లోనే సరిపోయింది" అన్నాడు కూతురి వంక ప్రేమగా చూస్తూ.

అన్నట్లుగానే మరునాడు రాఘవేంద్రరావు బయల్దేరి

వరంగల్ వెళ్ళిపోయాడు. జ్వలిత మళ్ళీ ఒంటరితనం ఫీలయ్యింది.

అప్పుడు గుర్తు వచ్చిందామెకు— క్రితంరోజు తీసిన ఫిల్ము సంగతి! వెంటనే యింట్లో ఓ గదిని డార్క్ రూంచేసి ఫిల్మ్ డెవలప్ చేసింది. నాయుడు లారీ లోడింగ్ చేస్తూండగా తీసిన స్నాప్ చాలా స్పష్టంగా వచ్చింది. అది కలర్ ఫిల్ము. ప్రింట్లు వేయడం తనకొచ్చు గాని, అందుకు కావలసిన పరికరాలు లేవు. నాయుడ్ని ప్రభుత్వానికి అప్పగించటానికి ఆ స్నాప్ చాలా ఉప యోగపడుతుంది! హైదరాబాద్‌లో ప్రింట్లు వేయించి తండ్రికి పంపించాలి.

ఫిల్మ్‌లో ముద్రించబడ్డ ప్రకృతి దృశ్యాలు చూడ గానే ఆమె మనసు మళ్ళీ ఫోటోలు తియ్యాలనే దృఢ మైన కోరికకు వశమయిపోయింది. సూట్ కేస్ వెతికి చూసింది రీల్సుకోసం. ఒకే ఒక రీల్ వున్నది. తల్లితోను, తండ్రితోను కలిసి స్నాప్స్ తీసుకోవాలని దాన్ని దాచి వుంచింది. సగం రీలు వాడేసి తక్కినది దాచిపెట్టాలి అనుకున్నది.

తల్లి అభ్యంతరపెట్టింది అడవిలోకి వెళ్ళొద్దని. కాని జ్వలిత వినలేదు. ఒక్క అరగంటలో తిరిగొస్తానని ఆమెకు నచ్చచెప్పి బయటపడింది.

ఓ పదిహేను నిమిషాలు అడవిలో తిరిగినా మంచి దృశ్యం ఏదీ దొరకలేదు. దూరంగా సీ రెండలో యేదో మెరుస్తూన్నట్లు కనిపించింది. నాలుగడుగులు వేసి చూస్తే అదేమిటో ఆమెకర్థమైపోయింది.

గ్లాస్ హౌస్! బీరేంద్ర కట్టుకున్న అద్దాల యిల్లు అదే అయ్యుంటుంది. ఆమె మనసు కొద్ది క్షణాలసేపు

అతనిపట్ల జుగుప్సతోను, అసహ్యంతోను నిండిపోయింది.
"ఛీ....ఏం మనిషి!" అనుకున్నది.

వెనక్కి తిరిగింది యింటికి వెళ్ళిపోవటానికి.

ఎదురుగా పర్వతంలా నిల్చున్న వ్యక్తిని చూసి ఒక్క క్షణం ఉలిక్కిపడింది.

అతను బీరేంద్ర! క్రూరంగా నవ్వుతున్నాడు. ఆ నవ్వు తోడేలు నవ్వులా వుంది. లేడిమీదకు ఉరకబోయేముందు పులి నవ్విన నవ్వులా వుంది. అతని చేతిలోని రైఫిల్ పిచ్చివాడి చేతిలోని విచ్చుకత్తిలా వుంది.

జ్వలిత అతని పక్కనుంచి తప్పుకొని వెళ్ళబోయింది.

బీరేంద్ర వికటంగా నవ్వాడు.

"హల్లో మిస్, ఏమిటి మిట్టమధ్యాహ్నం అడవిలో విహరిస్తున్నావు?" అన్నాడు ఇంగ్లీషులో.

జ్వలిత చురుగ్గా చూసిందతని వంక.

"ఇటీజ్ అన్నెససరీ టు యూ!" అన్నది తీవ్రంగా.

బీరేంద్ర మళ్ళీ పెద్దగా నవ్వాడు.

"ఇదివరలో అయితే నాకు అనవసరమే గాని, ఇప్పుడు, ఈ సమయంలో చాలా అవసరం. లెటజ్ గో టు అవర్ గ్లాస్ హౌస్, వెల్ కం!"

"హద్దు మీరుతున్నారు మేజర్!"

"నో, నో. ఫ్రెండ్లీగా ఆహ్వానిస్తున్నాను. నా గృహం పావనం చేస్తావని ఆశ!"

"దారి విడువ్. నేను వెళ్ళాలి!" తనూ ఏకవచనంలోనే మాట్లాడింది జ్వలిత ఆంగ్లంలో.

"అలాగే వెళ్ళిపోదువు గాని! నా ఆహ్వానం మన్నించటం నీ కనీస ధర్మం."

"వాదన అనవసరం!" అతని పక్కనుంచి పోబోతూ,

ముళ్ళకంచెలు వున్నాయి. వాటిని దాటుకుని వెళ్ళటం కష్టం. అందుకే దారి కడ్డుగా నిల్చుని వున్న మేజర్ ని సౌమ్యంగా అడిగింది తప్పుకోమని.

వీరేంద్ర విలాసంగా నవ్వాడు.

"కమాన్ డియర్!" అంటూ ఆమె జబ్బ పట్టుకొన్నాడు.

జ్వలిత ఈడ్చి అతని చెంపమీద కొట్టింది. ఆమె శరీరం అవమానంతో, క్రోధంతో ఒణికిపోతోంది. భయం వల్ల కాదు. ఆమె కళ్ళలో నీరు తిరిగింది, పిరికితనంతో కాదు—పరాభవంవల్ల.

మేజర్ కళ్ళు నిప్పులు కురిపించాయి. అమాంతం ఆమెని రెండు చేతుల్తోను గాల్లోకి లేపి, గ్లాస్ హౌస్ వైపు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడిచాడు. జ్వలిత గింజుకుంటూ 'హెల్ప హెల్ప' అంటూ అరచింది. వీరేంద్ర లెక్క చెయ్యలేదు.

జ్వలిత గుప్పిళ్ళు మూసి అతని వీపుమీద, ముఖంమీద కొట్టింది. చక్కిలిగింత లయినట్టు కిచకిచ నవ్వుకుంటూ అవలీలగా ఆమెను మోసుకుని గ్లాస్ హౌస్ చేరాడు.

జ్వలిత చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. ఆమె కేకలు అరణ్య రోదనమే అయింది.

వీరేంద్ర బాగా తాగివున్నాడు. ఖరీదైన ఫారిన్ విస్కీ వాసన ముక్కుపుటాలను అదరగొడుతోంది. గ్లాస్ హౌస్ లోపల కేంప్ కాట్ పరిచివున్నది. అమాంతం దానిమీద జ్వలితను పడేశాడు.

జ్వలిత స్ప్రింగులా పైకి లేచింది. లేస్తూనే అతని డొక్కలో బలంగా తన్నింది. మేజర్ ఆ దెబ్బకు అదిరి పడ్డాడు. నేలమీద పడిపోభోయి నిలదొక్కుకున్నాడు.

జ్వలితను రెండు జబ్బలు పట్టుకుని కోపంగా కసిగా మీదికి లాక్కున్నాడు. అతని జబ్బమీద గట్టిగా కొరికింది జ్వలిత. ఆమె పళ్ళు దిగి గాట్లు పడి రక్తం చిమ్మింది.

"అబ్బా!" అంటూ జబ్బ పట్టుకున్నాడు బీరేంద్ర.

అతనికి పిచ్చికోపం వచ్చేసింది. గన్ గ్లాస్ గోడకి ఆనించి ఆమెమీదికి లంఘించాడు. ఆమె చీరకుచ్చిళ్ళు లాగటానికి బొడ్డుమీద చెయ్యి వేయబోయాడు.

జ్వలిత యెగిరి అతని గుండెలమీద తన్నింది. ఆడ పులిలా, పడగ విప్పిన కోడెతాచులా కనిపించిందామె మేజర్ కళ్ళకు.

రెండు చేతులతోను ఆమెను చుట్టేసి యెత్తి కేంప్ కాట్ మీద పడేసి చేతులతో లేవకుండా అదిమిపట్టాడు. జ్వలిత అతని పశుబలానికి లొంగదల్చుకోలేదు. అతని ప్రాణం తీయటమో, తన ప్రాణం తీసుకోవటమో యేదో ఒకటి తేలిపోవాలనే కృత నిశ్చయంతో వున్నది!

అతను తనమీద పడబోతున్న సమయంలో వూచి అతని కాళ్ళమధ్య తన్నింది. సున్నితమైన స్థానంలో దెబ్బ తగలగానే బీరేంద్ర విల విల్లాడాడు. ఈ లోపల అతని మొహంమీద తన వాడి గోళ్ళతో రక్కేసింది జ్వలిత.

దెబ్బమీద దెబ్బ తట్టుకోవటం మేజర్ లాంటి వాడికైనా సాధ్యం కాలేదు. కాని అతను లెక్క చెయ్యలేదు. ఎలాగయినా ఆ పూట తన పాశవిక కోరికను ఎర చెయ్యాలనే దృఢ సంకల్పంతో మళ్ళీ ఆమెమీద పడ్డాడు.

జ్వలిత తనకి చేతనైన విధంగా అతన్ని ప్రతిఘటి

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకూ చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించనవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

పోంది. క్షణ క్షణానికి వీరేంద్ర పశుబలం విజృంభిస్తోంది. ఇంకెంత సేపో తను ప్రతిఘటించలేనని అర్థమైపోయిందామెకు.

వీరేంద్ర కర్కశంగా నవ్వుతున్నాడు. విజయగర్వంతో క్రూరంగా ఆమె కళ్ళలోకి చూశాడు. జ్వలిత అందుబాటులో ఆయుధమేదైనా వుందా అని వేయి కళ్ళతో వెతుకుతోంది. నిస్సహాయతతో, ఉక్రోషంతో, ఒక నీచుడి చేతిలో కన్యాత్వం నాశనం కాబోతున్నందుకు జుగుప్సతో, అసహ్యంతో, టెన్షన్ తో, సతమతమవుతోంది. మరికొన్ని క్షణాల్లో ఆమె జీవితం నాశనం కాబోతుండగా తుపాకీ పేలిన శబ్దం కర్ణకఠోరంగా వినిపించింది.

జ్వలిత సంభ్రమంతోను, వీరేంద్ర అదురుపాటుతోను అటు చూశారు.

ఎదురుగా గన్ తో ఫిలిప్ నిల్చుని వున్నాడు.

మేజర్ వీరేంద్ర తొట్రుపడ్డాడు.

"వెంటనే ఆమెని వదిలెయ్యి. లేకుంటే నిన్ను కాల్చి పారేస్తాను" అన్నాడు ఫిలిప్.

వీరేంద్ర ఆమెను వదిలి లేచి నుంచుని చేతులు పైకెత్తాడు. అదే అదనుగా జ్వలిత దుస్తులు సర్దుకుని గ్లాస్ హౌస్ బయటికొచ్చేసింది.

"అమ్మాయిగారూ. మీరు వెంటనే యింటికి వెళ్ళిపోండి! వీడి సంగతి నేను చూసుకుంటాను" అన్నాడు ఫిలిప్.

జ్వలిత అప్పటికే మానసికంగాను, శారీరకంగాను బాగా అలిసిపోయి వుండటంవల్ల వెంటనే ఫిలిప్ చెప్పినట్టే చేసింది.

దార్లో ఆమెకు పడిపోయిన కెమెరా దొరికింది. ఇందాకా వీరేంద్ర తన నెత్తుకుపోతున్నప్పుడు మెళ్లోంచ జారి పడిపోయింది కెమెరా. ఆ హడావిడిలో దాని గురించి పట్టించుకోలేదు. ఖరీదయిన ఇంపోర్టెడ్ కెమెరా అది!

వంగి దాన్ని అందుకున్నది. ఓ పదిమీటర్లు నడిచిందో లేదో వెనక నుంచి గన్ పేలిన శబ్దం, దాని వెనక 'అమ్మో!' అన్న చావుకేక వినిపించాయి.

గుండెలు గుభిల్లుమన్నాయి జ్వలితకు.

ఎవరిదా కేక? చూడగా ఫిలిప్ లా వున్నది! తనిప్పుడేం చెయ్యాలి? ఏం చెయ్యగలదు?

ఆమె వెనుతిరిగి చూసింది. వెనుక దూరంగా వీరేంద్ర పరుగెత్తుకొస్తున్నాడు అతని చేతుల్లో గన్ వుంది! బహుశా ఫిలిప్ ని చంపేసి వుంటాడు తనకోసం పరుగెత్తుకొస్తున్నాడు. అతని గురించి బయటపెట్టకుండా చంపేస్తాడు, అనుమానం లేదు!

జ్వలిత ముందుకు పరుగెత్తింది. క్వార్టర్సు యింకా చాలా దూరమున్నది. ఇప్పుడెలా? తను క్వార్టర్సు చేరకుండానే వీరేంద్ర తనని పట్టేసుకుంటాడు. అతని చేతిలో రైఫిల్ వుంది! కాల్చేస్తాడు దూరంనించే!

జ్వలిత ఆలస్యం చెయ్యలేదు. అక్కడ గుబురుగా చెట్లు పెరిగివున్నాయి. చెట్టెక్కేస్తే అతనికి కనిపించదు. అతను వెళ్ళిపోయాక యెప్పుడో చెట్టు దిగి వెళ్ళొచ్చు!

జ్వలిత ఎత్తు తక్కువగా వున్న చెట్టు చూసుకొని చకచకా ఎక్కేసింది. మొదట కాళ్ళు పట్టు చిక్కక జారిపోయినా యెలాగో నిలదొక్కుకొని ఎక్కేసింది. గుబురు మధ్య కూచుని చూస్తోంది. (సశేషం)

